

నాడు నిన్ను నమ్మాను

# ఈ సంచికలో



ముఖచిత్రం : 'వాసక సజ్జికలు'

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య




"'నెరవేరిన ఆశయం, అన్వేషణ' ఈ రెండుకథలు చాల బాగున్నవి. రచయితలకు నా హృదయపూర్వక అభినందనలు. చక్రనేమి సీరియల్ చాలా బాగుంది. మాధవి కూరగాయ లమ్మే వేషం రచయిత్రి బాగా వర్ణించారు. ముఖచిత్రం చాలా బాగుంది."

కుమారి కె. కృష్ణవేణి
అయ్యవారి పోలవరం

"యువలోని "నమ్మితాను, నన్ను అర్థం చేసుకోరూ, కామిని" అనేకథలు నాకు నచ్చినవి. రచయితా, రచయిత్రులకు నా అభినందనలు. మరీ కంతాభరణంలాంటి వడ్డాదివారి చిత్రాలూ, కార్టూన్లూ పత్రికకే వన్నెతెచ్చాయి. ముఖ్యంగా కోడూరి కౌసల్యాదేవిగారి "చక్రనేమి" యింతవరకు ప్రవాహావేగంలా సాగిపోతోంది."

మిస్. స్వర్ణ
కృష్ణాయపాలెం,

"'నన్ను అర్థం చేసుకోరూ!' చాలా బాగున్నది. కథను చిత్రించడములో రచయిత్రి మంచి నేర్పును చూపారు. ఆమెకు నా అభినందనములు."

భవానీశంకర్

"కోడూరి కౌసల్యాదేవిగారి "చక్రనేమి" ప్రతినెల మనస్సును ఉర్రూతలూగించివేస్తోంది. వున్న కథల్లో "అన్వేషణ, ముంజేతికంకణం, నెరవేరని ఆశయం" ఈ మూడుకథలు చాలా బాగున్నాయి."

వి. లక్ష్మి
శ్రీకాకుళం

"కథలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా "నన్ను అర్థంచేసుకోరూ?" అంటూ చాలారోజులకు కనిపించిన ముప్పాళ రంగనాయకమ్మగార్ని ఇకముందుకూడా ఇటువంటి మంచి కథలు వ్రాయమని కోరుతున్నాను. 'చక్రనేమి' వ్రాస్తున్న కోడూరి కౌసల్యాదేవిగారు పాత్రలను చాలా బాగా తీర్చిదిద్దుతున్నారు."

నానాజీ
భద్రాచలం

"శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు వ్రాసిన 'నన్ను అర్థంచేసుకోరూ?' కథ చాలా బాగుంది. ఆమె కథలు స్త్రీమనస్తత్వానికి ప్రతిబింబాలు. భర్తగా పురుషుని అహంకారాన్ని, భార్యగా అభిమానవతియైన స్త్రీ యెంత మనఃక్షోభ ననుభవిస్తుందో 'రాజేశ్వరి' పాత్రద్వారా రచయిత్రి నిరూపించారు...."

శారద, గుంటూరు




సంపాదకుడు : చక్రపాణి

సంపుటి 9 | మే 1964 | సంచిక 5

## కాశ్మీరు కేసరి

గత నెల 8వ తేదీన షేక్ అబ్దుల్లా విడుదల జరిగింది. ఈ వార్త విన్నప్పుడు ఆబాలగోపాలము ఆనందించారు. ఏ రాజకీయ పార్టీకూడా అడ్డుపడలేదు. ఏ మత పక్షమూకూడా తమ వ్యతిరేకతను చూపలేదు.

మహాత్ముని శిష్యునిగా, నెహ్రూ అనుచరునిగా, షేక్ సాహెబ్ పట్ల ప్రజలకు భక్తి విశ్వాసాలు కలవు. అందుచేతనే, 1953 సంవత్సరంలో ఆయన అనుసరించిన ఆత్మహత్యా సదృశమైన విధానాన్ని ప్రజలేమి, ఆయన సన్నిహితులేమి, మిత్రులేమి మరచిపోయారు. ఆయన విడుదలకు ప్రయత్నించారు.

జైలునుంచి విడుదలైన తర్వాత, తన పాతమిత్రులతో సంప్రతించకుండా, అనుయాయులతో సమాలోచించకుండా, అబ్దుల్లా అభాయిత్యమైన ప్రసంగాలు చేయటం; ప్రజా విశ్వాసానికి గొడ్డలిపెట్టుగా ప్రతిధ్వనించింది.

కాశ్మీరు భవితవ్యం ఎన్నడో తేలిపోయింది. భారతదేశంలో కాశ్మీరు చేరికను అక్కడి ప్రజలే నిర్ణయించారు. రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వ స్థాపన, ప్రజాపాలన సాగుతున్నది.

మిత్రరాజ్య సమితిలో ఈ నగ్నసత్యాన్ని న్యాయబద్ధంగా కాదని ప్రత్యక్షంగా చెప్పగల సాహసం ఏ ఒక్క ప్రజాస్వామ్య దేశానికి లేకపోయిన విషయం

అందరికీ తెలిసిన సంగతే. ప్రత్యేక సదుపాయాలకోసం, స్వప్రయోజన సాధన కోసం ప్రయత్నిస్తున్న పశ్చిమ రాజ్యాలు సహితం, పరోక్షంగా మాత్రమే, పాకిస్తాన్ ప్రతాపాలకు వంతపాట పాడుతున్న వని షేక్‌సాహెబ్‌కూడా విదితమైన విషయమే.

భారత పౌరునిగా, తన ధర్మాన్ని విస్మరించి, రాజ్యాంగ రచయితగా తన కర్తవ్యాన్ని విడిచి, కాశ్మీర్ భవితవ్యము తేల్చటానికి జనవాక్య సేకరణగాని, లేక అటాంటి మరో మార్గముగాని అవసర మని షేక్ అబ్దుల్లా ప్రసంగించటం అత్యంత శోచనీయము.

"కాశ్మీరును పాకిస్తాన్‌తో విలీనం చేయడం వాంఛించడం లే"దని ఒకచోట ప్రసంగిస్తూ, మరొకచోట "భారతదేశంలో కాశ్మీరు చేరిక కృత్రిమమైనదని" ప్రచారం చేయటం, ఇంకొకచోట "కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తి తాను ఎన్నడూ కోరలే" దని వక్కాణించడం, వగైరా ధోరణి పరిశీలిస్తే తాను రాజకీయంగా పొందిన పరాజయానికి ప్రతీకారాన్ని తీర్చుకోవటముకోసం ప్రయత్నిస్తున్నట్లుగా విజ్ఞులకు స్ఫురించక మానదు.

ప్రజా నిర్ణయాన్ని కాలరాచి, రాజ్యాంగమును అగౌరవ పరుస్తూ, దేశ శ్రేయస్సుకు భంగకరంగా, ప్రసంగిస్తూ, దేశ విద్రోహకర శక్తులకు స్వప్రయోజన సాధకుల, కుతంత్రములకు వీలుగా ప్రచారం సాగించటం, షేక్ సాహేబ్‌కు అనుచితం. దీని మూలకంగా, ప్రజా శ్రేయస్సుకు, దేశభద్రతకు తీవ్ర విఘాతం కలుగుతుంది. ఇటువంటి చర్యలుగాని, విధానంగాని యే దేశమూ సహించదు; యే ప్రభుత్వమూ ఆమోదించదు; యే దేశ భక్తుడూ అంగీకరించడు; యే పౌరుడూ ఓర్చుకొనలేడు.

భారతదేశం అత్యవసర పరిస్థితినుంచి యింకా బయట పడలేదు. ఒకవైపు పాకిస్థాన్ కవ్వింపులు, మరొకవైపు చైనా దురాక్రమణ, యింకొక మూల పశ్చిమ రాజ్యాల కుయుక్తులు. ఇట్టి సంకట పరిస్థితిలో; ఒకవ్యక్తి యెంత గొప్పవాడైనా, అతని చర్యలు దేశ భద్రతకు భంగకరంగా పరిణమించ గల ప్రమాదం పొడచూపినప్పుడు తగిన చర్య తీసుకోవడం అనివార్యం కావడం అతి సాధారణ విషయము.

పదకొండు దీర్ఘ సంవత్సరాల నిర్బంధం నుంచి, లభించిన స్వేచ్ఛను, ప్రజా విశ్వాసానికి విరుద్ధంగా, షేక్‌సాహెబ్ వినియోగించడని ఆశిస్తున్నాం.

# సముచిత నిర్ణయం

గత నెల 31 వ తేదీనుంచి రాష్ట్ర వ్యాప్తంగా హర్తాళ్ జరుపుతామని బియ్యపు వ్యాపారులు ప్రకటించినప్పుడు, ప్రజలు భయ విహ్వలులైనారు. అటువంటి తీవ్ర పరిస్థితి యేర్పడినప్పుడు, మంత్రివర్గం సామర్థ్యంతో ఆ పరిస్థితిని ఎదుర్కొనగలదని విశ్వాసం వున్నప్పటికీ, ప్రజలేమి, ప్రభుత్వమేమి కొన్ని యిక్కట్లకు గురి కావటం అతి సహజమైన విషయం.

జీవితావసరవస్తువులలో ఆహారధాన్యాలు అతి ముఖ్యమైనవి. వీటి సేకరణలోనూ, సరఫరాలోనూ, పంపకంలోనూ, అమ్మకంలోనూ, ప్రభుత్వం కఠిన నియమాలు పాటించడంతో వర్తకులు కొన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వస్తున్న దన్న విషయం విజ్ఞులెవ్వరూ కాదనలేరు. అయితే: స్వార్థదృష్టితో, సంకుచిత భావంతో ప్రజాశ్రేయస్సుకు భంగకరంగా వ్యాపారం చేసే వర్తకులు యెవరైనా కొంతమంది వుంటే వారిని అదుపులో పెట్టడానికీ, వారి మూలకంగా, ఇతర సోదర వర్తకులకు అపఖ్యాతి కలుగకుండా, ప్రభుత్వం కఠిన నియమాలు అమలు జరపడం, ప్రభుత్వానికి ప్రాథమిక కర్తవ్యమని అందరూ అంగీకరించే విషయమే.

హర్తాళ్ మూలకంగా ఏర్పడబోవు పరిస్థితిని తట్టుకోటానికి ఒకవైపున ఏర్పాటు జరుగుతున్నప్పటికీ మరొకవైపు మంత్రివర్గము, వర్తక సంఘములు సామరస్య సాధనకు చేసిన ప్రయత్నములు చాల మెచ్చుకోతగ్గవి.

తత్ఫలితంగా, ప్రభుత్వం కొన్ని నియమాలను సడలించడానికి అంగీకరించడం, తక్షణమే, హర్తాళ్ ఆపుచేస్తున్నామని బియ్యపు వ్యాపారులు ప్రకటించడం ప్రజలకు సంతోషం కలిగించింది.

ప్రజా శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, ప్రభుత్వము, వ్యాపారుల మధ్య సామరస్యము నేర్పరుచుకొనుటకు ప్రయత్నించిన ఫలితం సాధించుట హర్షించ తగిన విషయం.

—సి. హెచ్.




బొమ్మలకే ప్రాణాలొస్తే....

# చిత్ర వార్తలు

ఎస్సెన్ (రాప్): పశ్చిమ జర్మనీ పారిశ్రామిక నగరం ఎస్సెన్ పౌరులు తమ నగర వీధులలో కొత్తరకం విద్యుద్దీపాలకు ప్రారంభో త్సవం చేశారు. ఇది 1963 ఎస్సెన్ విద్యుద్దీపాలంకరణల మహోత్సవ [illegible] బండి, తాటిచెట్లు, ఇంకా అనేక వస్తువులు కానవచ్చు. ఈ విద్యుద్దీపోత్సవం నగరవీధులకు రాత్రిపూట వింతశోభ నిచ్చింది.





హిమాలయా సరిహద్దు ప్రాంతారణ్య ప్రదేశమున జావన్ క్రైస్తవ భక్తబృందం గుడ్‌ఫ్రైడేనాడు జరిపిన ప్రార్థనలు. చెట్టు బోదెకు సిలువ చిత్రాన్ని తగల్చారు.

న్యూఢిల్లీలో 7–4–64 న జరిగిన ఇండో–పాక్ దేశ వ్యవహారాల శాఖామాత్యుల సమావేశమున శ్రీయుతులు చాలిహా, నందా, ఖాన్ హబిబుల్లాఖాన్, సేన్‌గార్లు.





గంటకు 125 మైళ్లు పోగల రైలు ఇంజను — ఇం-4.

మన రాష్ట్రపతి గౌరవార్థము ఐ. ఏ. ఎఫ్. 31 వ వార్షికోత్సవ సందర్భములో 1-4-64 న న్యూఢిల్లీలో విమానదళ అధినేత, అధికారులచే జరుపబడిన ఆహ్వాన సభలో శ్రీ టి. టి. కృష్ణమాచారితో వై. బి. చవన్ మాట్లాడుతున్నారు.



# కొడుకైనవాడు

"ఎనిమిదీపది. రోజూ వచ్చే టైముదాటి పదినిముషాలైందన్నమాట." హాల్లో గడియారం వంక చూస్తూ మనసులో అనుకుంది కాత్యాయిని.

వంటింట్లో పనంతా పూర్తయి అప్పుడే పావుగంట అవుతోంది. ప్రతిరోజూ కూడా ఎనిమిది దాటకముందే భోజనాలై పనంతా అయిపోతోంది. ఎనిమిది దాటేసరికల్లా వచ్చేవాడు. ఈరోజెందుకని... ఎందుకని రాలేదు... అనే ఆలోచనతో మాటిమాటికీ గడియారంవంకా, వీధి గుమ్మంవంకా చూస్తూ కూర్చుంది.

ఒకసారి వంటింటి గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ వచ్చి హాల్లో కూర్చుంది. ఏదో వెలితనిపించి నట్లైంది మనసుకి. దాంతో విసుగుకూడా ఎక్కువైంది.

"జాక్ అండ్ జిల్ వెంట్అప్‌దిహిల్." గట్టిగా అరిచి చదువుతున్నాడు బాబు.

రోజూ అయితే, ఏమన్నా తప్పులు చదువుతాడేమోనని బాబుపక్కనే కూర్చునేది వింటూ.

కానీ ఇవాళ దృష్టి దేనిమీదకీ పోవటంలేదు ఆ ఆలోచనని తప్పించుకుని.

బాబు చదివేది చెవుల్లో పడుతున్నా మనసుమాత్రం వింటున్నట్లు లేదు.

"రెక్కా రెమి: రెండెద్దుల పాడి." అన్నయ్యని మించి అరుస్తూ ఎక్కాలు చదువుతోంది పాప.

"అబ్బబ్బ, ఇల్లెగిరిపోయేట్టు అంత గట్టిగా ఎందుకూ. కొంచెం మెల్లిగా చదువుకోండి." పిల్లల్ని గదుముతూ చీరాకుతో చూసింది.

"ఏవిటో; ఇందాకటినుంచీ పరధ్యానంగా ఉన్నావే." మంచంమీద కూర్చుని నవల చదువుకుంటున్న రఘురాం, ఆ మాట లనేసి మళ్ళీ పుస్తకం చదువుకోడంలో నిమగ్నుడయ్యాడు.

విననట్టుగానే ఊరుకుంది కాత్యాయిని.

"ఎందుకు రాలేదో పాపం" అనుకుంటూ మళ్ళీ ఒకసారి వీధిగుమ్మం వంక చూసింది.

ఆ ఊరు వచ్చిన కొత్తలో అంతే

వై. జె.

దాదాపు ఇరవై రోజుల క్రిందట జరిగిన సంఘటన కాత్యాయిని ఆలోచనల్లో మెరిసింది.

ఆరోజు...

రాత్రి ఎనిమిదైంది.

ఏదో అర్జంటు పనిమీద భోజనం చెయ్యకుండానే బయటకెళ్ళాడు రఘురాం.

పిల్లలిద్దరిచేతా చదవిస్తూ హాల్లో కూర్చుంది కాత్యాయిని. ఉన్నట్టుండి బయట కేక వినపడింది. "అమ్మా ఓ ముద్దన్నం పెట్టించండమ్మా" అంటూ.

"వెళ్ళిపోవోయ్. వెళ్ళు. ఇంకా భోజనాలు కాలేదు" అనేసి, చూపులు చేతిలో ఉన్న పుస్తకం మీదికి మళ్ళించింది.

ఒక నిముషం గడిచేసరికి మళ్ళీ కేక. "అమ్మా, కాస్తన్నం పెట్టండమ్మా."

వెళ్ళకుండా ఇంకా ఉన్నాడే. అయినా వాడికి సమాధానం చెప్పేదేవిటనుకుంటూ "ఏక్కాడినా చెప్పేది. ఇంకా భోజనాలు కాలేదు" అంది విసుగుతో.

మళ్ళీ బయట ముష్టివాడరుపు విని పించేసరికి భయంవేసింది కాత్యాయినికి.

ఇంట్లో మగవాళ్ళెవరూ లేనిసమయం కనిపెట్టి ముష్టివాళ్ళలా వచ్చి ఇంట్లోకి జొరబడి, ఆడవాళ్ళని బెదిరించి, చేతి కందింది పట్టుకుపోయే దొంగల్ని గురించి తన చిన్నతనంలో విన్న సంగతులు గుర్తొచ్చాయి.

దాంతో కాత్యాయిని భయం రెట్టింపయింది.

ఇప్పుడొచ్చింది దొంగేనేమో. అందుకే అలా ఉండుండీ అరుస్తున్నాడు. తీరుబడిగా నుంచుని అంతా పరిశీలిస్తున్నట్టున్నాడు. ఇంట్లో మొగాళ్ళు లేరని తెల్సుకుని వచ్చినట్టున్నాడు. ఎలా ఇప్పుడు? అసలే ఈ చుట్టుప్రక్కల దగ్గర్లో ఎక్కడా ఇళ్ళులేవు. అరిచినా ఎవరికీ వినపడదు.

హాయిగా ప్రశాంతంగా ఉంటుంది, చుట్టుపక్కల ఇళ్ళు లేకపోతే అనుకుంది, ఈ ఇల్లు చూసినప్పుడు. కానీ ఇలాంటి భయాలగురించి ఆలోచించనేలేదు, ఛ, బుద్ధిపొరపాటు. ఇప్పుడేం చెయ్యడం, భగవాన్. "భగవంతుణ్ణి తల్చుకోవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

తలుపు గడియపెట్టి పడ్దామనుకుంది కానీ భయంతో లేవలేకపోయింది.

అంతకుముందే తలుపు వేసుకోనందుకు తనని తానే నిందించుకుంది.

గాలి అటువైపునించే వస్తోంది కదా అని తీసేవుంచింది ఆ తలుపులు. అప్పుడు భయాలేం మనసులోకి రాలేదు.

అంతకంతకీ ధైర్యం పోయి, వొళ్ళు చల్లబడిపోయినట్టనిపించి, పిల్లలిద్దర్నీ దగ్గరకి లాక్కుని గుండెలకి అదుముకుంది కాత్యాయిని.

అర్థంకాక పిక్కమొహాలేసుకుని చూస్తూండిపోయారు వాళ్ళిద్దరూ.

ఒక నిముషంసేపు బయట ఏ అలికిడీ లేకపోయేసరికి, ప్రాణం కుదుటబడ్డట్టనిపించింది కాత్యాయినికి.

"అమ్మయ్య. వెళ్ళినట్టున్నాడు. బతికించాడు దేవుడు. ఇప్పుడైనా తలుపేసుకుంటే మంచిదనుకుంటూ లేచి మెల్లిగా అడుగులు వేసుకుంటూ తలుపు దగ్గిర కొచ్చింది.

వెయ్యబోతూ ఒకసారి పక్కనించి బయటికి తొంగిచూసింది.

నమ్మలేకపోయింది...

ఇంకా అక్కడే, గేట్ పక్కన నుంచుని ఉన్నాడు. మెట్లమీద లైట్ పడుతుండటంవలన ఆ వెలుగులో స్పష్టంగా ఆ ముష్టివాణ్ణి చూడగలిగింది.

గుబురుగా పెరిగిన ఆ గడ్డం చూసేసరికి వొళ్ళు జలదరించి గబుక్కుని తలుపేసి గడియపెట్టింది.

"నిజంగా దొంగే అయుంటాడు, సందేహంలేదు. లేకపోతే...ఇంక ఆలోచించలేకపోయింది. భర్త వచ్చి తలుపు కొట్టేవరకూ పిల్లల్నిద్దర్నీ చెరోపక్క పెట్టుకుని దేవుణ్ణి తల్చుకుంటూ కూర్చుండిపోయింది.

"రేపటినించీ రాత్రి ఏడుదాటితే ఇల్లు కదల్ను. సరేనా" అంతావిని నవ్వుతూ అన్నాడు రఘురాం.

"బాయిబా నీకు భయమెక్కువ." అన్నమాటలుకూడా చివర చేర్చకపోలేదు.

మర్నాడు పొద్దున రాత్రివచ్చిన ముష్టివాడు ఇంటిముందునించి వెళ్తుంటే, గబగబా పనిమనిషిని తీసుకొచ్చి చూపించి రాత్రి జరిగిన సంగతి చెప్పింది కాత్యాయిని.

"బలేవోరం దమ్మగోరు" అంటూ పకపకా నవ్వింది.

"ఆ దరుక్కునేవాడే నండీ. ఆడి కొడుకు కాణ్ణి మోసంచేసి పోయిండు. పాపం. పని చేసుకోను సత్తాలేక ఇట్టా బతుకుతా ఉన్నాడు. కానా మంచోడు. ఇం కెన్నాళ్ళో బతకడంటా రాణ్ణి సూసి నోళ్ళు." అంటూ ముగించింది చెప్పడం.

అది మొదలు రోజూ రాత్రిళ్ళు మాత్రమే వొస్తున్న ఆ ముష్టివాడి కన్నం పడేస్తుండేది కాత్యాయిని.

వారంరోజులు పోయాక చెప్పింది పనిచేసేది. "ఆడి పాకిక్కడికి దగ్గర్లోనే ఉండాదమ్మా. అందికని రాత్రిళ్ళు ఎంతో దూరం పోనేక ఈడి కోచోటికే వస్తాడంటమ్మా. మీరుపెడితే తిన్నట్టు లేపోతే పస్తేనంట. అక్కడోళ్ళు చెప్పుకుంటుంటే యిన్నాను."

అది వినేసరికి ఆ ముష్టివాడి మీద మరింత జాలివేసి తప్పకుండా అన్నం వేస్తూండేది కాత్యాయిని రోజూ.

ఒకరోజు అడగనే అడిగాడు రఘురాం: "నీకు ముష్టివాళ్ళంటే చిరాకుగా; 'పనిచేసుకుని బతకకూడదా'" అంటావుగా.

"అయితే" ఎందుకలా అడిగాడో అర్థమైనా, కానట్టు చూసింది.

"అహా. ఏంలేదు. రోజూ ఆ ముష్టి



"ఆడపిల్ల అని ఇప్పుడు విచారిస్తే ఏం లాభం — అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతా రని తెలీదా మీకు! — పెళ్ళైన కొత్తలో ఎన్నెన్ని వాగ్దానాలు, ఎంత తీపి మాటలు చెప్పి ఆశపెట్టారు — అవన్నీ ఊరికే పోతాయా మరి......"

వాడి కన్నం పడేస్తుంటేనూ" అని పోయాడు.

వెంటనే అందుకుని చెప్పింది కాత్యా యని. "ఔను. కానీ పాపం ఇతను చాలా మంచివాడు. పనిచేసుకునే శక్తైనా ఉండీ."

......

"అమ్మా! మంచినీళ్ళు కావాలి. దాహం అమ్మా" అంటూ బాబు పిల్చే సరికి ఈ లోకంలోకి వచ్చింది కాత్యాయని.

"వీడు మరీను ఇక్కడి నించి మధ్యింట్లో కెళ్ళడానికే భయపడతాడు. పెద్దయ్యాక నాలాగే తయారవుతాడేమో!"

అనుకుని నవ్వుకుంటూ లేచి బాబుకి తోడు వెళ్ళింది.

"అమ్మా! నేను మంచినీళ్ళు తాగే శానుగా? అలాగే నుంచున్నావేం. మళ్ళీ నే వెళ్ళిపోతే నీకు భయంవేస్తుంది. రా" అంటూ చెయ్యి పట్టుకున్నాడు బాబు. యాంత్రికంగా బాబు వెనకాలే వచ్చేసింది హాల్లోకి, కాత్యాయని.

మళ్ళీ ఒకసారి గడియారం వంక చూసి బరువుగా ఊపిరి పీల్చుకుంది.

"అమ్మా! నేను చదువుకుంటానే" పుస్తకం దాచుకుని వచ్చింది పాప.

"పడుకో మహారాజులా. ఎవ రొద్దన్నారు?" గేటువంకే చూస్తోంది.

"ఆఁ. మరీ పొద్దున్న రాత్రి పడుకున్నప్పుడు కథ చెప్తాన్నావుగా" ముద్దుగా అడిగింది పాప.

"కథాలేదు ఏం లేదు పోయి పడుకో. గొడవ చెయ్యక" విసుగ్గా జవాబిచ్చింది.

"ఇవాళ్లెందుకో చిరాగ్గా ఉంది. పాపం పనిచేసి బాగా అలిసిపోయినట్టుంది" అనుకున్న రఘురాం పుస్తకం పక్కన పడేసి లేచి కూర్చుని పాపని పిల్చాడు "నేను చెప్తాను రా పాపా కథ."

"నువ్వేం చెప్పక్కర్లేదు నీ సినిమా రాత కథలు" అని తల్లి కేసి కోపంగా [illegible] చ్చింది సంతోషంతో మంచంమీద పడుకుంది వచ్చి.

"అనగనగా ఒక రాజు. ఆ రాజుకేమో ఏడుగురు కొడుకులు" కథ మొదలు పెట్టేసరికే అడ్డుతగిలింది పాప. "ఆ కథ నాకెప్పుడో తెల్సు. అమ్మ చెప్పింది. ఇంకోటి చెప్పు" అంటూ.

"మరిందాక అమ్మ కేం కథలు రావన్నావే" నవ్వొచ్చింది రఘురాంకి.

"అవును మరి. ఇప్పు డడిగితే ఏందుకమ్మా చెప్ప లేదూ? బుంగమూతి పెట్టింది.

"సరేలే ఇంకోటి చెప్తాను" అంటూ కథ మొదలు పెట్టాడు.

"పాపం, అనవసరంగా దాన్ని విసుక్కున్నాను. ఆ ఏం చేసేం మరి" అనుకుంటున్న కాత్యాయని గేట్ చప్పుడైనట్టు అనిపించి వంగిచూసింది.. 'ప్చ్. ఎవరూ లేరు' అనుకుంది.

"వస్తే గేట్ తీసుకుని లోపలికొస్తారా ఏంటి?" తన తెలివితక్కువతనానికి తనకే నవ్వొచ్చింది.

కాని మనసు నవ్వలేకపోయింది...

హృదయం చిన్నబుచ్చుకుంది...

మనసులో వెలితి...

ఏదో బాధ...

అరగంటసేపు విసుగూ, చిరాకూ.

ఒకసారి వంటింట్లో కెళ్ళి గిన్నెలో మూత పెట్టిఉంచిన అన్నం, కూరా చూసి మళ్ళీ మూత పెట్టేసింది.

పరిచిన పక్కని తిరిగి సర్దింది.

హాల్లో కొచ్చి కూర్చుంటూ దృష్టి గడియారం మీదకి తిప్పింది. "[illegible]దిన్నర. ఇంకా రాలేదే. అయినా మనిషి వారి గురించి ఇంతగా ఆలోచించడం దేనికి" హృదయం సర్దిచెప్పుకోవాలని చూసింది. మనసు దానితో కలవలేదు.

చేసిన ప్రయత్నం విఫలమే అయింది.

"పాపం, జ్వరం వొస్తుందేమో. చూసే దిక్కెవరూ కూడా ఉండరా ముసలాడికి."

కాత్యాయని కళ్ళల్లో జాలితో బాటు సానుభూతి కురిసింది.

"ఒకవేళ వాస్తుంటే దారిలో ఏదైనా ప్రమాదం. ఛ. ఏవిటి పాడాలోచనలు" అనుకుంటున్న కాత్యాయనికి బయటి నుంచి వచ్చిన "అమ్మా!" అన్న కేక వినిపించి అమృతం చిలికినట్టయింది.




పురజనుల కోరిక మీద, రామభద్రయ్యగారు కొడుకులచేత సత్యనారాయణ వ్రతం, బీదలకు అన్నదానం చేయించ నిశ్చయించుకున్నారు. ఆ ప్రకారం ఆహ్వాన పత్రాలు అచ్చువేయించి, బంధుమిత్రులకు పంపటం జరిగింది.

గుండమ్మ కొడుకు ప్రభాకర్ ఆహ్వానం అందుకుని బయలుదేరబోతుండగా, గంటయ్య 'తనకూ ఆహ్వానం వచ్చిందనీ (రాకపోయినా), ఒక్కణ్ణే పంపేను అని ఆలోచిస్తున్నాననీ, సరే, మీరు బయలుదేరుతున్నారుగాబట్టి, మీకు తోడు నేనూ వస్తా' నని ప్రభాకర్ వెంట పెట్టే, బెడ్డూ తీసుకుని బయలుదేరాడు.

*     *     *

రామభద్రయ్యగారి ఇంట్లో గుండమ్మ సత్యనారాయణ వ్రత సన్నాహా లన్నీ నెత్తిన వేసుకుని అల్లుళ్ల దగ్గరనుంచి కూతుళ్ల వరకూ అదుపు చేస్తూ, పనివాళ్లని ఆజ్ఞాపిస్తూ, వెనకటిలాగే పెత్తనం చలాయిస్తూ ఉంది. ఈ పద్ధతి చిన్న కూతురు సరోజకు నచ్చలేదు. 'అసలు నువ్వెందు కింత పూసుకుంటావు' తో మొదలుపెట్టి–'సొంత యింట్లో సాగక పరాయి యింట్లో చెలాయిస్తుంది

చక్రపాణి



పెత్తనం' అనేదాకా తల్లిని సూటి పోటీగా అన్నది. గుండమ్మ చిన్న కూతురుజోలికి అట్టే పోకుండా, చూచీ చూడనట్టు వదలి, పెద్దకూతురు ఇంటి కొచ్చిన చుట్టపక్కాలు ప్రాముఖ్యతని గ్రహించే విధంగా ప్రవర్తించి, సత్య నారాయణవ్రతం, అన్నదానం వగైరాలు నిర్విఘ్నంగా నెరవేర్చింది.

* * *

వచ్చిన చుట్టాలు ఒక్కొక్కళ్లే వెళ్లిపోయారు. గంటయ్య మాత్రం కదలలేదు.

ప్రభాకర్, పద్మ అందరివద్ద సెలవు తీసుకుని ప్రయాణమై, అమ్మదగ్గర కొచ్చి 'అమ్మా, రా, మనింటికి పోదాం' అని పిలిస్తే, గుండమ్మ 'నేను రాను, నా కిక్కడే బాగుంది' అంటుంది. చిన్నకూతురు అందుకుని 'అవును, ఎందు కొస్తుంది; అక్కడెవరున్నారు — చలాయించడానికి పెత్తనం?' అని ఫుటుక్కున అన్నది. పెద్దకూతురు లక్ష్మి 'అవేంమాటలే' అని చెల్లెల్ని వారించగా -సరోజ 'నీకు తెలీదు, నువూరుకో అక్కా! ఇంకా 'మనం చిన్నపిల్లల మనే అనుకొంటూ ఉంది. మనం ఏమి తినాలో, ఏం కట్టుకోవాలో అన్నింటికీ ఈమే చెప్పాలి; ఎన్నాళ్లీ నస!' అని కుండ పగలగొట్టినట్టు అనేసింది. దాంతో గుండమ్మ సంగతంతా గ్రహించుకుని, మూటాముల్లే కట్టుకుని, పెద్ద కూతురు వద్దన్నా వినిపించుకోకుండా కొడుకూ



కోడలితో బయలుదేరింది. క్రింద అల్లుళ్లకీ, రామభద్రయ్యగారికి నమస్కారాలు చెప్పి, అల్లుళ్ళు ఎంత బతిమాలినా వినకుండా వెళ్ళిపోయింది.

తరువాత రామభద్రయ్యగారు అంతా విచారించి సంగతి తెలుసుకున్నాడు. కాని యీ విషయంలో కొడుకులు భార్యలవైపే మొగ్గటం చూచి—'భార్యలమీద ప్రేమ ఉండవలసిందే గాని, వాళ్లను తగు స్థానంలోనే ఉంచాలి. నెత్తి కెక్కించుకోగూడదు'అని పరోక్షంగా హెచ్చరించి, తను మకాం తోటబంగళాలోకి మార్చడానికి నిశ్చయించుకున్నా నని చెబుతాడు.

కొడుకులు దీనికి ఒప్పుకోరు. కాని, రామభద్రయ్య ప్రపంచధర్మం చెబుతాడు. 'ఎదిగిన కొడుకులు చీటికి మాటికి సలహాలు అడగడం, తండ్రి చెప్పడం అంత మంచిదికా దనీ, ఐనా చిక్కు సమస్య లేమైనా వస్తే, తనని సంప్రదించవచ్చు' ననీ వాళ్ళని ఒప్పించి, మకాం తోట బంగళాకి మారుస్తాడు.

*　　*　　*

గుండమ్మ ఇంటి ముఖద్వారంమీద 'నాట్య భారతి' బోర్డు వెలిసింది. ఇంట్లో భూపతి ఆధ్వర్యంక్రింద—తబలా వాయిద్యాలూ, నాట్యాలు జరుగుతున్నయ్. కొందరు నాట్యకత్తెలు శిక్షణ పొందుతున్నారు. ఇదంతా పద్మకు మొదట్లో యిష్టం లేక

పోయినా-'భారతదేశంలో పెళ్ళిళ్ళ వల్ల కళామతల్లికి ఎంతో అపచారం జరుగుతోం దనీ, నీలాంటి కళా తప స్వినుల కళా కౌశలం వివాహానికి ఆహుతి అయిపోగూడ దనీ' ప్రభాకర్ భార్యకు నచ్చచెప్పి, నాట్యకళను ఉద్ధరించడానికి కంకణం కట్టుకు న్నాడు.

గుండమ్మ—కోరలు తీసిన పాము లాగ—మామూలు పెరటి-ఇంట్లో పడి ఉంటున్నది!

*　　　*　　　*

గంటయ్య ఇంట్లోనే తిష్ట వేసి, ఇంటికి చిచ్చుపెట్టాడు. ఎలాగంటే ఒకనాడు సరోజనుని డబ్బు అడిగాడు. 'నా దగ్గర లేదు. అక్కని అడగమంది. గంటయ్య నొచ్చుకుని 'అయ్యో! ఒకనాడు నీ చేతిమీదుగా ఎంతోడబ్బు ఖర్చు పెట్టినదానివి! యీ నాటికి—ఒక్క రూపాయి కోసం, అక్కని—ఆనాడు నీ చేతికింద బతికిన అక్కని—అడుక్కోవలసి వచ్చిందే' అని మొసలి కన్నీళ్ళతో సానుభూతి చూపాడు. సరోజకి ఒక్కసారిగా పాత జీవిత మంతా జ్ఞాపకం వస్తుంది. (Flash Back) అవును! గంటయ్య చెప్పింది ఆమెకి యదార్థంగానే కనిపించింది.

ఆ రాత్రి భర్తని 1000 రూపాయలు కావా లని అడిగింది. 'ఎందుకు?' అన్నాడు భర్త.

'ఎందుకో! అవన్నీ చెప్పాలా? నా చేతిలో ఆమాత్రం డబ్బు ఉండ గూడదా?' అన్నది సరోజ. 'అయితే-మీ అక్కేగా! అడుగు' అని నవ్వి ఊరుకున్నాడు. సరోజ యిక మాట్లాడ లేదు. ఆ రాత్రి గోడవైపుకు తిరిగి పండుకుంది.

రాజా సంగతి గ్రహించాడు. మరు నాడు అన్నని డబ్బు అడిగాడు. 'ఎందుకు?' అన్నాడు అన్న. రాజాకి నవ్వు వచ్చింది. 'ఎందుకు నవ్వుతావు' అని అడిగాడు అంజి. రాజా చెప్పాడు. అన్న లక్ష్మిని పిలిచి, 1000 కావా లన్నాడు. 'ఎందుకు?' అన్నది లక్ష్మి. అన్నదమ్ము లిద్దరూ ఒకళ్ళ మొఖం ఒకళ్ళు చూచుకుని నవ్వారు. లక్ష్మికి ఏమీ అర్థం కాక, పెళ్ళి డబ్బు తీసు కొస్తుంది. తమ్ముడికి ఇవ్వమంటాడు. ఎందు కన్నట్టు చూస్తుంది లక్ష్మి. రాజా అర్థం చేసుకుని, సంగతి చెపు తాడు.

లక్ష్మి చెల్లెలి దగ్గరికి పోయి, 'నీకు డబ్బు కావలిస్తే-నన్ను అడగకూడదా? ఈ భాగ్యానికి మొగవాళ్ళదాకా పోవాలా?' అంటుంది.

'ఏం పోతే? ఇందులో రహస్యం ఏముంది? నా మొగుణ్ణి నేను డబ్బు అడగడం తప్పా?' అంటుంది సరోజ.

లక్ష్మి అర్థం చేసుకుంది. తాళాలు యిచ్చేద్దా మన్నంత వరకూ వస్తుంది.



గాని మళ్ళీ తమాయించుకుని-ఆ రాత్రి భర్తకి జరిగిందంతా చెబుతుంది.

మరునాడు అన్న తమ్ముడికి జరిగింది చెబుతాడు.

సరోజది ఖర్చుచేసే చెయ్యి. పైగా పల్లెటూళ్ళో తోచదు. కొన్నాళ్ళపాటు తమ్ముడు మరదలితో-శృంగార యాత్ర చేసి వస్తే బాగుంటుందని సలహా యిస్తాడు.

బాగానే ఉందని రాజాగూడ ఒప్పుకుంటాడు.

రాజా సరోజల శృంగారయాత్ర ప్రారంభమైంది.

మహాబలిపురంలో మొదలుపెట్టి-ఊటీ, బృందావన గార్డెన్సూ మొదలైన దక్షిణాది టూరిస్టు కేంద్రాలు సందర్శించి, ఉత్తరాది యాత్రలకు బయలుదేరుతూ, ఢిల్లీలో అశోక హోటలుకు 5000 రూపాయలు పంపమని అన్నకు టెలిగ్రాం యిచ్చాడు. దంపతులు ఢిల్లీ చేరేసరికి టి. టి. సిద్ధంగా ఉంది. డబ్బు పుచ్చుకుని ఢిల్లీలో ఎర్రకోట, ఆగ్రాలో టాజ్ మహాలూ మొదలైన పాత ప్రదేశాలు, భాక్రా నంగల్ డాము, చండీఘర్ రాజభవన్ మొదలైన ఆధునిక కట్టడాలూ సందర్శించి—(ప్రొడ్యూసరు యింత డబ్బు ఖర్చు పెట్టలేకపోతే, కొన్ని మానుకోవచ్చు) కాశ్మీరు చేరుకున్నారు.

కాశ్మీరులో ఒక బోటు అద్దెకు తీసుకుని, ద్వంద్వ గీతాలు పాడు



కుంటూ, మూడు మాసాలు మూడు రోజుల్లాగ వెళ్లబుచ్చారు. ఇంటికి ఉత్తరాలు రాస్తూనే ఉన్నారు— డబ్బుకోసం! నాలుగోసారిగా డబ్బు పంపుతూ, అన్న 'మరదలుపిల్ల చెయ్యి కొంచెం ఎత్తుబారీ దనీ, ఖర్చు విషయంలో అదుపుచేస్తే బాగుంటుం' దని తమ్ముణ్ణి మందలించాడు.

ఆ ఉత్తరం సరోజ చదివి మండి పోయింది. అక్కకి ఉత్తరం రాస్తూ— బావగారి విషయం ప్రస్తావించి—'మేం మా డబ్బు ఖర్చుపెట్టుకుంటున్నాం. మాకు పంపిన డబ్బంతా మా పేరనే ఖర్చురాసి, మా వాటలోతీసుకోవచ్చు' నని 'యిలాంటి చిన్నవిషయాలలో— పొదుపు ఉద్యమం మీద బావగారు ఉపదేశించడం బాగాలే' దనీ ఎత్తి పొడిచింది.

లక్ష్మి ఉత్తరం భర్తకి చూపి. 'మీ కెందుకు వాళ్ల గొడవలు! ఊరుకో గూడదా!' అని సలహా యిచ్చింది. అంజి భార్యసలహా పాటించలేదు. తమ్ముడికి ఉత్తరం రాశాడు— 'మరదలుపిల్ల చాటుగా నీకు రాసిన ఉత్తరాలు చదువుతున్న' దనీ, 'ఒకరి ఉత్తరాలు ఒకరు చదవడం మంచిది గా' దని, 'భార్యకు అంత చనువివ్వడం బాగలే'దనీ, హెచ్చరించాడు. సరోజ ఆ ఉత్తరంగూడ చదివి, అక్కకి యిలా రాసింది. 'తమ భార్యాభర్తల మధ్య రహస్యాలేమీ లేవనీ, తమ శరీరాలు వేరైనా, ఆత్మలు ఒకటే ననీ, ఒకరి



హృదయాలు ఒకరికి విప్పిన పుస్తకాలనీ, యీ ప్రపంచంలో ఏ అభివృద్ధి నిరోధకశక్తి తమని విడదీయలేదనీ,'— ఈ ధోరణిలో నడచింది ఉత్తరం!

అంజి మరదలి ఆవేశాన్ని గ్రహించాడు. తమ్ముడికి ఒక్క ముక్కలో ఉత్తరం రాశాడు. 'ఇకనుంచి డబ్బు పంపడానికి వీలులేదు' అని. సరోజ ఉత్తరం చదివి, భర్తచేతి కిచ్చింది. 'ఇక్కడ అప్పులు తీర్చి, ఇంటికి పోవడానికి డబ్బు లేదు' అన్నాడు భర్త. (రాజా హృదయమైతే విప్పాడు గాని—భార్య ముందు మనీపర్సు విప్పలేదు) సరోజ చాలా ఆందోళన పడింది. ఈ లోపల—'నాట్యభారతి' డ్యాన్సు ట్రూపుతో —ప్రభాకర్ కాశ్మీర్ వచ్చాడు. అతని దగ్గర చేబదులు తీసుకు ఇద్దరూ యింటికి ప్రయాణమైనారు.

## విశ్రాంతి

గంటయ్య తోటబంగళాలో రామచంద్రయ్యకు తోడుగా, ఆయన్ని వినోదపరుస్తూ ఉండిపోయాడు. ఫ్రీగా దొరికిన అవుపాలూ, కోడిగుడ్లతో కొంచెం ఒళ్ళుకూడా చేశాడు.

గంటయ్య పెట్టిన చిచ్చు రగిలి మండుతున్న దని అతనికి తెలియదు.

రాజా సరోజలు ఇంటి కొచ్చేశారు.

చిన్న చిన్న విషయాల దగ్గరనుంచి అక్కచెల్లెళ్ళ మధ్య — నువ్వా — నేనా అని తగాదాలు పెరిగిపోతున్నయ్.

లక్ష్మికి విసుగెత్తి తాళాలు భర్తకిస్తుంది. భర్త తనకూ అక్కరలేదని — నీకిచ్చిన వాళ్ళకే యిచ్చుకో' అంటాడు.

లక్ష్మి మామగారి దగ్గరికి పోయి, విషయమంతా చెప్పి, తను యీ బాధ్యత నిర్వహించలేనని తాళం చెవులు యివ్వబోతుంది. రామభద్రయ్య తీసుకోడు. తను లక్ష్మిని ఎంతో సమర్థత గలదని ఊహించి యీ యింటి కోడలుగా తెచ్చుకున్నాననీ, తన ఊహా లిలా తల్లక్రిందు లవడం నమ్మలేకుండా ఉన్నాననీ. ఏమైనా యీ సంసార పంకంలో తాను మళ్ళీ ఇరుక్కోదల్చుకోలేననీ, లక్ష్మినే యింకో సారి ప్రయత్నించి చూడ'మనీ, రామభద్రయ్య బ్రతిమాలతాడు. లక్ష్మి సరేనంటుంది.

లక్ష్మి ఇంటి కొచ్చేసరికి, ఇనప్పెట్టె తాళంమీద ఇంకో తాళం పడివుంది. రాజా సరోజనిని గట్టిగా మందలించబోతాడు. సరోజ నిరాహార వ్రతం ప్రారంభిస్తుంది.

పరిస్థితులు చూచి, అన్నదమ్ములు వేర్లు పడడమే మంచిదని నిర్ణయించుకుంటారు.

పంపకాలు జరుగుతయ్. వేరు వంటలు ప్రారంభ మవుతయ్!

గంటయ్యకి మళ్ళీ చేతినిండా పని దొరుకుతుంది. రామభద్రయ్య సేవ వదిలి, రాజా భాగం వ్యవసాయం చేయించడం మొదలుపెడతాడు. గట్ల దగ్గర పాలేళ్ళతో ప్రారంభమైన తగవులు, పైదాకా పాకినై. ఊళ్ళో న్యాయం పెద్దవాడి తరఫునే ఉన్నదనీ, గంటయ్యే కలహాలు పెంచుతున్నాడనీ చెప్పుకుంటారు

రాజా యిప్పుడు తలకిందనే పిస్తోలు పెట్టుకుని పండుకుంటున్నాడు, రాత్రి నిద్రలో — 'అన్నో తనో — ఎవరో ఒకరు ఎగిరిపోవలసిందే ననీ, లేకపోతే ఈ తగవు చల్లార' దని ఒకటి రెండు సార్లు కలవరించాడు. సరోజ విని భయపడింది. పిస్తోలు తీసి దాచింది. రాజా బలవంతాన మళ్ళీ లాక్కున్నాడు.

అంజి ఊళ్లో లేడు, చెబుదామంటే! గ్రామాంతరం వెళ్ళాడు. రెండు మూడు రోజుల్లో వస్తాడు.

వచ్చేదోవలో కాపలా వేసి, కాలుస్తానని రాజా సరోజతో చెప్పాడు. సరోజ భయపడింది. వెళ్ళి అక్కకు చెప్పి ఏడుస్తుంది. బావని కనబడకుండా చెయ్యమనీ, రామభద్రయ్యగారితో చెప్పి, ఈ తగాలు ఎలాగైనా సర్దుబాటు చెయ్యమనీ బ్రతిమాలుతుంది.

ఇద్దరూ రామభద్రయ్యగారి దగ్గరకు వెళతారు.

రామభద్రయ్య అంతా వింటాడు.



విని— 'ఏనాడు భోగాలు పంచుకు న్నారో, ఆనాటినుంచి వాళ్ళు తన కొడుకులే కాదనీ, వాళ్ళు ఏమై పోయినా తనకు పట్టింపు లేదని చెబుతాడు. సరోజ తప్పు తనదే నని ఒప్పుకొని, ఎట్లాగైనా యీ ఆపద నుంచి తప్పించమని, కాళ్ళా వేళ్ళా పడుతుంది రామభద్రయ్య వినడు.

'మీరే తెచ్చారు తగవులు. మీరే సమర్థించుకోండి' అని చెబుతాడు. వెళ్ళి తలుపు వేసుకుంటాడు.

*ఇక క్లయిమాక్స్ ఘట్టం!*

సరోజ ఎంత చెప్పినా వినకుండ రాజా — Standard Triumph లో — 65 మైళ్ళ స్పీడ్‌లో బయలుదేరు తాడు. వెంటబడి రాజాని ఆపడానికి — అక్కడ పల్లెల్లోకి కారు లేదు. గుర్రబ్బండి చేసుకుంటాడు. గుర్రం కదలదు. సరోజ బండివాణ్ణి దిగమని లగాయించి పట్టు కుంటుంది. (ఈ మార్పు పాఠకులకు ఎబ్బెట్టుగా ఉంటుంది గాని— ప్రేక్షకులకు బాగుంటుంది) గుర్రం గూడ 59 మైళ్ళ స్పీడులో పోతూ ఉంటుంది

రాజా కారు దూసుకుపోతూ ఉంది! గుర్రబ్బండి ఆగ మేఘాలమీద పోతో ఉంది. సరోజ—కొరడా.... దెబ్బ!. కొరడా.... దెబ్బ!....

గుర్రబ్బండి కారుని దాటగలదా? ప్రేక్షకులు గుండె చేతబట్టుకుని, Back-ground music వింటూ కూర్చుం టారు. కారు పోతూనే ఉంటుంది 60, 70, 80 మైళ్ళ Speed!



గుర్రం 59, 49. 39—దిగుతూ ఉంది! లాభంలేదు! ఈ ప్రమాదాన్ని నివారించే వీలులేదు! దైవయత్నం తప్పితే. మానవ ప్రయత్నం లాభంలేదని ప్రేక్షకులు నిర్ణయించుకుంటారు.

కారు పోతూ నేవుంటుంది—ఇంకా పోతుంది.—గుర్రం నురుగులు కక్కుతోంది! ఏమిటా నురుగుల్లో ఎరుపు! ఎరుపు గాదు రక్తం!

అక్కచెల్లెళ్ళిద్దరూ - దిగి - పరుగులకించుకున్నారు. ప్రేక్షకులు, చూడలేక, కళ్ళు మూసుకున్నారు.

Background music వినబడుతూనే ఉంది.

70 మైళ్ళ స్పీడులోపోయే కారును యీ అబలామణులు జయించగలరా?

అని ప్రేక్షకుల ముఖంలో ఒకటే ప్రశ్న పెద్ద ప్రశ్న!! తెరంతా ప్రశ్న!!!

ఢాం! పెద్ద చప్పుడు! ప్రేక్షకులు కళ్ళు తెరిచారు! టైరు బరస్టు అయింది. రాజా దిగాడు. జాకీ తీశాడు. టైర్ మార్చాలి.

అబలలు పరుగెడుతున్నారు. దూరం దగ్గరవుతున్నది. చూపు మేరలో కారు కనిపించింది. ధర్మం జయించింది.

ఇంకో ఉపద్రవం! అంజి కారు ఎదురుగా వస్తున్నది! పాపం, అంజికి యిదంతా తెలియదు.

అబలలు దగ్గరికి వచ్చేస్తున్నారు. అంజి కారు వచ్చి ఆగింది. తమ్ముడూ! టైర్ వెయ్యాలా అని ఆప్యాయంగా దగ్గర కొచ్చాడు.



ఆడవాళ్ళు 'వద్దు! వద్దు!! చంపేస్తాడు' అని అంజికి అడ్డం పోతారు. అంజికి ఏమీ అర్థం కాదు. Background music రొదలో — నిజానికి — యీ మాటలు వినపడవు. రాజా పిస్తోలు తీస్తాడు! అంజి గ్రహించుకుంటాడు!! 'రొమ్మిచ్చి తమ్ముడు చేతిలో చావడం కంటే స్వర్గమే లేదని, యీ బలితోనైనా నా కుటుంబకలహాలు తీరితే, తాను సంతోషిస్తా'నని – అంటాడు.

సరోజ అంజికి అడ్డంగా పోతుంది. 'ముందు నన్ను కాల్చి, తరువాత బావని కాల్చ'మంటుంది.

రాజా 'లాభంలే' దంటాడు. 'నీ సౌఖ్యం కోసం నే నింత చేస్తే – నువ్వు పోయిన తరువాత – నా కిక ప్రపంచం ఏముంటుంది? సన్యసిస్తా'నని పిస్టలు పారేస్తాడు.

సరోజ నిజంగా పశ్చాత్తాప పడుతుంది. తన మూలంగా గదా, గుట్టుగా బతికిన కుటుంబం రట్టు అయిందని— చిన్న Speech యిస్తుంది, (ఆ Speech వ్రాయడం లేదు – ఎవరైనా సినిమాల్లో పెట్టుకుంటారేమో నని).

Speech యిచ్చి–పిస్టలు తీసుకొని కాల్చుకుంటుంది.

లక్ష్మి కెవ్వున కేక వేసి, చేతుల్లోకి తీసుకొని, ఏడుస్తుంది. (ఏడుపులో చిన్నపిల్లలా గుక్క పెడుతుంది.) రాజా వదినెను ఓదారుస్తాడు! ఫరవా

లేదు. అంత ప్రమాదకరమైన దెబ్బ కాదని మొదలుపెట్టి, చివరికి 'పిస్తోలులో గుండు లే' దని తేల్చి పారేస్తాడు. సరోజ ఆశ్చర్యంతో కళ్ళు తెరుస్తుంది.

అందరూ కలిసి ఫైర్ తగిలిస్తారు.

అంతా కారెక్కి quartet పాడుకుంటూ — ఇల్లు చేరుకుంటారు.

విచిత్రం! యిల్లు తాళం వేసివుంది.

ఈ సంతోషవార్త తెలిపి, తాళం చెవి తెచ్చుకోవడానికి నలుగురూ రామభద్రయ్య దగ్గరికి పోతారు.

రామభద్రయ్య ముఖాన—కొడుకులు కోడళ్ళు కలసి వచ్చినందుకు సంతోష చిహ్నాలు కనబడలేదు; విసుగు మాత్రమే ద్యోతక మవుతున్నది.

కొడుకులు కోడళ్లను ఆశీర్వదించడానికి బదులు — యిలా ఆదేశించారు.

"—తండ్రి సంపాదించిన ఆస్తి తింటూ కూర్చుంటే — మీకు డబ్బు విలువ తెలియ లేదు, కొట్లాడుకున్నారు. ఈ నాటినుంచీ—నా ఆస్తిలో మీకు భాగం లేదు. చెరి వెయ్యి రూపాయలు యిస్తున్నాను—ఖర్చులకి. వెళ్ళి సంపాదించుకొని బతకండి."

డబ్బు చేతికిచ్చి, 'శుభం' అని చెప్పి పేపరు ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు

పేపరు మీద 'శుభం' అనే అక్షరాలు — పెద్దవిగా కనిపిస్తాయ్:— తెరనిండా!.





"ఇంట్లో పిల్లి అరుస్తోంది; వంటింటి తలుపు తీసే ఉంచేశా, దాన్ని కొట్టి తగిలెయ్యవే ఓట్టీ!"

"అది నిజంపిల్లి కాదమ్మా! బావేమో పిల్లిలాగా మియ్యాం మియ్యాం అని అరుస్తున్నాడు — అది అక్కయ్యని రమ్మని పిలవటం..."

---



"మా అమ్మ నవ్వితే బుగ్గలో అందంగా చొట్ట పడుతుందిరా!"

"ఏడ్చేవ్ పోవే! మా అవ్వ నవ్వకుండానే రెండు బుగ్గల్లోను చొట్ట వుంటుంది. తెలుసా!"

'ఏవే పోస్టు బాబాయ్! మా అత్తమ్మకి ఉత్తరా లేమన్నా వచ్చాయా ?' పెండేనికి తాడు కట్టుతున్న కనకయ్య ఆటువయిపు వస్తున్న పోస్టుమేన్ రాఘవయ్యను చూచి అడిగాడు. పోస్టుమేన్ రాఘవయ్యను చూడగానే వుత్తరా లేమన్నా వున్నాయా అని అడగటం కనకయ్యకు సరదా. ఎప్పుడు ఎక్కడ కనిపించినా అడుగుతాడు. ఆఖరికి చీకట్లో చెరువుదగ్గర కనిపించినా సరే అడుగుతాడు.

'చెరువు దగ్గరకూడా వుత్తరాలేనా బుల్లోడా ? వత్తాయిలే, పెళ్లాం దగ్గర్నుంచి వుత్తరమంటే ఎంత సంబరమో పిల్లాడికి-' కళ్ళజోడు పైనుంచి చూస్తూ నవ్వుతూ అంటాడు పోస్టుమేన్ రాఘవయ్య.

'ఛీ పోవే బాబాయి-' సిగ్గుతో కులుకుతూ అంటాడు కనకయ్య.

ఆ రోజు అడిగినదానికి రాఘవయ్య చేతిలోని వుత్తరాలకట్టలో వెతుకుతూ, 'వుత్తరమా బుల్లోడా-చింతాకు మాణిక్యమ్మకు ఒక కార్డు వుండాలే-అదే చూత్తున్నా....ఆఁ-కనబడింది....ఇంద బుల్లోడా తీసుకో-' అని, ఒక కార్డు బయటికి తీసి యిచ్చాడు.

మురికి చేతులను బనీనుకు తుడుచుకుని జాగ్రత్తగా కార్డును అందుకున్నాడు. కార్డుకు ఎక్కడ మురికి అంటుతుందో నని కొసన పట్టుకుని అటు ఇటు త్రిప్పుతూ, 'ఎక్కణ్నుంచి వచ్చింది బాబాయ్ ?' అని అడిగాడు.

'ఎక్కణ్నుంచి వత్తది బుల్లోడా ? దొరసాని కాడ్నుంచి వచ్చింది. సీమరాణి నీ పెళ్ళాం రాసిందిరా పిచ్చి సన్నాసి-'

ఆ మాట వినగానే కనకయ్య ఎగిరి గంతేసి, 'వుత్తరం వచ్చింది-వుత్తరం వచ్చింది - రాజ్యం రాసింది అత్తమ్మోయ్-' అంటూ హడావుడిగా లోపలకు పరుగెత్తాడు.



'ఏవిటో' ఆ పొలికేకలు. ఆఁ-వుత్తరమా ? అమ్మాయి రాసిందా ? రాజ్యం రాసిందా ? తే. తే. ఇటు తే-' అని కనకయ్య చేతిలోని కార్డును లాక్కుంది చింతాకు మాణిక్యమ్మ, ఏరుతున్న బియ్యం సంగతి కూడా మర్చిపోయి.

కార్డును క్రిందకు మీదకు చూస్తూ,

'అమ్మాయి రాసిందేనా కనకా ?' అంది.

'అవునత్తమ్మ. రాజ్యం రాసిందే. పోస్టుమేన్ రాఘవయ్యబాబాయి చెప్పాడు కూడ-'

'అవును - రాఘవయ్య చెప్ప వల్సిందే ? నీకేమన్నా తెల్సి చస్తుందా ఏమన్నానా ? చదువా చట్టుబండలా ?' అని, మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినట్లు, 'ఏమన్నావురా ? రాజ్యమా ? దాన్ని రాజ్యం గిజ్యం అనవద్దని ఎన్నిసార్లు చెప్పాలి ? దాని పేరు స్వరాజ్యలక్ష్మి... చింతాకు స్వరాజ్యలక్ష్మి. తెల్సిందా ? ఆఁ-' అంది, కనకయ్య వంక రుసరుస చూస్తూ.

కనకయ్య అమాయకంగా, 'చింతాకు స్వరాజ్యలచ్మి కాదత్త - తుమ్మల స్వరాజ్యలచ్మి-' అన్నాడు.

కనకయ్య అన్న మాటతో మాణిక్యం మొగంలోని కళంతా జారి పోయింది. దిగులుగా నిట్టూర్చి, విచారంగా తల పట్టుకుని, 'అవునదతుమ్మలదే ! ఆ సచ్చినోడు దాన్ని చిన్నప్పుడే నీ కేసి కట్టాడుగా ? సచ్చి ఏ లోకాన వున్నాడో ఏమో నా తల్లి గొంతు నిలువునా కోశాడుగందా- ఈ మొద్దుపచ్చినాడికి కట్టి-'అని, కనకయ్య మొగాన మెటికలు విరిచింది.

పాపం కనకయ్య బిక్క మొగం వేశాడు.

'ఓరి రామచంద్రా ? ఎక్కడున్నావురా తండ్రి-' అంటూ తన మహా కాయాన్ని బరువుగా లేపి నిల్చుంది.

చీర కుచ్చిళ్ళు విదిలించి, ముసలి జుట్టును కొనగోళ్ళతో దువ్వి పుని జుట్టును ముచ్చట ముడేసుకుంటూ, 'అట్టా వెళ్ళి-ఆ కోమటి రత్తయ్యతో వుత్తరం చదివించుకునొస్తా. ఏ దున్నా డంటే చదువా చట్టుబండలా ? ఎన బోతువాటం పీడూనూ, కోస్తే ఇవతల వూరికి అవతల వూరికి సరిపోతాడు.... మా అమ్మ-దొరసాని-పట్నంలో కాలేజిలో బి. యే. చదువుతోంది. ఆ బంగారుతల్లికి, వీడికి సాపత్తం ఏమిటి -పేరబ్బం కాకపోతే-' అని, దొర్లు కుంటూ దొర్లుకుంటూ బయటికి నడిచింది.

పెండేన్ని దగ్గరకు లాగుతూ, 'ఒరేయ్ కనకా ! పలకడేం వమ్మా- ఈడి చెవుల్లో జిల్లేల్లు మొలవా ? నిన్నేరా మొద్దు సచ్చినాడా ? ఆ బియ్యం ఏరి పొయ్యిమీద పడేయ్. గొడ్లకు పులకపిండి రుబ్బివుంచు నేను వచ్చేసరికి-'అని అంది. కాదు, అరచింది.

మాణిక్యమ్మ అటు వెళ్ళగానే వళ్ళో చేట పెట్టుకుని, వుషారుగా పదాలు పాడుతూ, బియ్యం ఏరటం మొదలు పెట్టాడు మాణిక్యమ్మ తిట్టిన కటిక తిట్లు కనకయ్యమీద పని జేయు లేదు. కనకయ్యలో వున్నదే అది.

ఎవరెన్ని అన్నా పట్టించుకోడు. తిట్టినా సరే దులిపేసుకు పోతాడు. తన తత్వం ఏమిటో తనది. ఒకరి మాట తనకు పట్టదు; పట్టించుకోడు. అలా పట్టించుకునేవాడయితే, అత్తామామల తిట్లుకు ఒడిసి చిన్నప్పుడే బుద్ధిగా చదువుకునేవాడు. రాజ్యం లాగా పట్నంలో కాలేజీలో ఏ ఎమ్మేయో చదువుతూ వుండి వుండేవాడు ఈపాటికి.

కనకయ్యకు చిన్నప్పట్నుంచీ చదువు అంటే ఇష్టం లేదు. అతని చిన్నతనంలోనే తల్లి చనిపోయింది. ఇంట్లో వున్నా, బడి కెళ్ళినా తల్లే గుర్తుకు వచ్చేది. చెరువుగట్ల వెంబడి, జువ్వి చెట్లమీద ఎక్కి, గొడ్లకాడ కుర్ర వాళ్ళతో ఆటలు ఆడుకుంటున్నప్పుడు తల్లిని మర్చిపోయే వాడు. అలా చెరువు గట్లవెంట తిరగటం, సావాసగాళ్ళతో తిరగటం కనకయ్యకు అలవాటయి పోయింది. మేనమామ వచ్చి, తల్లీ దండ్రీ లేని తనను ఈ వూరికి తీసికొని వచ్చి తన యింట్లో పెట్టుకున్న తర్వాత కూడా కనకయ్యకు ఆ అలవాటు పోలేదు. 'నీ కంటె చిన్నది, ఆడపిల్ల రెండు పూటలా బడి కెళ్ళి చదువు కుంటున్న రాజ్యాన్ని చూచి అయినా బుద్ధి తెచ్చుకోరా' అని మేనమామ ఎన్ని తిట్టినా కొట్టినా కనకయ్య తన అలవాటును మానుకోలేకపోయాడు.

కనకయ్య మేనమామ చెంగయ్య, చెల్లెలు చనిపోయేముందు, కనకయ్యను పెంచి, పెద్దజేసి పెద్ద చదువులు చదివించి తన కూతురు రాజ్యాన్ని యిచ్చి పెళ్ళి చేస్తానని మాట యిచ్చాడు. తన చెల్లెలికిచ్చిన మాటను నిలుపుకోవాలని చెంగయ్య ఎంతో ప్రయత్నించాడు. కనకయ్యకు నయానా భయానా చెప్పి చూశాడు. కాని లాభం లేకపోయింది. విసిగి చేసేదిలేక వూరుకున్నాడు. చదువులు చెప్పించలేకపోయినా కూతుర్ని అయినా యిచ్చి పెళ్ళిచేద్దామనుకున్నాడు. అందుకు మొదట్లో మాణిక్యమ్మ పడనీయలేదు. కాని కనకయ్య పేరన ఎనిమిది ఎకరాల భూమి వుండే సరికి నోరు మూసుకుని వూరుకుంది. కనకయ్యకు పదహారవ సంవత్సరంలో చెంగయ్య మంచాన పడ్డాడు. తను కన్ను మూసేముందుగా రాజ్యం కనకయ్యల పెళ్ళి కళ్ళారా చూడాలని పెళ్ళి ప్రయత్నాలు చేయించాడు చెంగయ్య. అప్పటికి రాజ్యానికి పదకొండో సంవత్సరం. ఆరో క్లాసు చదువుతోంది. ఇంత చిన్న వయస్సులో అప్పుడే పెళ్ళి ఏమిటని మాణిక్యమ్మ నసిగింది. ఎంత నసిగినా పెళ్ళి ఆగలేదు. జరిగిపోయింది. పెళ్ళయిన కొన్నాళ్ళకు చెంగయ్య కళ్ళు మూశాడు. ఇంక మాణిక్యమ్మదే

రాజ్యం! క్రింద పెట్టి మీద పెట్టి కనకయ్య పేర నున్న భూమిని తన పేర రాయించుకుంది. కనకయ్యను జీతగాడికంటె కనాకష్టంగా చూడటం మొదలు పెట్టింది. కూతురుమీద పంచ ప్రాణాలు పెట్టుకుంది. కూతురును డాక్టరమ్మను చెయ్యా లని బస్తీకి పంపి కాలేజీ చదువు చెప్పిస్తోంది.

కనకయ్య బియ్యం పరటం పూర్తి చేసి, పొయ్యి రాజేసి ఎసరు పెట్టాడు. రోట్లో పులవలు వేసి వుషారుగా రుబ్బటం మొదలు పెట్టాడు.... రాజ్యం కాదు కాదు. స్వరాజ్యలక్ష్మి-ఎప్పుడు వస్తుందో ఏమిటో. సంక్రాంతి శలవులకు వచ్చింది. మళ్ళీ ఇంతవరకు రాలేదు. ఇవ్వాళ్ళ రాసిన కార్డులో తనెప్పుడు వచ్చేది రాసి వుంటుంది. సంక్రాంతి పండుగకు వచ్చినప్పుడు రాజ్యం బలే బాగుంది. బస్తీనీళ్ళు వంటికి బాగా పడ్డాయట్టుంది. బాగా రంగు తేలింది - మనిషి నున్నగా బంగారం మెరిసిపోయినట్టు మెరిసి పోతోంది. మెరవక ఏం జేస్తుంది, అత్తమ్మ బస్తీ కెళ్ళే వాళ్ళచేత తేప తేపకు ఇన్నిన్ని సున్నివుండలు, ముంతలకొద్ది నెయ్యి పంపుతుంటే. సంక్రాంతికి వస్తున్నప్పుడు స్టేషనుకు సవారిబండి కట్టుకెళ్తానంటే అత్తమ్మ పడనీయలేదు. కరణంగారి బండిని ఆళ్ళ జీతగాడితో పంపించింది. తనకేమో బండి తోలటంకూడ చేతగాదంట. తన కూతుర్ని ఎక్కడ పడేస్తానో నని భయం.... రాజ్యం బండి లోంచి దిగి తన్ను చూచి నవ్వి, 'ఏం బావా, బాగున్నావా?' అని పలకరించింది. 'బాగుండ కేం మాయ రోగమా?' అని అత్త అంటుకుంది. ఈ అత్తముండ కొకటి-రాజ్యాని కసలు తనంటే ఇష్టమే? ఈ మాయదారి ముండే పడనియటం లేదు. రాజ్యం తనను ఏమీ అనదు. పోయినసారి వచ్చినప్పుడు రాజ్యం లేనప్పుడు దాని గది లోకి వెళ్ళి అది బస్తీ నుంచి తెచ్చిన బొమ్మల పుస్తకంలో బొమ్మలు మాచుకుంటుండగా రాజ్యం వచ్చింది. తనకు బలే భయం వేసింది. ఏమన్నా అంటుందేమో నని వణికిపోయాడు. రాజ్యం ఏమీఅనలేదు. 'ఏంటి బావా! బొమ్మలు చూచుకుంటున్నావా? చూచుకో-ఫర్వాలేదులే-' అంది. అదే గనక ఈ అత్త అవుతేనా?.... ఈ అత్త అనుకుంటుంది, రాజ్యం బస్తీ చదువులు చదవటం తన కిష్టంలే దని. ఈ అత్తది వుత్త పిచ్చమేళం. రాజ్యం పెద్ద పెద్ద చదువులు చదవటం తనకు మాత్రం ఇష్టం కాదా! ఫలానోడి పెళ్లాం ఇన్ని చదువులు చదివింది అంటే తన కెంత ఇది-నేను చదవక పోయినా అది చదువుతుంటే తన కెందుకు బాధ? రాజ్యం చదువుకు యిబ్బంది కలుగు



**"అలా చూస్తారేం బాబుగారు - నన్నెరగనట్టు?! మీ ఇంటి కెదురుగా క్రాపింగు షాపు ఉందే...ఆ సెలూన్ నేనే కదండి పెట్టిందీ...!**

తుందని కదా తన సంగతి బయట పెట్టకుండా వుంది....

కనకయ్య తనలో తాను ముసిముసి నవ్వులు నవ్వుకుంటుండగా బయటి కెళ్ళిన మాణిక్యమ్మ వచ్చింది.

'ఓర్నీ సంబరమేం. ఎందుకో? నీలో నీవు మురిసిపోతున్నావు?'

'ఏం లేదత్త-అఁ-రాజ్య-స్వరాజ్య లక్ష్మి ఏం రాసింది?'

'మా అమ్మకు పరీక్షలు అయిపోయా యంట. ఇంటి కొస్తున్నానని రాసింది- అఁ-రాకపోయినా నీ కివన్నీ దేనికిరా? ప్రతి దాంట్లో నేనున్నానంటూ అందు కుంటావు? ఇంతకీ పిండి రుబ్బేవా?'

'ఓయస్‌గా-చూ డెట్టా రుబ్బేనో? కాటుక లాగా మెత్తగా తయారు చేశాను తెల్సా?'

'పడిశావుటే-'

* * *

ఆరోజు రాజ్యం వచ్చే రోజు.

కనకయ్య రోజూకంటె ఆవాళ పెందరాళే నిద్ర లేచాడు. చకచక తన పను లన్నీ పూర్తి చేసుకున్నాడు. చెరువునుండి కావిడేసుకొచ్చేటప్పుడే చెర్లో శుభ్రంగా స్నానం చేసివచ్చాడు. తలకు ఆముదం పట్టించి నున్నగా దువ్వుకున్నాడు. తిలకం బొట్టు పెట్టు కున్నాడు. రెండురోజులకు ముందు గానే చాకలి రామితో చెప్పి చలవ చేయించిన పంచ కట్టాడు. కురచ చేతుల చొక్కా తొడిగాడు. చెంగయ్య మామ జరీకండవా బయటికితీసి మెళ్లో వేసుకుని, పంతులుగారి దొడ్లో కోసు

కొచ్చిన సంపెంగపూలు చెవులో దోపాడు. గిత్తల్ని బయటికి తీసి బండి కట్టి, బండిలో పరచటానికి తివాచీ తీసుకురావటానికి లోపలి కెళ్ళాడు. లోపలి కొచ్చిన కనకయ్యను క్రిందకు మీదకు చూచి, 'ఏంటిరోయ్? సోకు చేసుకున్నావు?' అని మాణిక్యమ్మ అడిగింది.

'బేసన్లు వెళ్తున్నా-' ముసిముసిగా నవ్వుతూ అన్నాడు.

'మాబాబే! చాల శ్రమపడ్డావు గాని ఇకెళ్ళు: వెళ్ళి ఆ పేడ ప్రోగుర పిడకలు కొట్టు-మంచి వాసన కొట్టుం దమ్మాయికి' అంతే.'

'రాజ్యం ఇవాళ వస్తుంది కదత్తా! మురెక్కా వస్తుంది. బండి తీసికెళ్ళక పోతే—'

'తెల్లవారుఝామునే నాయుడి గారి బండి పంపానురా-'

పాపం, కనకయ్య నీళ్ళుకారి పోయాడు. 'అదేంటి అత్తా, నిన్న నీవే అన్నావుగా, నేవు తీసుకువెళ్ళమని-'

'టింగురంగా అంటూ నీవు వెళ్ళితే యింటికాడ పని లెవడు చేస్తాడురా నీ అబ్బ! పద, పద, ఆ పేడ పనేంటో చూడు....దసరా బుల్లోడిలాగా తయారయ్యావు-' మాణిక్యమ్మ విదిలించికొట్టేసరికి బిక్కమొగం వేసుకుని సావిట్లోకి నడిచాడు కనకయ్య.

పిడకలు చేస్తున్న కనకయ్య బయట ఎద్దుల గంటల మ్రోతలు వినగానే పరుగెత్తుతూ సావిట్లోకి వచ్చాడు.

మాణిక్యమ్మ, బండి దిగిన కూతురు ముందు ఎర్రనీళ్ళు దిష్టి తీసిపోస్తూ, 'అదేంటే తల్లి, అలా పీక్కుపోయావు, తెల్లగా పాలిపోయావేంటే మా అమ్మ-' అంది.

రాజ్యం తల వంచుకుని, 'పరీక్షలు కదే!' అంది.

పేడ చేతులతో వచ్చిన కనకయ్యను చూచి పలకరింపుగా నవ్వింది రాజ్యం.

'పూం-తప్పుకో, తప్పుకో, పేడ కంపూ నువ్వూ. రాంగానే ఎదురు-' మాణిక్యమ్మ కూతుర్ని లోపలికి తీసికెళ్తూ కనకయ్యమీద విసుక్కుంది.

సామాను లోపల పెట్టి బండిలోని కెళ్తున్న నాయుడిగారి బండివాడు కనకయ్యను చూచి నవ్వుతూ, 'దొరసాని దిగిందిగా-ఇక కనకయ్యకు రెండు చేతుల నిండా పనే!' పరాచిక మాడాడు.

కనకయ్య దిగులుగా పేడచేతుల వంక చూచుకున్నాడు.

రాజ్యం బస్తీనుంచి వచ్చి నాలుగు రోజు లయింది.

శాస్త్రుల్లుగారింటి కెళ్ళివచ్చిన మాణిక్యమ్మ, 'ఒరేయ్ కనకాయ్!' అని కేక వేసింది. పగ్గంతాళ్ళు పేనుతున్న కనకయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు

కాగులో నీళ్లు కాగాయట్టుంది. కాగు బయటికి పెట్టు' అంది.

'రాజ్యం స్నానం చేసిందిగా, ఇంకెందుకు?'

'చేసిందిలేవోయ్-'

'మరి నీవు చేస్తావా?'

'అబ్బబ్బ ప్రతిదానికి ఇరవై నాల్గు ప్రశ్నలు వేస్తావేరా? నీకే. తలంటుకుందువుగాని. బయట పెట్టి తువ్వాల కట్టుకురా-' అంది మాణిక్యమ్మ.

మాణిక్యమ్మ పసరు పోస్తుంటే తల రుద్దుకుంటున్న కనకయ్యకు అంతా అయోమయంగా వుంది. ఆ రోజు అత్త పనిమాల తనకు తల ఎందుకు అంటుతుందో అర్థం కాలేదు. పండుగేమీ లేదు. ఎప్పుడన్నా పండుగకు తలంటుకోవల్సి వస్తే తనే పసరు పోసుకుని తనే తల రుద్దుకునేవాడు. ఈ రోజేమో అత్త దగ్గరుండి పసరు పోస్తోంది. రాజ్యం వచ్చిన దగ్గర్నుంచీ అత్త అదోక మాదిరిగా వుంటోంది. ఇదివరకులాగా చీటికి మాటికి తనను తిట్టటం లేదు. వూరికే తిట్టవద్దని రాజ్యాం చెప్పిందేమో. అదేంటో ఈసారి రాజ్యంకూడ అదోక మాదిరిగా వుంది. ఇదవరకు యింటికొస్తే చక్కగా ముస్తాబయి పాటలు పాడుతూ, యింట్లో చెక్కవుయ్యాల వూగుతూ, పుస్తకాలు చదువుకుంటూ వుండేది. మరీసారి ఏమయిందో ఏమిటో, వచ్చి నాల్గురోజు లయినా గది వదిలి బయటికి రావటం లేదు. ఎప్పుడు చూచినా గదిలోనే పడుకుంటుంది. ఏంటో అంతా గమ్మత్తుగా వుంది....

కనకయ్యకు వాళ్ళత్తమ్మ పిండి వంటలతో భోజనం పెట్టేసరికి ఇంకా గమ్మత్తు అనిపించింది. చెంగయ్యమామ పట్టుపంచె పెట్టి అడుగునుంచి బయటికి తీసి కట్టుకోమంది. కనకయ్య అమాయకంగా, 'ఇవన్నీ దేనికత్తమ్మా?' అని అడిగాడు. 'కట్టుకోరా అంటుంటే' అని గదమాయించింది. కనకయ్య కిక్కురుమనకుండా కట్టుకున్నాడు.

భోజనం అయినతర్వాత కనకయ్య మెల్లగా బయటికెళ్తుంటే చూచి, 'ఎక్కడికిరా చీకట్లో?' అని అడిగింది మాణిక్యమ్మ.

'కోమటి రత్తయ్య కొట్టుదాక అత్తమ్మ. ఇంత బెల్లంముక్క నోట్లో వేసుకుందామని-' నీళ్ళు నమిలాడు.

'బెల్లంలేదు, సున్నంలేదు. ఇంద-ఊఁ-ఈ తాంబూలం వేసుకో-'

ఈ రాత్రికి గాలీవానా తప్పదు, అత్త ఇంత ప్రేమ కురిపిస్తోంది అనుకున్నాడు కనకయ్య. తాంబూలం వేసుకోవటం పూర్తి అయిన తర్వాత మాణిక్యమ్మ, కనకయ్యను చూచి. 'ఈ రాత్రికి అమ్మాయి గదిలో పడుకోరా కనకాయ్-' అంది.

'ఎందుకత్తమ్మా? రాజ్యం గది లోకి వెళ్ళితే కాళ్ళు ఇరగకొట్టుతా నన్నావుగా ఇదివరకు-' పట్టుమంచె ఎర్రంచువంక చూస్తూ గొణిగాడు కనకయ్య.

'అబ్బబ్బ-అన్నీ పీడి కెక్కడ చెప్పి చావనమ్మా - ఫర్వాలేదురా బాబు, ఇప్పుడు నేనే వెళ్ళమంటున్నానుగా వెళ్ళు-' అని లోపలికి నెట్టింది.

'అత్తమ్మో, నా గొంగళి గొడ్ల సావిట్లో వుంది-' అని కేక పెట్టాడు.

'ఛా-ఛా-' అని బయట గోళ్ళెం పెట్టింది.

కనకయ్య ఇటు తిరిగి చూశాడు. బల్లమీద సున్నివుండలు, పంచదార చిలకలు, అగరువత్తులు కనిపించాయి. కనకయ్య చూపులు అటు నుండి ప్రక్కకు జరిగాయి. పందిరిమంచం, తెల్లటి దుప్పటి, తలగడలు, మంచానికి చివరగా తల వంచుకుని రాజ్యం కూర్చుంది. పెద్ద జడ, జడలో మల్లె పూలు, సిల్కుచీర, గూట్లో వెలుగుతున్న కోడిగ్రుడ్డు దీపం. అత్తమ్మ లోపలికెందుకు పంపిందో కనకయ్యకు అప్పుడు కొంచెం అర్థమయింది. అయినా భయమే. రాజ్యాన్ని పలకరిద్దామనుకున్నాడు. పలకరిస్తే ఏమన్నా అంటుందేమో-'అమ్మోయ్-' అని అరుస్తుం

ఏం చెయ్యాలో? ఏం చేయకూడదో? అంతా గాబరాగా, అయోమయంగా వుంది. వళ్ళంతా చెమటలు పట్టుతున్నాయి. గొంతు తడి ఆరిపోతోంది. రాజ్యాన్ని వూరికే చూడాలనిపిస్తోంది. రాజ్యాన్ని తాను చూడటం, మాణిక్యమ్మత్త ఏ కిటికీలోంచో తొంగిచూచి, రాజ్యానికి దిష్టి తగులుతుం దని దిష్టి తీసివేసి తన్నెక్కడ దుమ్మెత్తి పోస్తుందో నని భయం....

ఇంతలో సన్నటి ఏడ్పు వినిపించింది. కనకయ్య రాజ్యం వంక చూశాడు. రాజ్యం సన్నగా వెక్కి వెక్కి ఏడుస్తోంది. రాజ్యం ఏడవట మేమిటి? అసలు రాజ్యాన్ని ఏడిపించే విషయం ఏమిటి? రాజ్యం ఏడవటం చూస్తుంటే తన గుండె తరుక్కుపోతుంది.

మెల్లగా రాజ్యందగ్గరి కెళ్ళి భుజం మీద చేయి వేసి, 'రాజ్యం, ఎందు కేడుస్తున్నావు?' అని మెల్లగా అడిగాడు.

రాజ్యం ఏడుపు ఇంకా ఎక్కువయింది.

'ఏడవ్వాకు రాజ్యం. నీవు ఏడుస్తుంటే నాకూ ఏడుపు వస్తుంది. అత్త నీ ఏడ్పు విన్నదంటే నేనే నిన్ను ఏడిపిస్తున్నా నని నన్ను తిట్టిపోస్తుంది....



"జోస్యం చెప్పించుకొని మట్టిబెడ్డలు ఇస్తున్నావేమయ్యా?"
"ఇప్పుడే కదయ్యా ఈ క్షణంనించీ నే పట్టిందంతా బంగారమనుకో అని చెలితివి మరి..."

నని భయమా? నీకిష్టం లేకపోతే నే నేమీ చేయను రాజ్యం .... అయ్యో పూరుకో రాజ్యం-నేను బయటి కెళ్ళిపోతానులే-' అని వెనక్కి తిరిగాడు.

'ఆగు బావ-' అని చేయి పట్టుకుంది రాజ్యం. కనకయ్య ఆగిపోయాడు. మంచంమీద కూర్చోపెముంది. కూర్చున్నాడు.

'అమ్మ నిన్ను లోపలి కెందుకు పంపిందో తెల్సా?' అని అడిగింది.

తెలు సన్నట్లు సిగ్గుపడ్తూ తలకాయ వూపాడు.

రాజ్యం రెండు చేతుల్లో మొగాన్ని పెట్టుకుని భోరు మని పడ్చింది. కనకయ్యకు గాభరా ఎక్కువయింది.

'అసలు సంగతేమిటో చెప్పు రాజ్యం-'

'బావా-నేను మంచిదాన్ని కాదు బావ .... చెడిపోయాను .... పూర్తిగా చెడిపోయాను-' రాజ్యం వెక్కిళ్ళు పడుతోంది. లావుగా వుబ్బిన కళ్ళతో రాజ్యం శోకమూర్తిలాగా వుంది.

'నే నిప్పుడు పట్టునిపిని కాదు బావ-నా కిప్పుడు మూడోనెల. మా కాలేజీ కుర్రవాడొకడు నన్ను ప్రేమించినట్లు నటించాడు. నన్ను మోసపుచ్చాడు. ఇలా దగా చేశాడు. అతని అందానికి, తీయటి మాటలకు మోసపోయాను-ఇలా దగాపడ్డాను... చనిపోదా మనుకున్నాను - చావలేక

పోయాను-' రాజ్యం కళ్ళవెంట కన్నీరు ధారలుకట్టి కారుతున్నాయి. దీపం కాంతిలో రాజ్యం కన్నీటిని చూస్తుంటే కనకయ్యకు కడుపు తరుక్కుపోతోంది. పాపం, చిన్నపిల్ల-తెలిసీ తెలియక మోసపోయిందనిపించింది.

'అమ్మ నీకీ విషయాన్ని చెప్పకద్దు అంది-ఎలాగో నిన్ను మభ్యపెట్టమంది. కాని నాకే ఇష్టంలేకపోయింది. అసలే నీవు అమాయకుడవు .... ఇప్పటికే నీ కన్యాయం జేశాను; పాపాన్ని కడుపులో పెట్టుకున్నాను. నిన్ను మోసగించి ఆ పాపాన్ని కూడ దాచుకోలేను. అందుకే చేసిన పాపాన్ని చేసినట్లు చెప్పాను....ఆ తర్వాత నీ యిష్టం-'

రాజ్యం మంచితనానికి కనకయ్యలో జాలి పొంగిపోర్లింది. అత్త ఉడిగుడ్డలతో గొంతులు కోసేరకం. ఎంత మోసం? ఎంత మోసం? నన్ను మభ్యపెట్టమందా? అత్త కడుపున రాజ్యం తప్పపుట్టింది. నిజంగా రాజ్యం చాల మంచిది. ఎంత మంచిదికాకపోతే వున్న సంగతిని వున్నట్లు చెప్పుతుంది. రాజ్యం చెప్పకపోతే ఈ సంగతులన్నీ తన కెట్లా తెలుస్తాయి.

'నిన్ను మోసంచేసిన ఆ వెధవగాడ్ని మీ యిద్దరికి మళ్ళీ పెళ్ళి చేయిస్తాను-' అన్నాడు.

'తెలియదు బావ! ఎక్కడికో పారిపోయాడు. ఆ మోసగాడు తిరిగివచ్చి ప్రాధేయపడినా సరే వాడి మొగం కూడా చూడను-'

'నిజమా? వాడిమీద నీకింక మనస్సు లేదా?'

'లేదు బావ-'

కనకయ్య ఏదో ఆలోచిస్తున్నట్లుగా అడిగాడు, 'నేనంటే నీ కిష్టమేనా?'

'ఇష్టాన్ని పెంచుకుంటానికి ప్రయత్నిస్తాను బావ-'

'నేను చదువురాని మొద్దును రాజ్యం!'

'నేను చదువు వచ్చిన ఎద్దును బావ-'

'అయితే, పాత సంగతులన్నీ మర్చిపో. నీవు మళ్ళీ ఇప్పుడున్నావే పుట్టావనుకో. ఇకనుంచి నీవు కనకయ్య పెళ్ళానివి రాజ్యం-' అని రాజ్యాన్ని దగ్గరకు లాక్కున్నాడు.

రాజ్యం, కనకయ్య గుండెలమీద తల పెట్టుకుంది.

తనను మోసంచేసి తన దాకిన తాను పోయిన రామారావు రాసిన ఆఖరి వుత్తరంలోని కొన్నిమాటలు రాజ్యా




"వెయ్యి బస్తాలు సిమ్మెంటు కావాలి!"

"ఎందుకు?"

"భూమి అడుగున గది కట్టడానికి!"

"దేనికి?"

"సిమ్మెంటు బస్తాలు దాచిపెట్టడానికి!"

---

వున్నాడన్న విషయం వినేసరికి నేను పయినుండి క్రిందకు పడ్డట్టనిపించింది రాజీ! అందులో నీ బావనే పెండ్లి యాడానంటున్నావు. నీ బావను అసలు అలా ముట్టుకోనైనాకూడ ఎరగనని నీవన్నప్పటికీ ఎందుకో నేను నమ్మ లేకపోతున్నాను. అసలే నీవు చాల వుద్రేక స్వభావురాలవు .... ఏమో, ఏ బలహీన క్షణంలో ఏం జరిగి వుంటుందో? నీవు నన్ను అసహ్యించు కున్నా సరే-నా నమ్మకాలు, వూహాలు, ఆసలు అన్నీ సడలిపోయాయి. నేను మగవాడ్ని రాజీ! మరొకరితో ఒకే స్త్రీని పంచుకోలేను. నేను మానవా తీతుడ్ని కాను, కాలేనుకూడ. నాలో మనిషిలో వుండే అన్నిరకాల బలహీనతలున్నాయి. వాటిని అలానే వుండా లనుకుంటున్నాను. అందుకనే మన ఈ సంబంధాన్ని ఇంతటితో కట్ చేస్తున్నాను. నిన్నేదో మోసం చేశా నని నన్ను నిందించకు. ఈ విషయంలో నా కెంత బాధ్యత వుందో నీకూ అంతే వుంది. నేను పిరికివాడ్ని....

రామారావు.

అవును. నిజంగానే పిరికి వెధవ! బావ అన్నట్లు ఈ రోజు నేను క్రొత్త జన్మ ఎత్తాను. బావ చదువురాని మొద్దు అయితే మాత్రం - బావలో వున్న సంస్కారం చదువుకున్న వాళ్ళల్లోగూడ లేదు. కనకయ్యబావ చాల మంచివాడు .... అనుకుంది రాజ్యం!



'మోహిని లాంటిది దిగివచ్చి అమృతం పంచిపెడుతున్నప్పుడు నేను రాక్షసుల వరసలోనే కూచుంటాను. రుచీపచీ లేని ఆ అమృతపు చుక్కలు వెర్రిదేవతల చేతుల్లో పోసి కంటి కటాక్షామృతాన్ని రాక్షసులకి ప్రసాదించి కరకు గుండెల్లో కలకలనాదం పలికించింది. ఆ సమ్మోహనాస్త్రం చవి చూశాక యిక చచ్చిపోతే మాత్రం ఏం కొరత!'

ఈ మాటలు అన్నది మా పెద్ద మేనమామ మురళీధరరావు. 'రాజారాం కట్టుకున్న పెళ్లాన్ని వదిలిపెట్టి కృష్ణతో ఉంటున్నాడని లోకమంతా దుమ్మెత్తి పోస్తోంది. నాకు మాత్రం అందులో ఏం తప్పు కనిపించలేదు. రసపిపాస ఉన్న మొగాడెవడైనా సరే కృష్ణలాంటి దాన్ని చూసిన తరువాత లోకాన్నంతటినీ విడిచిపెట్టి అయినా ఆ అమ్మాయి వెంట పడతాడు! అవును మరి. అంత సౌందర్యం ఆ దెవరికి అందుబాటులో

# ఏకపత్నీవ్రతుడి కథ

## అవసరాల రామకృష్ణారావు




ఉంటుందో గాని బాహ్య సౌందర్యానికే ప్రపంచ మంతా పడిచస్తుంది. పై పైకి చక్కగా కనబడేవాటిలోనే భగవంతుడనేవాడిని కనుక్కోడానికి ప్రయత్నిస్తాం. లావుగా ఉన్నవాళ్లూ, నల్లగా ఉన్న వాళ్లూ పొట్టిగా ఉన్నవాళ్ళూ వికారమైన ముఖ లక్షణాలు ఉన్నవాళ్ళూ అలా ఉన్నామని విచారించని క్షణం ఉండదు. నిజాన్ని ఒప్పుకుని ఆ విధంగానైనా ఒక మంచి పని చెయ్యడం మంచిది। తలలో నాలిక లాంటి భార్య ఎవడి క్కావాలి ? వెర్రి మాట, అందాల అందోళిక కావాలిగాని.'

ఇలాంటి మాటలు అంటున్నప్పుడు తెల్లబోయి మామయ్య వైపు చూసే వాళ్ళం. ఆ మొహంలో కనిపిస్తున్నది వర్చస్సో లేక రక్షస్సో అది మాత్రం బోధపడేది కాదు. పుట్టుకతో వచ్చిన పూర్ణచంద్రుడిలాంటి స్వరూపం, పడుచుతనంతో వచ్చిన చక్కదనం విద్య కోసం విదేశం వెళ్ళిరావడంతో వచ్చిన విజ్ఞానం ఇన్నీ కలిసి కన్య లందరికీ కడుప్రియమై పోయాడు మామయ్య. జడలు ఎత్తికట్టి, మెడలు ఎత్తిపెట్టి 'ఇదిగో అబ్బాయీ, ఆ మూడు ముళ్ళూ మా మెడలో వెయ్యవూ?' అని వగలు కురిపిస్తున్న వయ్యారుల సరసలో ఆఖరున తల వంచుకు నిలబడిన శకుంతలకి ఆ అదృష్టం పడుతుందని కలలోకూడా ఎవరూ అనుకొని ఉండరు.

'ఏదో పెద్ద కష్టపడిపోయిందని ఆ సీతమ్మకు అందరూ సానుభూతి చూపిస్తారు, కాదనలేము. కాని రాముడు ఒక్కఆడదాన్ని నమ్ముకుని పడిన సుఖ మేమిటని? సీతమ్మను తన దగ్గర ఉంచినా అడవిలోకి పంపినా రాముడది చేసింది ప్రజలకోసమే. ఆయన అంతర్గత సంచలనాలూ అవీ ఎవరికి తెలుసు? ఒక్క లేడిని చూస్తేనే సీతమ్మ కన్ను చెదిరింది. వందలాది లేళ్ళలాంటి ముచ్చటైన ముని కన్యల్ని చూసి రఘురాముడి మన స్సెంత చెదిరిందో ఎవరు సాక్ష్యం? అందుకనే రాముడు 'తిరుగుటపా'లో కృష్ణుడి అవతారం దాల్చేడని నా నమ్మకం. పదహారు వేలమందితో వేగిన సంగతలా ఉంచి ఎనమండుగురు భార్య లనైనా అందరూ ఒప్పుకుంటారు గదా! ఎనిమిది ఏమంత చిన్న సంఖ్య కాదుగదా! ఒక్కొక్కరికి వంద చొప్పున ఒక చిన్న గ్రామం జనాభాను మించిన పిల్లల్ని కనిన చిన్ని కృష్ణమ్మ అల్లరిపనులు కాదనలేం గదా!' అని నోటి కొచ్చినట్టు విమర్శించి, కడుపు నొప్పి పెట్టేదాకా నవ్వించే మా మామయ్య సర్వసాధారణంగా ఉండే శకుంతలను పెద్దలు చెప్పినట్టు విని పెళ్లాడ్డం విశేషం. హాయిగా కాపురం చెయ్యడం విచిత్రం. విరివిగా పిల్లల్ని కనడం విపరీతం!

'వారికి నేను ఏ విధంగానూ తగను. అయినా ఆయన పరాయి ఆడదాన్ని కన్నెత్తి చూడరు—అదెంత అదృష్టమో నాది!' అని మా శకుంతలత్త వాళ్ళ పెళ్ళయిన మొదటి అయిదు సంవత్సరాల్లో అనడంలో కొంతయినా అర్థం ఉంది. వరసగా పిల్లల్ని కనడంతో శరీరం ఒడిలిపోయి సడలిపోయి నలభై ఏళ్ళకే అవ్వలా తయారయిన మా పెద్దత్త మళ్ళీ అదే మాటంటే అందులో ఏమైనా అర్థం ఉందోదూ?

చెప్పొచ్చే దేమిటంటే ఒక యింటర్వ్యూ సందర్భంలో నేను న్యూఢిల్లీ వెళ్ళవలసి వచ్చి వాళ్ళింటికి వెళ్ళి శకుంతలత్తని కలుసుకోడం జరిగింది. ఆమె నోట అదే మాట విని నాకు ఆశ్చ

శ్వర్యం కలిగింది. క్రిందటేడు ఒకరి పెళ్ళిలో చూసిన దానికే సహస్రాంతం తేడా కనిపించింది. ఆమెలో తల మూడొంతులు పండిపోయింది. దవడలు గుంటలు పడ్డాయి. కళ్ళు లోతుకుపోయాయి. ఈ మధ్య యూట్రెస్ ఆపరేషను చేసి తీసెయ్యవలసి వచ్చిందిట. బతుకుతుందని ఎవరూ అనుకోలేదుట. ఇక మామయ్యని చూడబోతే ఆమెకు ఏ తమ్ముడిలాగో కొడుకులాగో ఉన్నాడు గాని మొగుడిలా మాత్రం లేడు. రోజు రోజుకీ ఆ గుండ్రని బుగ్గలకి నునుపూ మెరుపూ ఎక్కువవుతోంది తిండి విషయంలో రోజుకి ఒక పెరుగుగారి, క్రికెట్ ఆటలో రోజుకి ఒక పరుగు చొప్పు నెక్కువవుతున్నాయి గాని తగ్గడం లేదు. ఇక ఆ న్యూఢిల్లీసిటణంలో సహా 'కెయం. రావు' అంటే ఎరగనివారుండరు. అంతటి కలుపుగోలు మనిషి. రెండు వేలు జీతం, రెండంతస్థుల మేడలో ఆరుగదుల అతి సదుపాయమైన వాటాలో కాపురం. కాన్వెంటులోనూ కిండర్‌గార్డెన్ స్కూళ్ళలోనూ చదువుకుంటున్న ఇద్దరు ఆడపిల్లలూ ఇద్దరు మొగపిల్లలూ. వీళ్ళని చూడ్డానికి ఒక ఆయా. ఆమె కాక ఒక నౌకరూ, ఎప్పుడూ యింట్లో ఉండిపోయే ఒక వంటవాళ్ళూ. ఒక కారూ, ఒక కుక్కగారూ...

అన్నీ బాగానే ఉన్నాయి. రూపాయిలు గలగలలాడుతున్నాయి. పిల్లల మొహాలు కళకళలాడుతున్నాయి. తండ్రి ఎప్పట్లా మిసమిసలాడుతూఉన్నాడు. మరేమిటి ఆయింటికి వెలితి? ఏమీలేదు. నాదే పొరపాటు, మాళకుంతల చిన్న కళ్ళుకూడా మిలమిల మెరుస్తున్నాయి!

'మనదేశంలోని ఏ ప్రాంతాల విద్యార్థులకైనా సరే ఒకేఒక సామాన్య ధర్మం ఉంది. అదేమిటంటే పరీక్షల్లో కాపీ కొట్టడం. ఒక్కసారి వాచరుగాని బయటికి వెడతాడా పక్కవాడి పేపర్లో ఒక్కసారి తొంగిచూసి వచ్చేద్దామా అనుకోని విద్యార్థి సర్వసాధారణంగా ఉండడు. ప్రపంచంలోని ఏ ప్రాంతాల యువకుల మనస్తత్వమైనా ఇంతేనని నా ఉద్దేశం. ఎప్పుడు ఎదురింటివాడు బజారుకెడతాడా, ఎప్పుడు అతని పెళ్ళాన్ని ఒక్కసారి ముద్దులాడి వచ్చేద్దామా అని ఉరకలు వెయ్యని యువకబ్రాణి ఉండదు!'

'రామ, రామ! అందరూ అలాగే ఉంటారా? అంత అన్యాయం ఉంటుందా?' అన్నాను నేను ఓసారి మామయ్య మరీ చెబుతూంటే విని ఊరుకోలేక. ఆయన ఫక్కున నవ్వేశాడు.

అలా అంటూనే 'నువ్వు నీ కిష్టమైన ఏఅమ్మాయినో అప్రయత్నంగా రెండుసార్లు తలుచుకున్నావు. 'రామ' అంటే అందమైన ఆడదని నీకు తెలీదా? ఆ గోల్కొండ జెయిల్లో కూచుని కొండంత గోలచేసిన గోపన్నగారు పూర్తిగా 'రామ' దాసు అయిపోలేదా? అంతా 'రామ'

మయం అని అనుక్షణం ఆక్రోశించ లేదా ?'

ఈసారి నేను నవ్వుకున్నాను. ఇంతటి పెద్దమనిషి యిటువంటి బుద్ధిమంతుడూ జవసత్వా లుడిగి జవజవ లాడుతున్న భార్యతో కులాసాగా కాలక్షేపం ఎలా చేస్తున్నాడూ అన్నదే జవాబు లేని ప్రశ్న.

నేను వెళ్ళేసరికి మామయ్య యింట్లో లేడు. పిల్లలు యింకా స్కూళ్ళనుండి రాలేదు. అత్తయ్యే నన్ను ఆదరించి అన్నం పెట్టింది. అందరి గురించీ భోగట్టాలు చేసింది.

'నీ ఒంట్లో ఇప్పు డెలా ఉంది శకుంతలత్తా ?'

అత్తయ్య అదోలా నవ్వింది.

'బాగానే ఉన్నాను బాబూ ! అసలు ఎప్పుడో చచ్చిపోవలసినదాన్ని. ఆయన చూపించే ప్రత్యేక శ్రద్ధా, ఆదరాభిమానాలూ నన్నింకా బతికించాయి. వాటి కోసమే బతుకుతున్నాను!' ఆమె కన్నీళ్ళు కార్చింది. 'అలా నిస్పృహ చెందుతా వెందుకత్తా ; ఇప్పుడు నీ కేమయిం దనీ?'

'నిస్పృహ కాదు బాబూ ! ఇవి పొంగి పొర్లిన ప్రేమ భాష్పాలు ! ఆయనకి నేను ఎటువంటి సుఖమూ ఇవ్వలేను. అయినా నన్ను సుఖపెడదా మని ప్రతి క్షణం మీ మామయ్య ప్రయత్నిస్తాడు. ఎంత పీకలుమునిగిపోయే పని ఉన్నా సాయంకాల మయేసరికల్లా పరిగెత్తుకు వచ్చేస్తారు. తన కిష్టమైన బట్టలు కట్టుకుని చక్కగా ముస్తాబవమని బలవంత పెడతారు. నన్ను యీ యింటిముందున్న పేవ్‌మెంటు మీద అలా ఫర్లాంగు దూరం ఆ కబురూ ఈ కబురూ చెబుతూ చల్లగాలిలో నడిపించుకు వస్తేగాని ఆయనకి తోచదు. ఈ వయసులో నన్ను రెండు జడలు వేసుకోమంటారు. ఇంతటి సొగసైనదాన్ని నన్ను ఏ పంజాబీ డ్రెస్సో వేసుకో మంటారు. ఊళ్ళోకి ఏ తెలుగు సినిమా నూటి కొకనాడు వచ్చినా, ఆంధ్రా ఎసోసియేషన్ వాళ్ళు ఏ నాటకం వేసినా దానికి నన్ను తీసికెళ్ళి అది నాకు చూపించే దాకా ఆయనకి తోచదు. ఇక నా జబ్బు కుదర్చడానికి ఎన్ని రకాల స్పెషలిస్టులకి చూపిస్తున్నారో ఎన్ని వేలు ఖర్చు పెడుతున్నారో దానికి లెఖ్ఖా జమా లేదు. కల్పతరువుక్రింద నున్న గచ్చపొదని నేను. అదృష్టవంతురాలోన్నా దురదృష్టవంతురాలోన్నా అది మాత్రం పోల్చుకోలేకుండా ఉన్నాను వేణూ !'

'అదేమిటి శకుంతలత్తా, ఇందులో దురదృష్ట మేముందీ ?'

'మే మిద్దరం అలా షికారుకి పక్క-పక్కని నడుస్తూ వెడుతున్నప్పుడు మమ్మల్నిద్దర్నీ పోల్చి చూసి జనం ఎంతలా విరగబడి నవ్వుతారో నేను ఊహించగలను. కాని ఏ మాత్రం చెక్కు చెదరకుండా ఎప్పట్లా నా కళ్ళల్లోకి ఆయన తియ్యగా ఎలా చూడగలుగుతున్నారో




"ఒక కోటి మైసూర్‌పాక్ కావాలా! టీ పార్టీ చేస్తున్నారా?"
"అబ్బే! — ఇటుక అమ్మే వెలకు మీ స్వీట్సుతోనే ఇల్లు కట్టేద్దా మనుకుంటున్నా!"

అదే నాకు అర్థం కాదు. నాకు వేరే అద్దం అక్కర్లేదు. పక్కనున్న దివ్యమంగళ స్వరూపాన్ని ఒక్కసారు చూచు కుంటేనే నా తక్కువతనం నాకు అర్థ మౌతుంది. అది నా చేతుల్లో లేదని తెలుసు. కాని విచారించకుండా ఉండ లేను. ఏ విధంగానూ ఆయనకి తగిన దాన్ని కాను. అంతకన్న దురదృష్ట మేముంది!'

మొదట్నుంచీ నేనంటే శకుంతలత్తకి చనువూ అభిమానమూ. అందుకే ననుకుం టాను మరికొన్ని విషయాలు చెప్పింది.

'ఇంట్లో సౌందర్య సంశోభితలూ, సర్వాంగ సంపూర్ణలూ అయిన భార్యలని ఉంచుకుని పరదారల పరదాలను తొలగిం చడమే పరమావధిగా భావించే సరదా పురుషులు ఉన్న లోకంలో రోగిష్టిదాని తోనే సంతుష్టిపడి పరాయి పిల్లను చెల్లా యిగా చూసుకునే మీ మామయ్యలాంటి వాళ్ళు ఎంతమంది ఉంటారంటావు వేణూ!'

నేను వింటూ కూచున్నాను. జవాబు చెప్పలేదు. చెప్పలేనుకూడా. ఒకమనిషి కేరెక్టరు సరి అయినదా కాదా అనేది ప్రపంచంలో అన్నిటికన్న కష్టమైన ప్రశ్న. అందులో ఎట్టని చుక్కా, ఎట్టిగా బుట్టిగా ఉన్న చక్కని చుక్కా లేవిదే నిద్రపోలే రని ప్రసిద్ధి చెందిన ఐశ్వర్య

వంతుల కుటుంబంలో పుట్టి పెరుగుతున్న పెళ్ళితప్ప మరొక విషయం మాటాడని మా పెద్దమామయ్యమడిగట్టుకు కూచున్నాడంటే ఎవరు నమ్ముతారు? నమ్మక పోవానికి అలా చెబుతున్నది మరొకరూ మరొకరూ కాదు. కట్టుకున్న ఇల్లాలు ఆమెను. నమ్మక ఏంజేస్తారు? అయినా ఇప్పటికికూడా మన సాంఘిక వ్యవస్థలో పురుషుల వ్యభిచారం చెప్పుకోదగ్గ అపచారం కాదే! ఏమయితేనేం దానికి జవాబు ఆరాత్రే నా కళ్ళబడడం అదొక చిత్రమైన విషయం.

అవాళరాత్రి పదకొండు అయివుంటుంది 'రెక్కాడితే గాని డొక్కాడదు' అన్న పేదవాళ్ళ సామెత అయితే 'ఫేను రెక్కాడితే గాని ప్రాణం నిలబడదు' అన్నది గొప్పవాళ్ళ సామెతేమో! ఫేన అది తిరుగుతూనే ఉంది. నా బుర్రలో వీళ్ళ సంసారం గురించి అంతుపట్టని ఆలోచన అలా గిరగిరా తిరుగుతూ నిద్ర పట్టనిచ్చింది కాదు కింద ఏవో కిలకిలా నవ్వులు వినిపించి కిటికీ తలుపు ఓరగా తీసి కిందికి చూశాను. ఆ దృశ్యం చూసి అలా నిర్ఘాంత పోయాను. నైట్‌క్వీన్ పొదపక్కని ఆ వెన్నెల వెలుగులో మా మామయ్యా మరొక మందగమనా స్పష్టంగా కనిపిస్తున్నారు. ఎఱ్ఱనిబోర్డరు గల పసుపుపచ్చ గళ్ళ చీర కట్టుకుంది ఆమె. అదేరంగు స్లీవ్‌లెస్ జాకెట్టు బలంగా పొడుగ్గా సన్నగా ఉన్న ఆమె మామయ్యను దిగబెట్టడానికి వచ్చినట్టుంది. వాళ్ళిద్దరూ అతి నెమ్మదిగా మాటాడుకున్నా రాత్రివేళ కావడంచేత స్పష్టంగా వినిపిస్తోంది. కాని అదేం భాషో నాకు ఒక్కముక్క అర్థంకాలేదు. కళ్ళతో చూసి తెలుసుకో గలిగింది. అంతకన్న నాకు తెలియవలసింది లేమ వెళ్ళేముందు. ఆమెను మరోమారు అటూ ఇటూ చూసి గాఢంగా కావలించుకుని గట్టిగా ముద్దెట్టుకుంటుంటే మా మామయ్య — నేనే చూడలేక తలుపు మూసెయ్యబోయి అప్రయత్నంగా ఎదుటిగది కిటికీలోకి చూశాను. ఆ కిటికీలో మా శకుంతలత్త ఆకారం స్పష్టంగా కనిపించింది. అయితే ఆ తరువాత నడిచిన కథ అంతకన్న చిత్రమైనది.

పెద్దచప్పుడు చేసుకుంటూ మామయ్య మేడమీదకు వచ్చాడు. వాళ్ళ గదిలో మాటలు స్పష్టంగానే వినిపించెయి.

'వేణుగోపాల్‌గాడు, పడుకున్నట్టున్నాడు కదూ?'

'ఊఁ'

"నువ్వేం శకూ ఇంకా మేలుకుని ఉన్నావ్?"

"లేదండీ. ఎప్పుడో నిద్రపట్టేసింది. మీ జోళ్ళచప్పుడు విని మెలకువ వచ్చేసింది. ఆ బట్టలు త్వరగా మార్చేసుకోండి. భోజనం చేద్దురుగాని. అలా ఫేన్‌కింద కూచోండి. వడ్డిస్తాను."

"ఇంట్లో వంటమనిషి ఉన్నా, ఓపిక

లేకపోయినా నీ చేత్తో పెట్టుకుంటేగాని నీకు తోచదుగదా శకూ! నేనంటే నీకింత అభిమానానికి నీకు నే నేంచేశాను?"

శకుంతలత్త ఏమందో నాకు సరిగా వినబడలేదు.

'పిల్లలందరూ పడుకున్నట్టేనా?'

'ఏం?'

'ఏంలేదు. ఎన్నాళ్ళకో గాని మళ్ళీ యిలాంటి వెన్నెలరాదు. ఇలా డాబా మీదకు వచ్చి నా ఒళ్ళో పడుకుందుగాని. నీ కిష్టమని మొల్లలు తెచ్చాను. అవి గుచ్చుకుని తలనిండా పెట్టుకుందువుగాని. రసగుల్లాలు కూడా తెచ్చాను. నేను తిని పిస్తూంటే అవి ఒకటీ ఒకటీ తింటూ ఆ చందమామని చూస్తూ నీ బాధలన్నీ కొన్ని క్షణా లయినా మరచిపోదువు గాని...దా...నా ఒళ్ళోకి రా!'

మంత్రముగ్ధలా శకుంతలత్త వస్తోంది,

'ఎన్నిసార్లు చెప్పినా నీ మీద నీకు శ్రద్ధలేదు – ఆ తలకు రంగు వేసుకోవు. పెట్టెలో మూలుగుతున్న ఆ ప్రింటెడు జార్జెట్టు కట్టుకోవు. నేను ఉద్యోగరీత్యా అనేకమందిని చూస్తాను. 'చక్కనమ్మ చిక్కినా అందమే' అని ఏ పరిస్థితిలో ఉన్నా ఎంత బాగున్నావు నువ్వు! 'చక్కనివారి నెల్ల ఎకసక్కెము లాడెడు చిన్నదాన...' మా మామయ్య ప్రేమోత్పలమాల కొటోలు అందుకున్నాడు. నే నిక చూడలేక తలుపువేసేసుకున్నాను.



ఇన్ని జరిగినా ఏమీ ఎరగనటు యిక మా శకుంతలత్త మర్నాడు అంటుందీ. 'నేను ఒరుగులా ఉన్నా ఆయన పిడుగులా

ఉన్నా మా మామయ్య ఒక్కసారైనా తప్పటడుగు వెయ్యడు. అదే ఆయనలో గొప్పదనం. ఎందరున్నా నేనే కావాలి ఆయనకి! ఎప్పటికైనా నన్నే వెతుక్కు వస్తారు ఆయన ' అన్నీ తెలిసి వీళ్ళిద్దరూ ఇంతలా లోకాన్ని మోసబుచ్చడం దేనికి? నా కింక అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. ఎంత బలవంతపెట్టినా యింకి ఆ యింట్లో ఉండలేకపోయాను. అప్పటి కప్పుడు ప్రయాణం కట్టి స్టేషనుకి వచ్చేశాను. నేను వస్తుంటున్నా వినక నన్ను దిగబెట్టడానికి వాళ్ళ పెద్దబ్బాయి పదమూడేళ్ళ భాస్కరం స్టేషనుకి వచ్చాడు.

ఈ కుర్రాడి సంగతి ఇదివరకు నే నెరగనిదికాదు. కాని ఆనాటి భాస్కరం ప్రవర్తన నాలోని మాలిన్యా న్నంతటినీ నిమిషాలమీద ఎగరగొట్టేసింది. క్యూలో నిలబడి తనే టిక్కెట్టు తీశాడు. ఎక్కడో నాలుగు ప్లాట్‌ఫారాల అవతల బుక్ స్టాలు ఉంటే అరమైలుదూరం నడిచివెళ్ళి నాకోసం పేపరు తీసుకువచ్చి యిచ్చాడు. మావైపు దొరకవని ఆకుపచ్చని అరటి పళ్ళు ఓ డజను కొని తెచ్చిపెట్టేడు. నన్ను ఒక్కముక్క అడక్కుండా నాకు కావలసిన వన్నీ అమర్చిపెట్టేడు. రైలు కదిలింది. రాష్ట్రాలకి రాష్ట్రాలే గడచిపోతున్నాయి. చక్కని బట్టలు చెక్కుచెదరని క్రాపింగుతో అభిమానం ఆప్యాయతా సూచించే కళ్ళతో టాటా చెబుతున్న భాస్కరంగాడు నా స్మృతి పథంలోంచి చెరిగిపోలేదు. వీడేకాదు, పిల్లలంతా నేనక్కడున్న నాలుగు రోజులూ నన్ను గడియ వదల్లేదు. మళ్ళీ ఒస్తానని ఒట్టు వేయించుకోనివాళ్ళు వాళ్ళలో ఒక్కరూ లేరు. ఇంతలా మనుషులకోసం ప్రాకులాడడం, ఒళ్ళు పులకరించే ఆదరాభిమానాల కోసం దేవుళ్ళాడ్డం వీళ్ళకు ఎవరునేర్పారు? మంచి ఎండవేళ ఎయిర్ కండిషన్ రూంలో కూచుని ఐస్‌క్రీమ్ తినే టప్పుడు కలిగే అనుభవం వీళ్ళింట్లో ఎందుకు కలుగుతోంది?

అందుకనే నేను వచ్చేముందు మామయ్యని పక్కగదిలోకి తీసుకెళ్ళి రాత్రి నేను చూసిన దృశ్యం గురించి అడక్కపోలేదు. ఏ మాత్రం తొట్రుపడకపోగా మరింత ప్రశాంతంగా నవ్వి 'ఓరి రాస్కెల్! నీకంట ఎక్కడ పడిందిరా అది! ఉండు ఆ గుజరాతి గుంటకి దిష్టి తీయించే ఏర్పాట్లు చేయిస్తాను' అన్నాడు. అంతేకాదు. 'కాశ్మీరు కన్యల కనుగీటివచ్చితి, బీహారు యువతుల ప్రేమగొంటి...' అనే సీసం అందుకున్నాడు. అదే కాదట. ప్రేమకు పర్వతాలూ సముద్రాలూ అడ్డు రావుట. తీయని జాతీయ ప్రేమేగాక అందమైన అంతర్జాతీయ ప్రేమ స్థాపించిన పతిత పావనుడు మా మామయ్య...నేను

రెండు చెవులూ మూసేసుకుని ఇవతలి గదిలోకి వచ్చేశాను.

ఇంతటి చంచల చిత్తానికీ— ఆ యింట్లో అంతటి చిత్తశాంతికీ ఎలా సమన్వయం!

నేను ఇంటర్వ్యూకి వెళ్ళడం, నన్ను అక్కడ అడిగిన ప్రశ్నలూ అన్నీ మరచి పోయాను. ఆ రైలులో ఉన్నంత సేపూ నాకు మా మురళీధరం మామయ్య ఊసు తప్ప మరొకటి పట్టనేలేదు. నా ప్రశ్న ఒకటే ఒకటి. నీతికి కట్టుబడి ఉన్న చాలా కుటుంబాల్లో ఒకళ్ళని ఒకరు చెప్పుకోవడం, నొప్పించే మాటలు అను కోవడం అస్తమానూ దేనికో దానికి కీచులాడుకోవడం యివే నేను చూస్తు న్నాను. దానికి వ్యతిరేకమైన మా మామయ్యగారి కుటుంబంలో అంతటి ఆనందం ఎలా నెలకొంది? కృత్రిమత్వం లోంచి సహజత్వం రావడం ఎక్కడేనా ఉంటుందా? చెడిపోవడం చాతకాని వాళ్ళు సుఖపడనేలేరా?

కాదు. ఆ ప్రశ్నకు జవాబు అదికాదు. ఒకరి వ్యక్తిగత జీవితాలు ఆరా తియ్య డానికి గాని విమర్శించడానికి గాని మన కెవరూ అధికారం ఇవ్వలేదు. జీవితం లాగే మనుషుల్ని యధాతధంగా స్వీక రించి ఆనందిస్తేనే సుఖం ఎక్కువ. ఒక కవి రాసిన చక్కని భావగీతం మనం చదివి ఆనందిస్తున్నప్పుడు అతడు యింటి దగ్గర తాగుతాడో తందనాలే ఆడతాడో మనకి అనవసరం. కాని అనవసర విషయాల్లో ఆసక్తి చూపించడమే మనుషులకి పట్టిన మహమ్మారి. అందు కనే ఆ కుటుంబం గురించి నాకు తోచిన రీతిలో మనసుకి జవాబు చెప్పుకుంటే గాని నేను ఉండలేను.

అటో యిద్దర్నీ యిటో యిద్దర్నీ జటపటాలు వేసుకున్నా మా మామయ్య మా అతని ఒక క్షణమైనా మరిచిపోడు. అలా భర్త కంట పడినా తనని పూర్తిగా పోల్చుకున్న మా శకుంతలత్త స్త్రీ జాతికి విరుద్ధంగా పూర్తిగా మామయ్యను క్షమించగలదు. ఏమయినా మొగుణ్ణి వీధిలో పెడితే తన సంతానానికే నష్టం అని ఆమెకు స్పష్టంగా తెలుసు. అందుకే ఆ పిల్లలు అన్ని విధాలా అంత ఆరోగ్యంగా పెరుగుతున్నారు. మొత్తం మీద వాళ్ళందరికీ ఒకళ్ళకి ఏదయినా యివ్వడంలో ఎంత ఆనందం లభిస్తుందో తెలుసు. అందుకే తప్పు చేసినా మా మామయ్యని ద్వేషించడం అంత సుళువుకాదు



# సినిమా క్విజ్







( ౭ బొమ్మలూ 2 సినిమా పేర్లు తెలియజేస్తవి .. ఏమి టవి? (జవాబులు 55 వ పేజీకా



"నీ భార్యా మహా పతివ్రత అనుకుంటున్నావు గామోలు. నీ మొహం ఎరక్క మునుపు అది నా దగ్గిరికి ముప్ఫైమూడుసార్లు వచ్చింది. కాదనమను."

సంతకం లేదు.

అతను సావధానంగా ఉత్తరం చించేసి దీర్ఘాలోచనలో పడ్డాడు.

ఇది ఎవరికీ జరగరాని అనుభవం. మామూలు మనిషి దీనికి తట్టుకో లేడు. పిచ్చివాడై పోతాడు. తను పిచ్చివాడై పోరాదు.

ఆ ఉత్తరంలో ఉన్న విషయం నిజమే అయి ఉండవచ్చు. నిజమని నమ్మి కర్తవ్యం ఆలోచించాలి.

అది రాసినవాడు తనమీది ప్రేమచేత రాయలేదు. తన భార్యమీదా తనమీదా కూడా పగతీర్చుకోనే ఉండుకు రాశాడు. అంతవరకూ తనూ తన భార్యా ఒకే పక్షం.

తను తన భార్యను చాలా గాఢంగా ప్రేమించాడు.

తను ఎరిగినంతలో ఏ భర్తా భార్యకివ్వనంత స్వేచ్ఛ ఇచ్చాడు.

అది దుర్వినియోగపరిచి ఆమె తన్నెప్పుడూ చులకనగా చూడలేదు.

కొడవటిగంటి కుటుంబరావు

ఆమె తనను ప్రేమించింది. ప్రేమించని మనిషి తనకేసి అట్లా చూడలేదు. సంవత్సరంనించీ కాపరం చేస్తున్నా తమ ప్రణయం మెరుపు మాయలేదు. తనమీద ప్రేమ లేకపోతే తను కనిపించగానే పువ్వు వికసించినట్లు ఎట్లా వికసిస్తుంది? తనని చూసుకుని అంత ఎందుకు గర్విస్తుంది?

తనూ అదివరకు—పెళ్ళి కాక పూర్వం—తనకన్న నాలుగేళ్లు పెద్దదైన ఆడదాన్ని ఎరుగును. తను ప్రణయానుభవం పొందిఉండటం లాభించింది.

తన భార్యకూ్కడా అంతేనేమో!

ఈ విషయం తన భార్యతో చర్చించాలా, వద్దా?

తను ఏ చర్యా తీసుకోకపోతే ఆ ఉత్తరం రాసినవా డూరుకుంటాడా?

కులట అని దేశమంతా చాటుతాడు! కులటను పెట్టుకుని కాపురం చేస్తున్న అపఖ్యాతి భరించటం తనకు అసంభవం.

ఇటువంటి భార్య మరొకతె తనకు దొరకదు.

ఆ ఉత్తరం రాసినవాడి ఓర్వలేనితనానికి తను అనుభవించే శిక్ష—తను ఈ భార్యను పోగొట్టుకోవటం.

అత నింటికి రాగానే తల దువ్వుకుంటున్న భార్య చేతులో, జడ విడిచేసి అతని కెదురొచ్చి గట్టిగా వాటేసుకుని మొహం పైకెత్తింది.

కొంచెం అనుమానించి అత నామెను ముద్దుపెట్టుకున్నాడు. ముద్దు రుచించలేదు. ఇక ఎప్పటికీ ఇంతేనేమో!

"అట్లా ఉన్నారేమండీ?" అన్నది అతని చొక్కా పట్టుకుని పసిపిల్లల్లే లోపలికి నడుస్తూ.

గదిలో పందిరిపట్టెమంచం చూడగానే అతను నిలువునా నీరైపోయినాడు.

తనకేసి వింతగా చూస్తున్న భార్యను గాఢంగా — ధృతరాష్ట్రుడు ఇనపభీముణ్ణి వాటేసుకున్నట్టు - వాటేసుకున్నాడు. ఆమెను పసిపిల్లను ఎత్తినట్టు రెండు చేతుల్లోనూ ఎత్తి మంచం మీద పడేసి తన మొహం ఆమె వక్షానికి గట్టిగా అదుముకున్నాడు....

ఆ ఉద్రేకపు ఉప్పెన తీరిపోగానే అతను మరోమనిషి అయినట్టయింది.

"రాత్రి బండికి మీవాళ్ళింటికి పంపేస్తున్నాను! త్వరగా వంట చెయ్యి" అన్నా డతను.

ఆమె తనకేసి చూస్తున్నదని అత నెరుగును. కాని ఆమెకేసి చూడలేకపోయినాడు.

ఆమె తనని ఎందుకనిగాని ఏమిటనిగాని అడగలేదు.

ఏమైనా సంశయం ఉంటే రూఢి అయిపోయింది.

"బండికి వే ళౌతున్నది!" అన్నా డతను మరి కొంత సేపటికి.

"ఇవాళ వద్దు. రేపు వెళతాను. తప్పక వెళతాను" అన్న దామె దీనంగా.

"నీ యిష్టం! మరో వాయిదా మాత్రం వెయ్యకు!"

తను ఫోం చేసి పడుకున్నాడు. ఆమె ఫోంచేసి వచ్చింది. కళ్ళు మూసు కుని నిద్రపోతున్నట్టు నటించాడు. ఆమె వచ్చి తేలికగా తన పక్కమీద కూర్చున్నది.

గంట గడిచింది. ఆమె ఇంకా కూర్చునే ఉంది. ఏంచేస్తున్నది? తన కేసి చూస్తున్నదా? ఏం చూస్తోంది? తను మేలుకున్నట్టు తెలిసి ఇదో ఎత్తు వేస్తున్నదా? కళ్ళు తెరిచాడు.

ఆమె చప్పున మంచం మీదినుంచి లేచింది.

"ఏమిటి?" అన్నాడు.

ఆమెమళ్ళీ అతనిపక్కనే కూర్చుని. "నన్నొక సారి కావిలించుకోండి. ఇందాకట్లే" అన్నది.

అతని చేతుల్లో బలమే ఉన్నట్టు లేదు.

అతనికి మూడింతలు బలంతో ఆమె అతన్ని కావలించుకున్నది.

"ఒక్క ముద్దు పెట్టండి?"

ఆమె నోరు సన్నిపాతరోగి శరీర మల్లే కాలిపోతున్నది.

ఆమె భర్తను విడిచి ఎడంగా పోతూ, "లాభం లేదు. బతికున్నన్నాళ్ళూ చెయ్యాలిసిన పని ఒక్క క్షణంలో చెయ్యటం అసంభవం" అన్నది.

అతని కర్థం కాలేదు.

ఇదంతా తనని మస్కా వెయ్యటం! అమ్మో, ఆడదాని ఎత్తు!

పన్నెండు గంటలవేళ అతనికి కలత నిద్ర పట్టింది. ఆమె మళ్ళీ అతని కేసి చూడలేదు.

అతనికి తిరిగి మెలుకు వచ్చేటప్ప టికి ఎక్కడో కోడి కూస్తున్నది.

ఆమె పక్కమీద లేదు.

ఆమెకోసం గంటసేపు చూశాడు. రాలేదు.

అతనికి మళ్ళా నిద్ర పట్టింది.

మర్నా డుదయం బావిలో ఆమె శవం కనిపించింది.

---

## సినిమాక్విజ్ - జవాబులు

*1. మురళీకృష్ణ*

*2. పూజాఫలం*



మంచివాడు — అతిచెడ్డ వాళ్ళందర్లాగానే — పుట్టగానే ఏడ్చేడు. చిన్నప్పుడు అమ్మ కేకలేస్తే ఏడ్చేడు. పక్కింటి పిల్లడు కొడితే ఏడ్చేడు. దెబ్బ తగిలే, నొప్పిపుడితే "అమ్మా! హమ్మా!" అంటూ ఏడ్చేడు.

చెడ్డవాళ్ళు దొంగఏడుపులుకూడా ఏడ్చేరు. మంచివాడు అలా చెయ్యలేక, కొంతగా "చిన్నప్పుడే చెడిపోయేడు వెధవ!"

బళ్ళో చేరగానే మంచివాడి పలక విరగ్గొట్టేరు, అతనికి బూతుపేరు పెట్టారు, అతని పాతచొక్కాని చింపేరు, కొత్త చొక్కామీద కరక్కాయసిరా ఒలకబోసేరు. కొన్నాళ్ళయాక ఆటల్లో అతన్ని డొక్కలో తన్నేరు. పక్కలు పొడిచేరు, మండీకొట్టి మడమసీలమీద తన్ని, అతనికాళ్ళు విరగ్గొట్టబోయేరు. మంచి ఆటల టీములోకి అతన్ని రానుండా చేసేరు. పెద్దయాక అతను తెచ్చుకున్న టెక్స్టుబుక్కులు అరువు తీసుకుపోయేరు, అతను రాసుకున్న నోట్సు ఎత్తుకుపోయేరు, అతను చదువుకునే సమయంలో డిస్టర్బ్ చేసేరు, అతను పడుకున్నప్పుడు వాళ్ళంతా చదువుకున్నారు, ఆఖర్న, పరీక్షలో అతను రాసిన జవాబులన్నీ కాపీలు కొట్టేరు.

మంచివాడు పరీక్షలు పాసయేక, మంచి ఉద్యోగానికి అర్జీపెట్టి వెళ్తే అధికార్లు అతణ్ని ఎగాదిగా చూసేరు. అని

గోల్కొండ రాంప్రసాద్



ప్రశ్నలూ వేసేరు, కొంతసేపు ఆలోచించేరు, నీకు పర్సనాలిటీ లేదు పొమ్మన్నారు.

మంచివాడు తిరిగీ తిరిగీ ఒక చిన్న నౌకరీలో కుదుర్సుకొంటే, అతణ్ణి ఆఫీసరొకసారి మెచ్చుకున్నాడన్చెప్పి హెడ్ గుమాస్తా కసురుకున్నాడు, పని పెట్టుకొని మంచివాడిచేత అరవచాకిరీ చేయించుకున్నాడు.

ఆఫీసులో పెద్దలూ పిన్నలూ అంతా కలిసి, మంచివాణ్ణి, కనీసం చిల్లరచిల్లర లంచాలైనా తినమన్నారు; అతను తిననంటే, వెక్కిరించేరు, వెర్రిపీ రన్నారు, కథ గట్టేరు, తంటాలు తెచ్చేరు, అతణ్ణి ఊరూరా తిప్పేరు, ఏ సీటుకీ పనికిరాదన్నారు, ఎందుకూ కొరగానివాడన్నారు.

మంచివాడికి చాలా కాలం వరకూ పెళ్ళి కాలేదు.

"అంత మంచివాడికి పిల్లనిస్తారే అనుకోండి! కాని, వాడి దినవెచ్చం తీర్చుకో లేనివాడు దాని దినం ఎలా తీర్చగలడు?!"

అంటూ చాలామంది పెదవులు విరిచేసుకున్నారు,

చివరకొక మంచి ముహూర్తాన మంచివాడు ఓ అరమనిషి పైజాగల ఆడమనిషికి పుస్తెగట్టి ఆనందబాష్పాలు రాల్చేడు. ఆమె నతను ప్రేమించేడు, ఇవ్వగలిగినంత సుఖ మామెకి ఇచ్చేడు.

ఆవిడ కాపరాని కొచ్చేక, పక్కింటికి వెళ్ళి అక్కడి కోడలి నగలుచూసి కిలకిల్లాడి, ఇంటికొచ్చి విలవిల్లాడిపోయింది. ఎదటింటి అడబడుచు కోకలు చూసి మురిసిపోయి ఇంటికొచ్చి గింజుకుపోయింది. తనభర్త చవటపెద్ద మ్మనే నిశ్చయాని కొచ్చింది. టాపు తీసి కార్లో షికారూ, అద్దాలమేడల్లో కాపురాలూ, నిలువుటద్దాలముందు ముస్తాబులూ, దన్నప్పరుపులమీది సుఖాలూ తల్చుకొని ఆమె తహతహ లాడిపోయింది.

చివర కావిడ బక్లీసుల్తో బలిసిన ఆఫీసు బంట్రోతు కుర్రాడే తన పెనిమిటికంటె చలాకీగా ఉన్నాడనే నమ్మకానికి వచ్చింది. ఓ రోజున ఆవిడ ఓ స్టూడెంట్ కుర్రాడికి బట్టలిచ్చిన సొగసూ జోడిచ్చిన పొడవూ చూసి మురిసిపోయింది. ఆ తరవాత ఒక సాయబుగారి మెహర్బానీ చూసి మోజుపడింది. ఒక పొయట్ గారి కాళ్ళు కనుబొమ్మలూ చూసి మోహపడి భ్రాంతిపడింది. చివర కొక – షావుకారి గారి డబ్బు చూసి మోహపడిపోయింది.

మంచివాడికి అన్ని రహస్యాలూ తెలిసివచ్చిన తరువాత, అందుగురించి ఏం చెయ్యాలో తెలియక, మనసు కమిలిపోగా కుమిలి కుమిలి ఏడ్చి, చీకట్లో దేవుణ్ణి ప్రార్థించి ప్రార్థించి, నొప్పితో కనురెప్పలు మూసుకుపోగా ఎలాగైతేనేం నిద్రపోయేడు.

అప్పు డా మంచివాడికి భగవంతుడు, కలలో, దివ్యసుందర విగ్రహంతో కనిపించి, నాలుగు చేతుల్తోనూ ఆ మంచివాణ్ని మృదువుగా నిమిరి, కరుణాకటాక్ష వీక్షణాన్ని అతనిపై కురిపించి, మృదుమధురహాస్యంతో అతణ్ని ముద్దుగా మురిపించి, "ఈ తరవాత రాబోయే నీ ఆరువందల రెండో జన్మలో నీకు మేలు కలుగుతుంది. అందాకా కాస్త ఓపికపట్టు నాయనా!" అని చెప్పి అతని కలలోంచి నిద్రలోంచి జారుకున్నాడు.

అప్పుడు మంచివాడు నిద్రలో నిట్టూర్చిన నిట్టూర్పు ఆ జారుకున్న దేవుణ్ని వెతకడానికి వెళ్ళి దారి కనిపించక గాల్లో కసిలిపోయింది.

మర్నాడు మంచివాడు బాధని దిగమింగుకొని దాన్ని అరిగించుకోలేక పైకి కక్కలేక, మెల్లిగా నడుచుకొంటూ ఆఫీసుకి వెళ్తే ఆఫీసు డిప్యూటీ అతన్ని గంటసేపు తిట్టేడు. గంటపైని నాలుగో నిమిషందాకా తిట్లు తిన్నాక మంచివాడికి అలకొచ్చిమంచికోపం(మంచివాడికోపం) వచ్చింది. దాన్తో ఆఫీసులో అంతా అతన్ని "తిరుగుబోతు"వన్నారు. ఛార్జీలు ఫ్రేం





చేసేరు. ఎంక్వయిరీ జరిపించేరు. వార్నిం గిచ్చేరు.

అలాగ నాలుగైదు ఎంక్వయిరీలు జరిపించేక మంచివాణ్ని ఉద్యోగంలోంచి డిస్మిస్ చేసేరు.

మంచివాడి స్నేహితులు "నీ కోపమే నీ కొంప ముంచిం" దన్నారు. విరోధస్తులు "పొగరుబోతు వెధవకి ప్రాయశ్చిత్తం జరిగిం"దన్నారు. చాలామంది 'అతనికిశౌర్యం లా'వన్నారు.చుట్టా లంతా అతణ్ని "నీ బతు కేదో నువ్వు బతుకు, బతకలేకపోతే నీ ఇష్టం ఒచ్చింది చేసుకో ! కాని, మమ్మల్ని మాత్రం — నీకు పుణ్యంఉంటుంది—చంపః"క న్నారు.

అతనిభార్య అతణ్ని షావుకారిగారి కొట్లో గుమాస్తాగా చేరి తుక్కలాపడుండమంది.

మంచివాడు నీచానికి దిగలే నన్నాడు. చెడ్డపని చెయ్యలే నన్నాడు.

"ను వ్వెందుకూ పనికిరావు. మరి ఎలా? ఏ యేట్లోపడిచస్తావో చావు!'' అని అంతా అతనికి ఉచితంగా సలహా ఇచ్చేరు.

మంచివాడు పళ్ళు కొరికేడు. జుట్టు పీక్కున్నాడు. కడుపు మాడగా, కళ్ళు మండగా, కాళ్ళు పీకగా, గాలి పీలుస్తూ, నీరు తాగుతూ, ఎండ తింటూ, ఊరంతా తిరిగి తిరిగి అంధకారంలో మునిగేడు.

ఊరవతల అర్ధరాత్రి చీకట్లో కొండ వార బండరాతిమీద కూర్చొని మంచి

వాడు, "నే నేం చెయ్యడం???" అంటూ గావుకేకలు వేసి దేవుణ్ని ప్రశ్నించేడు. దేవుడు పలకలేదు. బండరాయి పక్క కొండమాత్రం "డం???" "డం???" అంటూ ప్రతిధ్వనించింది. అది విని విని మంచివాడు పెర్రిగా నవ్వేడు.

ఆఖరికి అక్కణ్నించి లేచి చీకట్లోంచి, కాట్లోంచి, రోడ్డుమీంచి ఊళ్లోకి వచ్చి అందర్నీ సలహా అడిగేడు. కొంతమంది నవ్వేరు, కొంతమంది నిట్టూర్చేరు.

మరో నౌఖరీ చూసుకోకూడదా?

దొరకదు దొరకదు నీ ఫోటో పొమ్మనీ అంతా గెంటేశారు. షాహుకారుకూడా "ఉంపుడుగత్తె పక్కలో ఉండే పక్కనే మొగు డెందుకు?'' అనుకున్నాడు. అంతాకూడా, తిక్కవెధవలూ తిరుగుబోతు వెధవలూ చాకచక్యం లేని వెధవలూ మా కక్కర్లేదు పొమ్మన్నారు.

కిల్లీకొట్టు పెడితేనో?

పెట్టలేవు. పెట్టినా నడపలేవు. నీకు కిల్లీలు చుట్టడంఅయినా రాదు. వచ్చినా నీ పాపంతా అరువుగాళ్ళు తినేస్తారు.

కిరాణాకొట్టు ఓపెన్ చేస్తేనో?

నీకు మదుపులేదు, చురుకులేదు. తప్పు తూనికె లూలేవు. దొంగసరుకు అమ్మలేవు, చిల్లర ఆఫీసర్లకి లంచా లివ్వలేవు, తీగవాళ్ళకి అరు వివ్వకుండా ఉండలేవు, లాభా ల్తియ్యలేవు.

మ రేదైనా వ్యాపారం?

నువ్వే వ్యాపారానికీ పనికిరావు. మదు పుండాలి, మా యుండాలి, రెండూ లేవు నీదగ్గర.

రిక్షా లాగితేనో?

లాగలేవు. లాగినా రెండేళ్ళల్లో గుండె ఆగి చస్తావు.

వ్యవసాయం?

భూం వెవ డిస్తాడు?!

చాకలిపని? బారికపని?

నువ్వాఖరికి మంగలి పనిక్కూడా పనికిరావు. బుర్ర గొరగడం కూడా ఆనెస్ట్‌గా గొరుగుతా నంటావు. బుర్ర దగ్గిర నయాపైస కిట్టదు అలాగైతే. అయినా, మాయగాళ్ళు లక్షమం దుండగా నీ చేత ఎవడు గీయించుకుంటాడు బుర్ర?! నీకు ఆ ఛాన్సేలేదు.

మరైతే నే నెందుకు పనికొస్తాను?

నువ్వెందుకూ పనికిరావు, దొరపని (అంటే దొంగపనే అనుకో) ఆ పనికీ పనికిరావు. అసలైన దొంగపనికి అసలే పనికిరావు —

అన్నా రంతాను.

సాయంకాలం ఏడయింది.

మంచివాడికి ఏడుపొచ్చింది.

"మరైతే నేను చావడానికితప్ప మరి ఎందుకూ పనికిరానా?!" అంటూ అతను సముద్రంవైపు పరిగెట్టేడు. అక్కడ వడ్డున నిశ్చేష్టుడయి నిలబడిపోయేడు.

చీకట్లో సముద్రపు కెరటాలు "నువ్వు చావుకి" అంటూ పైకి లేచి, "ఫ్వనిక్రావ్" అంటూ గభీమని విరిగి "నువ్వు చావనూకూడా లేవుస్మా!'' అనే అర్థంతో మాటల్ని విరిచి విరిచి ఆతనికి నువ్వ






ష్టంగా తెలిసేట్టుగా అరిచిఅరిచి చెప్పేయి.

రాత్రంతాచీకటిగాబాధలపుట్టలాఉంది.

రాత్రంతా చీకటిగా రాక్షసబొగ్గుల గనిలా ఉంది. తెల్లవారింది.

నిప్పుబివ్వలా ఇనుడు ఉదయించేడు. నీళ్ళల్లోంచి నిప్పుల చక్రంలా బైటికి పూర్తిగా లేచేడు.

సముద్రానికీ కొండకీ మధ్య ఇసకలో నిల్చొనే ఉన్నాడు మంచివాడు.

చీకటంతా బెదిరి చెదిరిపోయింది. ఆకాశంలో మబ్బులు తూలి తూలి పోయేయి. తెలి వొచ్చిన చల్లగాలి వీచి వీచి పోతోంది. సముద్రపు కెరటాల తురాయి లన్నీ రంగురంగుల రంగుల్తో పైకి పైకి లేచేయి.

అంతలో భూమి అదిరింది. ఎక్కణ్ణించో కోటిగొంతుల పాట వినిపించింది.

చప్పుడు విని తిరిగిచూసేడు మంచివాడు.

వాళ్ళ ముఖా లన్నీ ఉదయకిరణాల్లో వింతశోభతో మెరుస్తున్నాయి. ముందుకి సాగే సేనల ఎగిరే జెండాల్లా ఉన్నారు వాళ్ళు. వాళ్ళ భుజాలమీద మాత్రం బరువైన బండరాళ్ళు తీరిగ్గా అమిరున్నాయి.

వాళ్ళంతా దేవుడి దండులా ఉన్నారు.

''ఎవరు మీరు? ఎక్కడికి వెళ్తున్నారు?''అని ప్రశ్నించేడు మంచివాడు.

''మమ్మల్ని 'రాయిమడుసు' లంటారు. మేం మంచిలోకాన్ని నిర్మించడానికి వెళ్తున్నాం'' అన్నారు వాళ్ళు

మంచివాడి కళ్ళంట ముత్యాల బిందువులు రాలేయి. అతను అతి నిర్మలంగా నవ్వేడు. వెంటనే జీవితం అనే బండరాయి తీసి భుజాన వేసుకొని పాటతో పాటు అతను అటువైపు నడిచాడు.

# పరిత్యక్త



"శ్రీ సీతారామాభ్యాన్నమః, అయవార బ్రాహ్మణీ, తల్లీ "

ఆ కేక విన్న శశిరేఖ విసుక్కుంది ఇంకా తెల్లవారిందో లేదో అప్పుడే రకరకాల మష్టివాళ్ళు !"

"భవతీ, భిక్షాం దేహీ."

'ఇక తప్పదు; అయినా వెయ్యగల యోగ్యత వుందికదా. లేకుంటే వాళ్ళు రానేరారు, అనుకుంటూ గుప్పెడు బియ్యంతో వీధి వసారాలోకి వెళ్ళింది.

"సౌభాగ్యవతీ భవా, దీర్ఘాయుష్మాన్ భవ, పుత్రపౌత్రాభి సిద్ధిరస్తు"...అని దీవిస్తూ "అమ్మా. కాయగూర లేమైనా వుంటే ఒక్క రెండు .' అని మరో చిన్న యాచన చేయబోయాడు కాని అతడి యాచన సగంలోనే ఆగిపోయింది కనుబొమలు ముడిపడ్డాయి

"అమ్మాయ్, నువ్వు విజయేశ్వరంలో వున్నావా యిదివరకెప్పుడైనా ?" అని అడిగాడు గుచ్చి గుచ్చి చూస్తూ. తలెత్తి చూసిన శశిరేఖ ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. బియ్యంలో సగమే ఆ యాచకుడిపాత్ర ప్రవేశించాయి, మిగిలినవి నేలపా లయ్యాయి.

"నువ్వు ఆదిశేషయ్య కూతురివి



కావూ? నేను శరభయ్యని, నన్నెరుగవ్?"
మరో పిడుగుల పరంపర.

నీరసంగా 'అవు'నన్నట్లు తలూపింది శశిరేఖ. మాటలు రావటంలేదు.

"అయితే ఇక్కడుంటున్నావా ?"

"అవును; అయితే మా వాళ్ళంతా బావున్నారా బాబుగారూ ?"

"అంతా బావున్నారు. అలో లక్ష్మణా అని ఏడుస్తూను; నువ్వు చేసిన పనికి." ఈసడింపుతో, కొండ్రించి థుపుక్కున వుమ్మేస్తూ వెళ్ళిపోయి ప్రక్కయింటిలో దూరాడు.

ఎలాగో లోపలికొచ్చిపడగలిగింది శశి.

"ఏం ? అలా వున్నావ్ ?"

ఎప్పటినుండి ఏడుస్తోందో శశి దైవ విగ్రహము ముందు పడి. నాగరాజు మాట్లాడటంతో తొట్రిపడ్తూ లేచి నిల్చుంది.

"ఏంలేదు," అంటూ అక్కడనుంచి పోబోయింది.

"చెప్పూ." దారి కడ్డంగా నిల్చున్నాడు.

"మావూరి బ్రాహ్మడొకడు కనిపించాడు;" అని చెప్తూన్న శశికి కన్నీళ్ళు ఆగలేదు.

కొంచంసేపు పరీక్షగా చూశాడు నాగరాజు. "వూఁ, అయితే మనరహస్యం అందరికీ చెప్పేస్తాడని భయపడ్తున్నావా ?"

శశి మాట్లాడలేదు.

"ఫర్వాలేదు లెద్దూ. తెలిస్తే మన్నేవశ్యేం చేయగలరు ? గుసగుసలాడ్తారు, నవ్వుతారు, లేక ఏడుస్తారు, అంతేగా?" తేలికగా తీసిపారేసి నూతివైపు నడిచాడు.

కాని సాయంత్రానికల్లా నాగరాజు తేలికగా వూహించి తీసిపారేసిన మూడు విషయాలే కాదు, ఇంకా అనేకం గ్రహించగలిగారు ఆ ఇరువురూ.

గుప్పెడు ముష్టికి వచ్చిన బ్రాహ్మడు గోరెడు నిప్పు రగిల్చి వూరు వూరంతా అంటించి పోయాడన్నమాట ! నాగరాజు సంగీతం చెప్పటానికి వెళ్ళే పదిపన్నెండిళ్ళ తలుపులూ అతడిని చూసి బంధించుకుపోయాయి.

"అమ్మాయికి ఈ వచ్చిన సంగీతం చాలెండి. సంసారపక్షాని కంత ఎక్కువ ఎందుకు ?''

"పెళ్ళి చెయ్యాలని చూస్తున్నాం. ఇక సంగీతం ఆపేద్దాం. మీకు రావలసిన జీతం ఇదుగో."

ఏదో విధంగా అందరూ సాగనంపేశారు. ఉదయం వెళ్ళి సాయంత్రానికిగాని తిరిగిరానివాడు వెళ్ళిన గంటలోనే తిరిగి వచ్చేశాడు. ఇన్ని ఇళ్ళదగ్గర డబ్బు మొత్తం డెభ్భై రూపాయలైంది. ఇంటిదగ్గర శశికికూడా అదే పరిస్థితి ఎదురైంది. తెల్లవారేసరికి యిరుగుపొరుగుల పిల్లలు వచ్చి శశితోనే కాలక్షేపం చేసేవారల్లా ఒక్కరుకూడా



యు ఎ



నాడు నీ గుండెలో పడగెత్తిన నాగఫణిని!

రాలేదు. ఏదో పనుండి, అలవాటు చొప్పున ప్రక్కింటి లక్ష్మిని గోడమీది నుంచి పిలిస్తే ఖాళీ లేదని చెప్పించింది పనిమనిషిచేత. శశి ఆవూరు వచ్చిన దగ్గర్నుంచీ రోజులో సగభాగం ఆ గోడ దగ్గరే గడిపేసేవారు లక్ష్మి శశీని. ఎవర్ని పిలిచినా ఎవరూ అటువంటి సమాధానం చెప్పలేదింతవరకూ. ఆశ్చర్య పోతూ బిందె తీసుకు కాలవకు బయల్దే రింది. పాలేళ్ళచేత నీళ్ళు తెప్పించుకో గల మోతుబరి కుటుంబాలస్త్రీలు మినహా వీధిలో మిగిలిన నాలుగుఇళ్ళ ఆడవాళ్ళు సరదాగా కలసి వెళ్ళి నీళ్ళు తెచ్చుకోవ టమే అలవాటు—ఆ వేళంతా ఏదో వంకపెట్టి తప్పించుకున్నారు శశితో వెళ్ళకుండా. ఒక యింటివా రమ్మాయి పలుకనేలేదు. తలుపు తియ్యనేలేదు. మిగిలిన రెండిళ్ల ఇల్లాళ్లు అప్పటికే బిందెలు పట్టుకొని బయల్దేరారు. శశికి పదడుగు దూరంలో వున్నారు. ''కొంచం ఆగండి. నన్ను పిలవకుండా వెళ్ళిపోతున్నారేం?" అనికేకే సింది శశి. వాళ్ళు వెనుదిరిగి చూడలేదు. నవ్వుకుంటూ వెళ్తున్న వాళ్ళల్లా మాటలు ఆపేసి గబగబా నడచి వెళ్ళిపోయారు. అప్పటికి శశి గ్రహించగల్గింది! ఆమె కాలవదగ్గరకు వెళ్ళేసరికి ఆ యిద్దరూ అప్పటికే నీళ్ళబిందె లెత్తుకుని వచ్చేస్తు న్నారు. శశిని చూడనట్టు మరోవేపుకు చూస్తూ వెళ్ళిపోయారు. శశిని దాటి పోయాక పకపకా నవ్వడం శశి వినక పోలేదు. నీళ్ళబిందెతో తిరిగి వస్తూంటే మునసబుగారబ్బాయి పొలంవెళ్తున్నాడు. రోజూ ఉదయం అతడదే పైముకు పొలంవేపు వెళ్ళడం శశి ఆవూరొచ్చిన నాల్గునెలలనుంచి చూస్తూనేవుంది. అతడి చెల్లెలికి నాగరాజు సంగీతం చెప్తున్నాడు కూడా. రోజూ గౌరవంగా తలవంచుకు పోయేవాడల్లా ఈవాళ పనిగట్టుకుని నడక వేగం తగ్గించి శశిని పరీక్షగా చూస్తూ నవ్వి ఈలవేశాడు. ఖంగారుపడ్తూ శశి త్వరత్వరగా అడుగులువేసి ముందుకు సాగిపోయింది.

భారహృదయంతో యింటికొచ్చి బిందె దింపి వెనుదిరిగేసరికి మంచంమీద పడుకున్న నాగరాజు కన్పించాడు.

"ఏం, పాఠాలు చెప్పటానికి వెళ్ళారుగా! ఒంట్లో బాగుండలేదా?" అంది దగ్గరకువెళ్ళి.

"ఒంట్లో బాగానేవుంది, జాతకమే బాగుండలేదు" అంటూ క్లుప్తంగా సంగతి చెప్పాడు. శశితన అనుభవాలు వర్ణిం చింది. ఉదయం బ్రాహ్మణుడి రాకను గూడా జోడించి సమన్వయపరచి యదార్థం వూహించుకున్నారు.

"ప్చ్. ఇక యిక్కడ లాభంలేదు. పోవాలి మరోచోటికి'' అన్నాడు నాగ రాజు.

''నాకూ అలానే అన్పిస్తోంది. ఇక అందరూ దయగా ఇచ్చే ఈ పాలూ

పెరుగూ, కూరగాయలుకూడ దొరకవు. వుంది లాభ మేమిటి ?" అంది శశి.

"ఏదో ఆలోచిద్దాంలే. డెబ్బై రూపా యలుచేతికొచ్చాయి'' అన్నాడునాగరాజు.

నాగరాజు భోజనం చేసి పడుకున్నాక ఏం తోచక వీధిగది కిటికీలో నిలబడింది శశి. ఆమె మనస్సు అవమానంతో, సిగ్గుతో, భయంతో కంపించిపోతోంది. అప్రయత్నంగా గతస్మృతు లన్నీ మనో ఫలకంపై వీరవిహారం చేసి బాధను అధికం చేస్తున్నాయి.

నవ్వుతూ ఆడ్తూ పాడ్తూ పదమూడేళ్ళ బాల్యం గడచిపోయింది. పద్నాలుగో ఏట పెళ్ళి చేశారు. భర్త బి.ఎస్‌సీ. చదువుతున్నాడు. శశి చాల అదృష్టవంతు రాలన్నారు అందరూ. నిజమే ననుకుంది జ్ఞానం తెలిసీతెలియని వయస్సులోనున్న శశిరేఖ. అతడు బి. ఎస్సీ. పాసయ్యాడు. శశి పాసైనట్టుగా అందరూ శశిని పొగు డ్తూంటే శశి వుబ్బి తబ్బిబ్బైపోయింది. కాని ఆ సంతోషం రెండ్రోజులుకూడా నిలుపలేదు. శశిభర్త రంగారావు వచ్చాడు. ఎక్కడైనా వుద్యోగము దొరి కిందేమో, బహుశ ఆవార్త అత్త వారికి చెప్పి తనను తీసుకు వెళ్ళే ఏర్పాట్లు చేసుకోవటాని కొచ్చాడేమో ననుకుంది శశి. బొత్తిగా బంగారు వూహా లోకమే కాని నేలమీద మనుష్యుల స్వభావాలు తెలియని శశి హఠాత్తుగా నేలకు విసిరేయబడినట్లు ఫీలైంది. తాను ఎమ్మెస్సీ చదువదల్చుకున్నాననీ, ఆ ఖర్చంతా మామగారు భరించుకోవ ల్సుంటుం దనీ చెప్పటాని కొచ్చాడు రంగారావు.

నిర్ఘాంతపోయాడు శశితండ్రి ఆది శేషయ్య. "నా కంత శక్తే వుంటే నా కొడుకును చదివించుకోనూ ? హైస్కూలు మేష్టర్తో సరిపెట్టుకోవడ మేంఖర్మం?" అన్నాడు.

"అదంతా నా కనవసరం. నేను ఎమ్మెస్సీ చదవాలి. నాకోసమా, మీ అమ్మాయికోసమా ? "నేను పెద్ద వుద్యో గస్తుడి నైతే మీ అమ్మాయి అనుభ వించదా ?"

"బాగుంది నాయనా, నువ్వు చదువు కుంటే మాకు సంతోషంకాదూ ? నేను అంత ధనాదారినిగాను. అనుకున్న కట్నం మేదో ఆనాడే ఇచ్చేశాను, ఇక నావల్ల కాదు."

"సరే. అయితే మా నాన్నా ఇవ్వక, మీరూ యివ్వక నే నేంజెయ్యను ? ఇక మీతో సంబంధము పెట్టుకోవడం కూడా నావల్లకాదు," అంటూనే వెళ్ళిపోయాడు రంగారావు. అప్రయత్నంగానే శశి హృదయం శోకపూరిత మైంది. ఆ శోకం ఈనాటివరకూ తగ్గనేలేదనడానికి ఎన్నో తెల్సుకోవాలి, ఆతర్వాత జరిగిన సంగతులు.

రంగారావు ఎమ్మెస్సీలో జేరాడు. పాసయ్యాడు. ఉద్యోగంకూడా వచ్చింది.




"ఆఫీసరు కావాలా, నీ అర్హత ఏమిటి ?"

"అర్హతా ? ఇంకా ఏం కావాలి. ఈ భార్యతో పధ్నాలుగేళ్ళ నుంచీ కాపురం చేస్తున్నాను."

---

ఇక తలిదండ్రులు అధికారంనుంచి స్వతంత్రు డయ్యాడు. తనను ధైర్యంగా ఆదరించగలడని ఆశించిన శశిఆశ నిరాశే అయ్యింది. ఆతడి కసలు తనకు వివాహ మయ్యిందన్న సంగతి గుర్తున్నదో లేదో!

సిగ్గు విడచి శశి భర్తకు వుత్తరం వ్రాసింది ప్రాధేయపడ్తూ.

"అమ్మా నాన్నా చూస్తే యేమను కుంటారు ? అలా ఎప్పుడూ వ్రాయకు. పెద్దవాళ్ళను నేను కాదనలేను. వాళ్ళకే తెలుసు మన బాగోగులు" అని వ్రాశాడు రంగారావు.

ఆ వుత్తరం రాయడాని కతడి కెంత సిగ్గులేకపోయిందోకాని అది చదువుకున్న శశే భూమిలోకి క్రుంగిపోయింది. ఆ తర్వాత తలిదండ్రులు చేసిన ప్రయత్నా లన్నీ కూడ విఫల మైనాయి.

క్రమంగా శశిరేఖ లోకం దృష్టిలో అల్ప మైపోయింది. వారి పరిభాషలో శశి నామాంతరం 'మొగు డొదిలేసినది'. ఇంట్లోకూడా శశి బ్రతుకు దీనాతి దీనంగానే పరిణమించింది.

ఒకసారి స్నేహితురాలు కమల సినీమాకు రమ్మంది. తండ్రిని డబ్బడిగితే 'లే' దన్నాడు ముక్తసరిగా. అంతకు ముందే చెల్లెలు పిక్నిక్ వెళ్తానంటే పదిహేను రూపాయ లిచ్చి మిగిలినది

జేబులో పెట్టుకోవడం తనే కళ్ళారా చూచింది.

తల్లి నడిగితే "ఇప్పుడా సినీమా చూడకపోతే చచ్చిపోతావా ?" అని అడిగింది.

మరొకసారి "బట్టలు చిరిగిపోయాయి క్రొత్తచీర లేమైనా కొనుక్కోవాలి" అంది. "నువ్వూ నేనూ ఏం కట్టుకుంటే బ్రతుకు వెళ్ళిపోదులెద్దూ ?'' అని ఈసడించింది నాయనమ్మ. శశిప్రాణం గిలగిలలాడింది.

ఇక అన్నయ్యా, వదినా సరేసరి. మనిషిని చూచినట్టు చూచేవారుకాదు. చెల్లెలుమాత్రం కొంచెం ఆప్యాయంగా మాట్లాడేది. కాని స్కూల్ ఫైనల్ చదువుతున్న ఆమెకు బొత్తిగా చదువు లేని అక్కపై యేమూలో తేలికభావం వున్నట్టే వుండేది. ముఖ్యంగా ఆమె స్నేహితు లొచ్చినప్పుడు శశి మాట్లాడ్డం చంద్ర కిష్ట ముండేదికాదు. క్రమంగా లోకం అర్థం కాసాగింది శశికి... సంఘంలో తన కున్న విలు వే పాటిదో గ్రహించింది. ఇటువంటి దయనీయ స్థితిలో నిర్మలతో పరిచయమైంది శశికి, ఒక పేరంటంలో. నిర్మల సంగీతం బాగా పాడ్తుంది. వాళ్ళన్నయ్య సంగీతం మేష్టరనీ అతనిదగ్గరే నేర్చుకుంటున్నా ననీ చెప్పింది నిర్మల. వాళ్ళ యింటి కాహ్వానించింది.

పిన్నపెద్ద లందరూ అతి ఆప్యాయంగా మాట్లాడే ఆ యిల్లు స్వర్గంలా కన్పించింది శశిరేఖకు. క్రమంగా రాకపోక లధికమైనాయి.

ఒకనాడు "సంగీతం నేర్పితే మీ అన్నయ్య ఏం తీసుకుంటారు ?" అని అడిగింది శశి నిర్మలను.

నవ్వింది నిర్మల. "పాతికాముప్పైలు ఇచ్చేవాళ్ళూవున్నారు. పదీ, ఐదూ ఇచ్చేవాళ్ళూ వున్నారు. తాహతునుబట్టి !"

ఒకనాడు మెల్లగా తల్లి దగ్గరచేరి బ్రతిమాలింది శశి. ''నెల కొక్క అయిదు రూపాయలేకదా అమ్మా ?'' అంటూ.

"ఇప్పుడు చదువుకునీ సంగీతం నేర్చుకునీ నువ్వు ఏం ఉద్యోగం చేసి ఎవర్ని పోషిస్తావు ? నీ కడుపుకు గుప్పెడు మెతుకులు మేంపెట్టలేకపోము" అంది తల్లి.

"నీ కిచ్చిన కట్నం, పెళ్ళిఖర్చులూ బూడిదలో పోసిన ట్లయ్యాయి. మళ్ళీ యిదో ఖర్చేమిటి మా నెత్తికి ? సంగీతం నేర్చుకుని ఎవరి నుద్ధరిస్తావ్ ? ఎవరి సంతోషంకోసం ?" అన్నాడు తండ్రి.

నిశ్శబ్దంగా ఏడ్చింది శశి. "ఎందు కందరూ తన్నిలా అసహ్యించుకుంటారు? పెండ్లినాడేకాని తిరిగి అతడి ముఖమైనా చూడని తన లోపమూ, బాధ్యతా ఏము న్నాయి. భర్తకు కోపం రావటంలో ?'' శశికి ఏమీ పాలుపోలేదు. ఒకనాడు మెల్లగా అన్న దగ్గర జేరింది.

"అన్నయ్యా"

"ఏమిటే?"

"ఒక టడుగుతా. కాదనకుండా తీరు స్తావా?"

"ఏమి టది?"

"ఎన్నాళ్ళు నే నిలా పడుండను. మీ కెవరికీ నా విషయంలో జాలిలేదా?"

"అందుకు నే నేం చెయ్యను?"

"ఆయన చదువుకైన నాలుగ్గవేలూ యివ్వలే దని కదా ఆయన కోపం. పోనీ నీకు కట్నం ఏడెనిమిదివేలు వచ్చింది. అందులో దివ్వకూడదా! చెల్లెలికి అన్న ఆ మాత్రం సాయం చెయ్యకూడదా?"

గోపాలం మాట్లాడలేదు. అంతలో గదిలోప్రవేశించిన వదినలక్ష్మి 'ఏమి'టని అడిగింది. గోపాలం వివరించాడు.

ఆశ్చర్యంగా, హేళనగా, సూటిగా చూచింది లక్ష్మి శశిని.

"అబ్బో వ్యవహార్తవే. ఇంకా ఏమో అనుకున్నాను! చాల్చాలు. సంతోషించాం కాని ఇం కెప్పుడూ ఇలాంటి కుంభ కోణాలు బోధించకు. అన్నయ్య కట్నము ఇవ్వడానికి అన్నయ్య పెత్తనమూ, పట్టుకు పోవటానికి నీ పెత్తనమూను. మానాన్న తనకూతురికిచ్చుకున్న డబ్బది మిమ్మల్నీ, మీమల్నీ తినమనికాదు."

ఛెళ్ళున కొట్టినట్లున్న ఆ జవాబుకు విస్తుపోతూ అన్నవైపు చూచింది శశి. అతడు విననట్లు కళ్ళుమూసుకు పడు కున్నాడు.

తీరని అవమానంతో, తెలియని క్రోధంతో, దహించివేసే బాధతో బయటకు వచ్చింది శశి. ఎవ్వరినుండీ ఆదరణా, సానుభూతీ లభించని ఆ యింట్లో ఒక క్షణం కూడ నిలువలేక పోయింది. తిన్నగా నిర్మల యింటికి పోయి ఆ బాధంతా ఏదాపరికమూ లేకుండా ఆమెతో చెప్పేసి భోరున ఏడ్చేసేవరకూ తీరలేదు.

అంతా విన్న నిర్మల "పోనీ మా అన్నయ్యకు చెప్తాన్లే, ఊరికే చెప్పమని. ఏడువకు శశీ" అని ఓదార్చింది.

నాగరాజు అంగీకరించాడు. స్నేహితురాలింటికి వెళ్తోందని తప్ప శశి ఇంట్లో ఎవరికీ తెలియదు, సంగీతం నేర్చుకొంటున్నట్లు. 'నా విషయంలో ఏ శ్రద్ధా లేనివాళ్ళకు ఎందుకు చెప్పటం? సంగీతం నేర్చుకుని నాల్గుపాఠాలు చెప్పు కుంటే నా బ్రతుకు నేను బ్రతకొచ్చు' అని ఆలోచించిన శశి శ్రద్ధగా నేర్చుకో సాగింది.

కాని నాగరాజు కూడా యువకుడు! నాల్గునెలలు తిరిగేసరికి సంగీతపాఠాలు తక్కు వయ్యాయి. ఇంట్లో ఎటువంటి ప్రేమకూ నోచుకోని శశిరేఖ మృదు మనస్తత్వం నాగరాజు మృదుభాషణ లకూ, మంజుల గానానికీ కట్టుబడి పోయింది. 'ఎవరికీ నా సుఖ సంతోషా లతో నిమిత్తం లేనప్పుడు నా దారి నే నెందుకు చూచుకో కూడదు?' అనే

మొండిగుణం రేకెత్తింది శశిలో. ఫలితంగా మరో నాల్గు నెలలు గడిచేసరికి ఒకనాడు ఆదిశేషయ్య ఇంటిలో శశిరేఖ కన్పించలేదు. నాగరాజు కూడా ఊళ్ళో మరి కన్పించలేదు. తా మెవరో ఎవ్వరికీ తెలియని దూర దూరాలలో ఒక పల్లెకు పోయారు. నాల్గు నెలలు నాల్గు సెకండ్లలా గడచిపోయాయి. పల్లెజను లంతా వారు వివాహితు లనే భావించారు. మునసబు కరణాలు, ఇంకా మోతుబరి రైతులూ పదిపన్నెండేళ్ళలో ఆడపిల్లలకు సంగీత పాఠాలు చెప్ప మన్నారు. డబ్బుకు డబ్బూ దొరుకుతోంది; పాలు, పెరుగు, కూరలు మొదలైనవాటికి లోటు లేకుండా సాగిపో తోంది. మునసబుగారి పెద్దబ్బాయి వాటా కొచ్చిన లోగిలి, అతడు పట్నంలో ఉద్యోగము చేస్తూండడమువల్ల ఖాళీగా వుంటోంది; నాగరాజు వుండటానికి అను మతి యిచ్చేరు. సహృదయులైన యిల్లాళ్ళ సహకారంతో ఏదో కొంత సామానుకూడ ఏర్పరచుకున్నారు. ఏ లోటులేని జీవితానికి యివ్వాళ హఠాత్తుగా పెద్ద దెబ్బతగిలింది. సంఘంలో, అటు వంటి వాళ్ళకు గడ్డిపోచ కున్న విలువ కూడ వుండదు — కారణం ఏమైనాకానీ.

గతమంతా త్రవ్విపోసుకుంటున్న శశి కండ్లకు వీధిన కుంకుంభరిణ పట్టుకు వెడుతున్న రాయుడుగా రమ్మాయి లక్ష్మి కన్పించింది. ఆమెకుకూడా నాగరాజు సంగీతం చెప్తున్నాడు. ఆ వీధికి రావడం తటస్థిస్తే తప్పకుండా తమ యింటికి వచ్చే లక్ష్మి యివాళ త్వరత్వరగా తలొంచుకు వెళ్ళిపోతోంది. గబాగబా బయటకు పరుగెట్టి పిల్చింది శశి. లక్ష్మి చూచింది ; కాని బెదురు చూపులు చూస్తూ నిలబడిపోయింది. లక్ష్మికి దగ్గరగా వెళ్ళింది శశి. "ఏం లక్ష్మీ, అలా చూస్తావ్? ఈ కుంకుంభరిణేమిటి? పిలుపు లెందుకు? నన్ను పిలవ్వన్నమాట" అంది లక్ష్మి చెయ్యి పట్టుకుని.

"క్షమించండి. మీతో మాట్లాడానని తెలిస్తే మా అమ్మ చంపేస్తుంది" చెయ్యి వదలించుకుని పెద్ద పెద్ద అంగలతో వెళ్ళి పోయింది లక్ష్మి. బావురు మని ఏడవా లనిపించింది శశిరేఖకు.

మధ్యాహ్నము మునసబుగారి పాలేరు వచ్చి పిల్చుకువెళ్ళాడు నాగరాజును.

"రెండు రోజులలో యిల్లు ఖాళీచెయ్యి. మర్యాదస్థుల యిళ్ళలో కూర్చుని ఆడ పిల్లలకు పాఠాలు చెప్పటానికి కూడ తయారయ్యావా? ఎన్ని గుండెలు నీకు? ఎల్లుండి కింక ఈ వూళ్ళో కన్పించావంటే మెడబట్టి గెంటించుతాను. కబడ్దార్" కిక్కురు మనకుండా తల వాల్చుకుని ఇంటికి జేరాడు నాగరాజు.

ఆ రాత్రికి రాత్రే వున్న కొద్ది సామానుతో వూరు వదలి మద్రాసు జేరు కున్నారు. మహాపట్టణాలలో ఒకరి జోలి ఒకరి కక్కర్లేదనీ స్వేచ్ఛగా బ్రతకవచ్చనీ వారనుకున్నది పూర్తిగా నిజం






కాదని కొద్దిరోజులలోనే తెలిసిపోయింది. బొత్తిగా పల్లెటూళ్ళలో లాగా నిప్పూ, నీరూ పుట్టకుండా వెలివెయ్యరు కాని హేళనకు మాత్రము లోటుండదు. అందులోనూ మహాపట్టణాలలోనే మూల మూలల నుండీ రకరకాల వ్యాసకాలతో వచ్చిన అనేకు లుంటారు. వారి పరిచితులు తప్పకుండా పదిమందైనా కన్పిస్తారు. ఎవరిమట్టుకు వాళ్ళు తమ తప్పులను మరచిపోయి ఎదుటివారిని చూచి నవ్వుతూ బ్రతికేస్తారు.

"శశీ. గొలుసు యిలాగియ్యి." అన్నాడు మద్రాసు జేరుకున్న నాలుగో రోజున నాగరాజు.

"ఎందుకు ?" అడిగింది శశి.

"డెబ్బై రూపాయలు డెబ్బైఏళ్లు వస్తాయనుకున్నావా ?" నాగరాజు గొంతులో హేళన ధ్వనించింది. అతడలా మాట్లాడటం అదే ప్రథమంగా విన్న శశిరేఖ ఆశ్చర్యపోయింది. కొద్ది కొద్దిగా అర్థం జేసుకోగలిగింది. మాట్లాడకుండా మెళ్ళోని పలకసరుల గొలుసు తీసి ఇచ్చేసింది.

నాలుగువందల డబ్బుతో తిరిగొచ్చిన నాగరాజును చూచి ఆశ్చర్యపోయింది.

"ఆ గొలుసు ఏడుకాసులు!" అంది శశి.

"చెడి అమ్ముకొనేవాళ్ళకు అంత డబ్బా ఎలా వస్తుంది ?"

"ఇటివ్వండి దాస్తాను."

వద్దు ఉంచు. ఒక సినీమా కంపెనీకి ప్లేబాక్ వాళ్ళు కావాలట. ప్రయత్నిస్తాను."

"అయితే అంత డబ్బు దేనికి ?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఆహాఁ. డబ్బు అడ్డులేందే ఈమహా ప్రపంచంలో అవకాశాలూరికే ఊడిపడతా యనుకున్నావా ?"

శశిరేఖ మాట్లాడలేదు.

ఇంటి ఖర్చులకు మాత్రం పది రూపాయలిచ్చి వెళ్ళిపోయాడు నాగరాజు. శశికి ఏమిటో అయోమయంగా, పిచ్చెత్తి నట్టుగా, ఏదో పెనుభూతం మ్రింగబో తున్నట్టుగా తోచింది.

నాల్గురోజుల అనంతరం ధూళి ధూసర మైన బట్టలతో జేబులు ఖాళీ చేసుకుని తిరిగొచ్చాడు నాగరాజు.

"డబ్బంతా అయిపోయిందా ? మరెలా ?"

"ఆ చేతిగాజు లిలా గియ్యి !" అధికా రంగా అన్నాడు

కంపించిది శశి. "ఇక అవికూడా అయిపోతే మిగిలే దేమిటి ? అదీ రెండు రోజుల్లో అయిపోతుంది. ఎక్కడా సంగీతపాఠాలు దొరకవా ?"

వికటాట్టహాసం చేసేడు నాగరాజు." ఇది మదరాసే భామా. నాలాటి బుడ బుక్కల సంగీతం మాష్టర్లవసరంలే దిక్కడ.''

అతడు బాగా త్రాగికూడా వున్నాడని గ్రహించింది శశి. కన్నీళ్ళు టపటపా రాల్తూండగా రెండు జతల గాజులు తీసిచ్చింది, 'బోడిబొమ్మలా మిగిలాను' అనుకుంటూ. అవి తీసుకుని అతడు వెళ్ళి పోయాడు, "నే నేమైనా లక్షాధికార్నను కుని వచ్చావా మరి నాతో ?" అన్నాడు పోతూపోతూ. ఆమె కళ్ళనీళ్ళు చూచి.

రెండు రోజులవరకూ ఎలాగో తిండికి లోటులేకుండా గడచిపోయింది శశికి, వున్న కొద్ది డబ్బుతోనూ. ఆతర్వాత ఏం చేయాలో తోచలేదు. చెంబూ, గిన్నె కుదువబెట్టి గడుపుకోసాగింది. నాగరాజు జాడమాత్రం లేదు గ్రహించింది శశి. నాగరాజు తనపాలిట నాగుబామయ్యాడని, పాము కుబుసపు తళతళలకు మోస పోయింది. ఇప్పుడా పాము గరళం క్రక్కుతోం దన్నమాట. రాత్రి పదిగంట లకు తూల్తూ వచ్చాడు నాగరాజు. ఎంత సేపున్నా డబ్బివ్వలేదు. శశి అడగలేదు. మాట్లాడకుండా కూర్చుంది.

"అలా దయ్యంలా చూస్తావేం ? నాలుగు మెతుకులు పడేస్తావా ? " అని అడిగాడు.

"వంట చెయ్యటానికి ఏమీ లేవు. మీరు డబ్బుతో వస్తారని చూస్తున్నాను."

"డబ్బులేదు పేకాటలో పోయింది."

"అంతానా ? మరెలాగ ? "

"ఎలాగో చెయ్యి "

"ఎలాగో అంటే ఎలా ? మీ ఉద్దే శ్యము ? " తీవ్రంగా అడిగింది.

"ఏమిటే నోరు మా లేస్తోంది ? ఏ వుద్దేశ్యంతో నన్ను తీసుకొచ్చావ్ మరి? రూపాయల చెట్టుందనుకున్నావా ?"

"అది నే నడగవలసిన ప్రశ్న'' అంది శశి మరింత రెచ్చిపోతూ.

"నోర్మూయ్" శశిచంప చెళ్ళుమంది.

ఏడ్చిఏడ్చి నిద్రపోయినశశి మర్నాడు లేచేసరికి నాగరాజు ఇంట్లో లేడు. పదో నాడు నాగరాజు తిరి గొచ్చాడు. కూడా మరెవరోకూడా వున్నారు.

"ఓ! యింకా ఇక్కడే వున్నా వన్న మాట!'' అన్నాడు నాగరాజు.

పరీక్షగా చూచింది. త్రాగిన లక్షణా లేమీ కనపడటం లేదు. తెలివిగానే వున్నాడు.

"ఇక్క డుండ కెక్కడి కెళ్తాను? అందులోనూ, మీరు లేనప్పుడు?" ఆశ్చ ర్యంగా అడిగింది.

"అబ్బో' పతివ్రత! కట్టుకున్న మొగు డుండగా నాతో రాలా?"

నెత్తిమీద పిడుగులుకూడా కాదు, ఇం కేమిటో పడ్డట్టదిరిపోయింది శశి.

"తర్వాత ఆశ్చర్యపోతూ సినీమాపోజు లెడుదువుగాని, అవతల కూర్చున్నాయ నకు మంచినీళ్ళిచ్చి ఏంకావాలో చూడు. నేను కాసేపు పడుకోవాలి," అంటూ మంచంపై పడ్డాడు నాగరాజు.

తా నెంత హీనాతి హీనస్థితిలో వున్నదీ గ్రహించింది శశి. మెల్లగా లోపలికి నడి చింది. నిముషాలలో కర్తవ్యంనిర్ణయించు కుంది. త్వరత్వరగా పెరటి సందులో నుండి వీధిలోకి నడచి రోడ్డు పట్టింది.

"ఏం చెయ్యాలి? ఎక్కడి కెళ్ళాలి? ఎక్క డుంటుంది? ఇక ఎక్కడైనా ఇలాటి పరిస్థితులే ఎదురౌతాయి. చాలు, ఇంతకంటె హీనాతి హీనానికి దిగజా రక్కర్లేదు. ఎంతైనా తలిదండ్రులు – ఆదరించక పోరు. అక్కడికే వెళ్ళాలి. టిక్కెట్టుకు డబ్బు లేదు. అయితే నేం? అందరూ టిక్కెట్టు కొనే ప్రయాణాలు చేస్తున్నారా? ఎలాగో వెళ్ళి తండ్రి పాదాల పై పడ్తే – ఆ నీడన నోరు మూసుకు పడుండడాని కింత చోటు దొరి కితే అంతే చాలు."

వచ్చిననాడు నాగరాజున్నాడు గనుక తన కే గొడవా సమస్యా లేకపోయింది. కాని ఈవ్వాళ ఆ స్టేషన్లో అన్ని ప్లాట్ ఫారాలను, రైళ్ళను చూస్తూంటే కన్ను చెదరిపోయింది. గుండెలలో దడ రేగింది. ఏది ఎటు వెళ్తుందో? ఏ దెక్కాలో? ఏం చెయ్యాలో? ఎవరి నడగాలి? ప్లాట్ ఫారంపై నుంచున్న ఒకత న్నడిగింది. వాడు ఎగా దిగా చూచి పళ్ళికిలించాడు. శశికి ఖంగారు పుట్టి వెయిటింగ్ రూమ్ కేసి నడచింది!

"బాబూ. రాజమండ్రి పోయేందు కే రైలెక్కాలి?" అంది వెయిటింగ్ రూమ్‌లోనుంచి ఈవలికొచ్చిన ఒకతడిని. చెప్తూండగా ఆ వెనుకవస్తూన్న యువతిపై శశి దృష్టి పడింది. "చంద్ర!!"

"చెల్లీ" అంది రెండు చేతులూ ముందుకు చాచి.

ఆ యువతి వులిక్కిపడి స్థాణువులా నిలబడిపోయింది.

"చంద్రా. ఎవ రామె "? అడిగాడు యువకుడు.

చంద్ర నేత్రాలు అటు ఇటు కలవరంతో కదులాడాయి. "ఎవరో పిచ్చిది" అంటూ భయంతో భర్త చెయ్యి గట్టిగా పట్టుకుని త్వరత్వరగా నడచి వెళ్ళిపోయింది.

"పిచ్చిది!" గుండెలు బ్రద్దలైపోయే ఆవేదన కల్గింది శశికి. "చంద్రకు పెళ్ళి అయింది కాబోలు. అతడికి తన విషయం తెలిస్తే భార్యను కూడా అసహ్యించుకో వచ్చు. అందుకే చంద్ర ఆలా ప్రవర్తించింది. నయం—యింకా తను రెట్టించి ఆమె జీవితాన్నికూడ పాడు చేయలేదు. బహుశః తన సంగతి తెలియకుండా రహస్యంగా చేసేసి వుంటారు పెళ్ళి. అవును. లేకపోతే అక్క అలాటి దంటే చెల్లెల్ని ఎవరు చేసుకుంటారు? తర్వాత తర్వాత మెల్లిగా తెలిసినా అంత ప్రమాదం లేదు."

కుప్ప కూలిపోయింది శశి. "ఎంత మచ్చ తెచ్చిపెట్టింది. వాళ్ళెంత కుమిలి పోతున్నారో. చంద్ర పెళ్ళి రహస్యంగా చేయడాని కెన్ని యిక్కట్లు పడ్డారో? చంద్ర తనవైపు చూస్తేనే ప్రమాద మన్నట్టు ఆలా వెళ్ళిపోయింది — ఇక తలిదండ్రు లింట్లో పెట్టుకుంటారా? చెల్లెలు గనక తన సంసార భయంతో వెళ్ళిపోయింది. ఎంతైనా తలిదండ్రులు కన్నతీపి చంపుకోగలరా?" ఆశ యే మూలో పీడించగా మెయి లెక్కింది, శశి రేఖ. శరీరంపై మిగిలిన ఒకే ఒక్క వుంగరంతో బెజవాడలో టిక్కెట్ కలక్టర్ని వదిలించుకుంది. మెయిల్ రెండు గంటల లేటుతో రాజమండ్రి జేరింది. అదీ నా అదృష్టమే అనుకుంది. శశి విజయేశ్వరము చేరేసరికి చీకట్లు వ్యాపించాయి. తెలిసినవాళ్లెవరికీ గుర్తు దొరక నని కొంగు తలపై కప్పుకొని చకచకా నడక సాగించింది.

వీధి అరుగుమీద గోపాలం కొడుకును పొట్టమీద కూర్చోబెట్టుకు ముద్దులాడు న్నాడు. ఆదిశేషయ్య వాలుకుర్చీలో చుట్ట కాలుస్తూ పడుకున్నాడు. "ఎవ రది?" అన్నాడు గోపాలం చీకట్లో తమవైపే కదలివస్తూన్న ఆకారాన్ని పరీక్షగాచూస్తూ.

"అన్నయ్యా నేను" ఏడుస్తూ దగ్గర కెళ్ళింది శశి.

ఉలిక్కిపడి లేచాడు గోపాలం. కాండ్రించి ధుపుక్కున వుమ్మేసి లోపలికి పోయాడు గోపాలం. ఆ వుమ్మి సరిగా శశి ముఖాన పడింది.

"నాన్నా" అని వెళ్ళి తండ్రి పాదాలను పట్టేసింది.

ఆదిశేషయ్య ఛీత్కారంచేస్తూ కాళ్ళు విదిలించుకుని లోపలి కెళ్ళిపోయాడు. "ఈ బ్రతుకు బ్రతకనివ్వవా మమ్మల్ని? మళ్ళీ ఈఊళ్ళో కనిపిస్తే అడ్డంగా నరికి పారేస్తాను" అన్నాడు తలుపులు భళ్లున మూస్తూ. ఆ తోపుకు అరుగుమీది స్తంభాని క్కొట్టుకుంది, వెనక్కుపడిపోయిన శశి



"అవునండీ! ఏప్రియల్ అని మిమ్మల్ని ఫూల్‌ని చెయ్యటం లేదు. ఇవ్వాళనుంచీ నిజంగానే టిక్కెట్లు పెంచాము."

---

తల. దిమ్మెక్కిన తలపట్టుకుని మెల్లగా లేచి వెళ్ళిపోయింది శశి. ఏడుపు రాలేదు. విచారంలేదు, భయంలేదు, గమ్యం తెలియదు. స్టేషను కెళ్ళి కనుపించిన రైలెక్కేసి కూర్చుంది. అది సెకండ్‌క్లాస్ కంపార్ట్‌మెంటనికూడా ఆమెకు తెలియదు. రైలెటు పోతుందో ఆమెకు తెలియదు. రాయిలా కూర్చుంది.

గోదావరి స్టేషన్‌లో ఆ పెట్టెలోకే ఓ జంట ఎక్కారు. వాళ్ళ నవ్వులకు, కేరింతాలకు కొంచం చలనం కలిగింది శశిరేఖలో. తలెత్తి చూచింది. 'రంగారావు!'

ఆ భాగ్యశాలి అతడుమళ్ళా వివాహం చేసుకున్న స్త్రీ కాబోలు! తిండిలేకచిక్కిన శరీరంతో, మాసిన దుస్తులతో, తైల సంస్కారములేని తలతో వున్న ఆమెను రంగారావు గుర్తించినట్టులేదు.

పెండ్లినాడు మధుపర్కపు దుస్తులతో అతడిని కొద్దిగంటలుమాత్రమే చూచిన శశిరేఖ తనివితీరా అతడి ముఖాన్ని చూచింది. ఎంత అందమైన ముఖం! ఆ అందం అడుగున ఎంత అల్పత్వం? ఆనాడు శశి అదృష్టవంతురాలు అన్నారు అందరూ. ఈనాడు? నికృష్టస్థితిలోవుండి మరో భార్యతో నిశ్చింతగా కులుకుతున్న

భర్తను చూచుకోగలిగిన అదృష్టవంతురాలు? భగవాన్! ఎందుకు పుట్టించావు? ఎందుకీ నికృష్టజన్మ! అందరిలా గే పెళ్ళైంది. ఏవేవో వూహలతో బంగారు లోకంలో తేలిపోయేదాన్ని. ఈ రూపాయణాల మనుష్యులు నిరాదరణతో దూరంగా గెంటివేశారు. తెలియక తప్పు చేసేను. అందరూ అసహ్యించుకుంటున్నారు. అందుకు కారణమైనవారు హాయిగా మరొకతెను వివాహమాడి నిశ్చింతతో వున్నాడు. అతడినెవరూ అసహ్యించుకోరు. అవును, అది అతడి జన్మహక్కు. ఎవరో పూర్వులు మానవ జీవితమార్గాన్ని ఒక చక్రంలో బిగించేశారు. కష్టమైనా, నిష్ఠురమైనా అచక్రం గాడిలోనే నడవాలి. తప్పితే మరి ఆ గాడిలోకి జొరబడనీయరు. ఏ కారణం వల్ల తప్పిందో అనవసరం. పట్టులు దప్పి పడిపోతారు. దూరంగా విసిరేస్తుం దా చక్ర భ్రమణపువేగం. ఆ గాడి తప్పి అంచుల మీదికి వచ్చేస్తే ఆ గాడిలో నున్నవారు ఈ తప్పినవారిని నీచంగా చూచి హేళన చేస్తారు. దరిజేరబోతే కౄరంగా శిక్షించి వదిలేస్తారు. మనస్సుకు సంబంధించిన న్యాయాన్యాయాలు వారికక్కర్లేదు. ఛీ, ఛీ. ఎందుకీ నీచప్రపంచంలో? ఆ గాడిలోనే బుద్ధిమంతుల్లా వుండి మధ్య మధ్య ఎవరూ చూడకుండా ఒక్కొక్కసారి బయటకు తొంగిచూచి తిరిగి గాడిలో కూర్చునేవాళ్ళ సంగతి ఎవరూ పట్టించుకోరు. వాళ్ళు బుద్ధిమంతుల క్రిందే లెక్క.

ఒక్కసారి అటు చూచింది. నవ్వుతూ, కేరుస్తూ, మరోలోకంలో తేలిపోతూన్నదా జంట. మరి చూడలేకపోయింది. గుమ్మంపైపు నడచింది. రాత్రి పదకొండు గంటలసమయం. గోదావరి బ్రిడ్జిని మెల్లగా దాటుతోంది రైలు. నది వరదలలో వుండడంవల్ల కెరటాల హోరు భయంకరగా విన్పిస్తోంది వర్షం జల్లులు జల్లులుగా పడ్తోంది. రైలు చప్పుడు ఆ నిశ్శబ్దంలో నదీ జలాలపై ప్రతిధ్వనించి వింత భయం రేకెత్తిస్తోంది. ఒక్కసారి ధైర్యమంతా కూడదీసుకుని శశి గట్టిగా కళ్ళుమూసుకుంది. "ఎవరు పరిత్యజించినా నీ విశాలగర్భంలో చోటుంటుంది. సర్వపాపహారిణీ, నీ దృష్టిలో పరిత్యక్తలు లేరమ్మా." పైనర్రైలు గుబగుబా సాగిపోయింది. క్రింద గోదావరి గలగలా పరుగెడుతూనే వుంది.



# ఎందుకు మాసిపోతుందో ప్రేమ?

ఎందుకు మాసిపోతుందో ప్రేమ.
ప్రాయపుపొత్తంలో నలిగిన గులాబిరేకులలాగ నెమలి ఈకలలాగ
నదివేసవి వడసోకిన పన్నీటి జల్లులాగ
పచ్చికబయలులోన తలనెరిసిన రెల్లులాగ చెరిగే హరి విల్లులాగ
ఎందుకు మాసిపోతుందో ప్రేమ ?
ఎందుకు మాసిపోతుందో అందం ?
కన్నీరై కురిసిన ఆనందంలాగ పెటిలిన గండంలాగ
కొడిగట్టిన కడివెన్నెల నవ్వులాగ
తలగడపై నలిగిన సిగపువ్వులాగ
చెక్కుల చెంగావి పోయి, చివురుమోవి కావి పోయి
ఊర్పుపగరు తావి పోయి
ఎందుకు మాసిపోతుందో అందం ?
ఎందుకు మాసిపోతుందో ప్రాణం ?
వడలిన ఆకులు రాలి, రెప్పలు రేకులు వాలి
కడపటి చీకటిలో నిద్దురపొద్దు వాలి
ఇసుక పలకపై తరగల నురుగువ్రాలు కరగినటుల
వడకే ఆకులపై లేఎండపొడలు చెరగినటుల
గాలుల దోసిలిలోంచి కారిపోయే పాటలాగ
పొగమంచులోన నీడల దోబూచుల ఆటలాగ
ఎందుకు మాసిపోతుందో ప్రాణం ?
ఏమిటి చేస్తున్నాను ఇక్కడ నేను ?
దేవర లేని దేవళంలో రేవులు లేని సంజవేళ
చివికిన మోజు బూజునడుమ, విడువని జ్ఞాపకాల గబ్బిలాల
రెక్కల రెపరెపలో, కీచురాళ్ల రొదల సొదలో
నల్లని వగపు నల్లమందు మగతలోంచి
ఎండుటాకులు నలిగే సడి వెనుక
దూరమయ్యే అడుగుల సవ్వడి వెనుక
మరణశిలల పదములపై తలపగిలిన ప్రేమతరంగాల హోరు వింటున్నాను
నురుగుల చిరునవ్వులు కంటున్నాను.

---

బైరాగి

---

# అపోహ

జాలతీ బేగం

"ఏమిటి కేడ్చెద వానన
తామరసం బెత్తిచూడు తరుణీ నన్నున్
గోముల కటాక్ష వీక్షా
దామకముల రఘు రామయ్య
తనయున్ లక్ష్మీపతిన్"

"పోండి....మరీ చిన్నపిల్లలైపో తున్నారు! వదలండి—అబ్బబ్బా!"

"మరేం చేయమంటావు రాధా? సాయంత్రం ఎప్పుడౌతుందా అని చూస్తుంటాను. ఆఫీసులో శరీరం, రాధ దగ్గర మనస్సు—ఊ సరేగాని నీ వెందు కేడుస్తున్నావో చెప్పు? ఈ సంపెంగ



పూవు నీ జడలో ఎలా పెట్టానో చూడు....ఆహా....గూటిలో రామ చిలకలా గుంది."

"..................."

"చెప్పు రాధా? నీవు కన్నీరు కారుస్తే నే చూడలేను—పండక్కి మీ ఊరు వెళ్ళవద్దన్నానా?"

"ఇంకా నయం చాక్‌లేట్స్ తేలే దనా? అన్నారు కాదు."

"నువ్వు కాదు రాధా—నిజంగా చెప్పు నీ కేం లోటో! ఈ ఊరు బాగుండ దనా?"

"................ ..."

"అసలీ ఊరు నీ కిష్టం లేదన్నావు మొదట్లోనే. ముక్కోటి ఆంధ్రులను ఆకర్షించే ఈ భాగ్యనగరం నిన్ను ఆకర్షించ లేదంటే నిజంగా ఇది అభాగ్య నగరమే అని చెప్పాలి! నాకీ ఊళ్ళో ఉద్యోగం వచ్చిందని నే నెంతో సంతోషించాను. షికార్లతో సినిమాలతో ఆనందంగా గడపవచ్చనుకొన్నాను. నీవేమో ఎక్కడికీ రానంటావు."

*     *     *

పెరట్లో పడక్కుర్చీలో పడుకున్న కుటుంబరావు మనస్సు చలించింది. ఏదో తనకు తెలియని శక్తి అతన్ని కృంగతీస్తోంది. ఏవేవో ఆలోచనలు. మనస్సంతా భారంగా ఉంది. తన పెళ్ళైనప్పటినుంచీ ఎప్పుడైనా ఒక రోజన్నా భార్యతో అలా కబుర్లు చెప్పుతూ గడిపాడా? కారణం తల్లి తండ్రీ, గంపెడు తోబుట్టువులతో ఇల్లంతా ఏనుగు కలచిన కొలనులా గుండేది—ఎప్పుడూ! ఇప్పుడో? అన్ని అడ్డంకులూ తొలగిపోయాయి. అయినా తనకి సుఖంలేదు. సుశీల ప్రొద్దున పదింటికి పోయి సాయంత్రం ఆరుగంటలకి ఇల్లు చేరుకొంటుంది. కాళ్ళీడ్చుకొంటూ ఉసూరుమంటూ వాడిపోయిన ముఖంతో ఎదురౌతుంది. ఆ స్థితిలో చూస్తే ఇక సుశీలతో ఏమీ మాట్లాడలేడు. పాపం పొద్దస్తమానం



మైపు యంత్రంతో కుస్తీపట్టిన చేతులు అలసిపోయి ఇం కేపనీ చేస్తాని కంగీక రించవు. యంత్రానితో మైత్రి చేసి సుశీల మనస్సు కూడా యంత్రమై పోయింది. పోనీ ఉద్యోగమన్నా మాన్పించేద్దా మంటే గడవటం కష్టం. తన జీతమైతే పది రూపాయలన్నా పెరగలేదు కాని సంసారం మాత్రం న లు గు రు పిల్లలతో ఇట్టే పెరిగి పోయింది. దేవుడు ద యా మ యి. వద్దన్నా సంతానభాగ్యం కలిగిస్తాడు అనుకున్నాడు కుటుంబం.

''ఏరా ? కుటుంబీ ! ఏ మూలో చిస్తున్నావ్ ? నీ పేరుకు త గ్గట్టు ఎప్పుడూ కుటుంబాన్ని గురించే ఆలో చిస్తుంటావా ? ఎప్పటి నుంచో గేటు శబ్దం చేస్తున్నా, వినిపించలేదా ?'' అంటూ లోని కొచ్చిన భాస్కరాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు కుటుంబరావు.

''భలే ఊహించావే ? ని జం గా కుటుంబాన్ని గురించే ఆలోచిస్తున్నా నురా! ఎంతైనా సి. ఐ. డీ. ఆఫీసరుగా మరి. మనస్సులోని మాటలు కూడా చెప్పటం నేర్చుకొన్నా వన్నమాట.''

''అది సరేగాని, నీ పేరన్నా మార్చుకో, లేకపోతే బడిపంతులు ఉద్యోగమన్నా మానుకో. ఈ రెండూ కలిసి నిన్ను మరీ పిచ్చోడిగా చేసేస్తు న్నాయి. కుటుంబం— బడిపంతులూ — ప్రయివేటు పిల్లలూ — ఈ మూడు మాటలు తప్ప నీ డిక్షనరీలో వేరే మాటలే లేవు.''

''ఉష్....విను విను .... ఆ నవ్వు చూడు ఎంత మధురంగా ఉందో....''

''ఏదీ?ఎక్కడ? కనిపించుటలేదే!- ఎలా చూడను ?''

''పోరా?....నీదంతా చాదస్తం... వినమంటే.''

* * *

''చూడు రాధా-ఈ పదిచీరల్లోంచి ఏదన్నా ఒకటి కట్టుకో. ఈ ఎఱ్ఱచీర ఈ నల్లజాకెట్టు నీ కెంతో అందంగా ఉంటుంది. కెందామరలా గుంటావు. లేలే.... లేమరి టైమ్ అయిపోతోంది.''

''అబ్బబ్బా....ఉండండి....మ రీ ను చి న్న పి ల్ల లై పో తు న్నా రు. అయ్యయ్యో పడిపోతా నండి....ఏం టలా ఎత్తేస్తారు పైకి.''

''లేవకపోతే ఏం చేయమంటావు చెప్పు ? మోటర్ సైకిల్ గాని కారు గాని చెడిపోతే దాన్ని కాస్త తోసి వదుత్తే అది స్టార్ట్ అవుతుంది. చూడు నీవు డ్రెస్ వేసుకొచ్చేలోగా ఈమల్లెల్ని సూదితో గుచ్చేస్తాను..ఊం, కదులూ!''

* * *

''కూర్చో — కూర్చో నీ వెందుకు లేస్తున్నావు. మరీ ఇంత రియాక్షన్ అయితే ఏలా'' అన్నాడు భాస్కర్ కుర్చీలోంచి పైకి లేవబోతున్న కుటుం

జాన్ని భుజాలు పట్టి కూర్చోబెడుతూ. కుటుంబరావు సిగ్గు పడ్డాడు.

"ఏం చేయమంటావురా-భాస్కర్! మనం అనుభవించనివి ఇంకొకరు అనుభవిస్తున్నప్పుడు చూసేవాళ్ళకిలా గుంటుం దంటావు."

"ఏమిరోయ్? మనం మనం అంటూ మొదలెట్టావు. నాకింకా కుటుంబం లేద్రోయ్ కుటుంబంభాయ్."

"సరేగాని భాస్కర్"

"ఉ....ఏమిటీ కుటుంబం"

"చూడు నే నేమొ సీరియస్‌గా చెప్తాను. నీ వేమొ చాల లైట్‌గా తీసికొంటావు. నీ కంతా నవ్వులాటగా ఉంటుంది కదూ? ఎన్నిరోజు లిలా అడవికాచిన వెన్నెలవలే నీ యవ్వనాన్నంతా వృధా చేసుకొంటావు. నా మాట విని తొందరగా పెళ్ళిచేసుకో."

"నీ యవ్వనం అంతా పెరట్లో కాస్తోంది. ఏరోసీ నాదాన్న నాన్ని అడవిలో ఉండనీ."

"అదే వద్దనేది. ఏది చెప్పినా నీకు నవ్వులాటగా ఉంటుంది."

*　　*　　*

"రాధా....ఓ....రాధా...."

"ఏమిటండీ ఆ గావుకేకలు. మెల్లగా పిలవలేరా?"

"అసలు నీవు పలికితేగా! పలకనప్పుడు గట్టిగా పిలవ్వలసివస్తుంది."

"నా పేరు రాధైతేగా మీరు పిలవగానే పలకడానికి."

"అదిగో! ఎన్నిసార్లు చెప్పినా మళ్ళీ అదేమాట. వరాలు అంటే ఏం బాగుంది చెప్పు. చాల పాత పేరులాగుంది. వరాలు, నూకాలు, నాగులు, నాంచారమ్మ, తాయారు ఇవన్నీ ఔట్ ఆఫ్ ఫేషన్. నాకు నచ్చిన పేరు రాధ, ఏం. రాధ అని పిలుస్తే పలకూ్కడదా?"

"సరే .... సరే .... మాటల్లో నే టైమ్ అయిపోతోంది....సినిమా మొదలెట్టేస్తారు."

"ఊ....ఇదిగో మల్లెపూల దండ. తొందరగా పెట్టుకో – అబ్బో అబ్బో ఎందు కంత నవ్వు? చెప్పితే నేనూ సంతోషిస్తాగా."

"అదేంటి అలా గుచ్చావు, ఒకటి కాడలోంచి ఇంకొకటి మొగ్గలోంచి, కొన్ని కాడలు వేరుగా, కొన్ని మొండిగా....బాగుండదండ; ఇది పెట్టుకొంటే ఎవరన్నా నవ్వగలరు."

"ఎవరూ నవ్వరు – నీవే నవ్వుకుంటున్నావు కానీ....కానీ తలుపులన్నీ వేసుకొని రా, నేను స్కూటర్ బైటికి తీస్తా."

*　　*　　*

కుటుంబరావూ, భాస్కర్ చెవులు రిక్కించి వింటున్నారు. వాళ్ళ సంభా

షణలబట్టి వాళ్ళ సంగతులు ఒక్కొక్కటీ తెలుస్తున్నాయి కుటుంబరావుకి. ఒకటి రెండుసార్లు ఆమెను చూసాడు. కాని పూర్తిగా చూడలేక పోయాడు. వెనుకనుంచో, పక్కనుంచో చూశాడు. ఆ చూసిన కొద్ది రూపాన్నిబట్టి ఆమె అందగత్తె అని ఊహించాడు కుటుంబం. భాస్కర్ కూడా ఎటో ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు. తలుపులు వేసిన శబ్దం, స్కూటర్ కదలిన శబ్దం ఇద్దరూ విన్నారు. అదృష్ట దంపతు లనుకొన్నాడు కుటుంబం; ఆదర్శ దంపతు లనుకొన్నాడు భాస్కర్. కుటుంబం చేతి కున్న వాచీ చూశాడు. ఆరున్నర కావస్తోంది. ఇంకా సుశీల రాలేదని బాధపడ్డాడు. పిల్లల్ని ఆడిస్తానికి తీసి కెళ్ళిన ఆయాకూడా తిరిగి వచ్చేసింది. నలుగురు పిల్లల్ని ఆడించలేక సతమంత మౌతోంది. పాపం పొద్దస్తమానం ఎలా చూస్తుందో పిళ్ళని! పదిహేను రూపాయలకోసం ఇంత కష్టపడుతుం దన్న మాట! తనో-తనూ అంతేగా నూట యాభై కోసం యాభై మంది పిల్లలకి చదువు చెప్తున్నాడు. ఎవరికి తగ్గకష్టం వాళ్ళకి అనుకొన్నాడు కుటుంబం.

"వస్తా[నా — కుటుంబం. అసలు వచ్చినపనే మర్చిపోయాను - చూడు రేపు సండే పిక్‌నిక్ ఏర్పాటు చేస్తున్నాను. నీవూ — సతీమణితో సహా రావాలి! పక్కింటివాళ్ళ మైకంలో పడి ఎందుకు కొట్టుకొంటావు. నీవూ అంతకంటే పదిరెట్లు అనుభవించవచ్చు" అన్నాడు భాస్కర్ కుర్చీ లోంచి లేస్తూ.

"ఏమో! నన్నడిగితే ఎలా? సుశీలను అడగాలి. ఆమెగారికి సండే డ్యూటి ఏమన్నా పడిందో ఏమో మరి" అన్నాడు కుటుంబం విసుగ్గా నిట్టూర్పు వదుల్తూ.

"ఓహో....సుశీల అనగానే సుశీల వచ్చేసింది — నూరేళ్ళు ఆయుస్సు" అన్నాడు భాస్కర్ అప్పుడే లోని కొచ్చిన సుశీలను చూసి.

"ఎందుకు బాబూ నూరేళ్ళు నూట పదిహేళ్ళను! ఈ కష్టాలతో నూరేళ్ళు జీవించా లనా మీ ఉద్దేశ్యం" అంది సుశీల చెప్పులు మూలపెట్టి పర్సూ టిఫిన్ బాక్సు బల్లపై పెడుతూ నవ్వి,

"ఏం, ఆలశ్యమయిందేం?" శాస్త్రి కఠినంగానే ఉంది కుటుంబరావు అడిగిన ధోరణి. సుశీల భాస్కర్‌లు నిర్ఘాంతపోయారు.

"ఈ రోజు ఈవినింగ్ డ్యూటీ పడింది—అదీ కాకుండా ఏదో అర్జంట్ వర్కుంటే చేసి వెళ్ళమన్నాడు మానేజర్" అంది సుశీల ఆశ్చర్యంనుంచి తేరుకొని.

డ్యూటీ మాట వినగానే చల్ల



"ఏమండీ! ఈ రోజు చీరలు తెచ్చుకోవాలి! ఓ వంద రూపాయలు ఇచ్చిపోండి."
"అడిగేప్పుడు కొంచెమైనా జ్ఞానంవుండాలి. ఆఫీసుకు పోబోయేముందేనా నీకు తీరింది?"
"మీకు లేంది నా కెక్కడనుంచి వస్తుందీ!"

---

పడ్డాడు కుటుంబం. తొందరపడి అడిగినందుకు లోలోన బాధపడ్డాడు.

"పంతులు బుద్ధి పోనిచ్చావుకాదు. చిన్నపిల్ల నడిగినట్లు ఏమి టలా గదమాయిస్తావు? మూవా డీమధ్య కొత్తగా వచ్చిన పక్కింటి నూతన దంపతుల ప్రేమరసాన్ని చవిచూస్తున్నాడు. సుశీలా! తత్ఫలితమే ఈ చిరాకు, చింతాను. నీ వేం అనుకోకూ - అసలు సంగతది. ఇక వెళ్ళివస్తాను! చూడమ్మా, రేపు సండే పిక్నిక్ ఏర్పాటు చేశాను, మీ రిద్దరూ తప్పక రావాలి! ఏమంటారు?" అన్నాడు సుశీలవైపు తిరిగి భాస్కర్ ప్రశ్నార్థకంగా.

చూద్దాం. సండే ఇక మూడురోజు లుందిగా!" అంది సుశీల నవ్వుతూ.

భాస్కర్ సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

* * *

ఆ రాత్రి ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. భాస్కరం ఎదుట తనని అలా అడిగినందుకు సుశీల చాల బాధపడింది. తొందరపడి అడిగినందుకు కుటుంబం లోలోన బాధపడుతున్నప్పటికీ పైకి మాత్రం కోపం నటిస్తూ

గంభీరంగా ఉన్నాడు. 'సుశీల తనతో పాటు ఉద్యోగం చేస్తూ తనకంటే ఎక్కువే బాధ్యతలు నిర్వహిస్తున్నా తన భార్యగా, తనకు లొంగి ఉండాలి కదా ? తనేమన్నా పడాలి ! ఇప్పుడు కోపమొచ్చేటంత పెద్దమాట ఏమన్నా నని సుశీలకు అంత అభిమానం ? సుశీల పలకరించేవరకు తను మాట్లాడకూడ' దనుకొన్నాడు కుటుంబం.

'పగలంతా ఆఫీసులో కష్టపడి ఇంటికి రాగానే సానుభూతి చూపవలసిందిపోయి ఇంకా పైగా భాస్కర్ ముందు అవమానపర్చాడు. చిన్నపిల్ల నడిగినట్లు అడిగేసాడు. పోనీ ఎవరూ లేనప్పుడైతే పర్వాలేదు కాని ఒకరి ఎదుట భార్యని అలా చులకన చేసి మాట్లాడటం సమంజసంగా ఉందా ? తను కావాలని ఊసుపోకకు ఉద్యోగం చేస్తోందా ? భర్త అనుమతితోనే ఉద్యోగం చేస్తోంది ! సాయంత్రం కాగానే ఇంటికి రావాలని ఉండదా తనకు ? వారంటే బడిపంతులు గనుక నాల్గున్నరకి ఇంటికి రాగలరు. తనెట్లా రాగలదు ? వారే ఏదైనా ఆఫీసులో పని చేస్తూ ఆలశ్యంగా వస్తే అలా అడగ్గలదా తను ? అన్నిటిలో సమాన హక్కు లంటారు కాని ఆ బానిసత్వపు గుణం ఇంకా పూర్తిగా నశించలేదు. తప్పంతా తనదే ! ఇంకా పైగా మాట్లాడకుండా ఏడ మొఖం పెడ మొఖంగా ఉన్నారు. తనేం తక్కువ తిందా ? వారే ముందు పలకరించే వరకు తనసలు మాట్లాడకూడ' దనుకొంది సుశీల.

సుశీల ఇంట్లో అడుగు పెట్టిన సమయం ఎటువంటిదో ఏమో కాని ఆ రాత్రి ఇద్దరూ సాయంత్రం జరిగిన సంఘటనతో లోలోన చాల బాధ పడ్డారు. ఇద్దరికీ అభిమానం అడ్డు వచ్చింది. ఏం, తనూ సంపాదిస్తోం దిగా. కాస్త ఆలశ్యంగా రాకూడదా ? అని సుశీల, ఏం, తను భార్యగా తన కర్తవ్యాన్ని నేరవేర్చకూడదా ? భర్తకు కోపం వచ్చి ఏమన్నా అంటే అంత కోపంగా ఎందుకుండాలి ? భర్తంటే ఆమాత్రం గౌరవం లేదా ? అని కుటుంబం అనుకొన్నారు.

* * *

పాలవాడి కేకకి పాలగిన్నెతో బైటికొచ్చిన సుశీల పక్కంటి రాధను చూసి నిర్ఘాంతపోయింది. లక్ష్మి !.... వరలక్ష్మి ! .... ఆనాటి వరలక్ష్మి ! లోకుల, పోట్లతో గాయపడిన హృదయంతో తిరిగి వెళ్ళిపోయిన వరలక్ష్మి ! తన భర్తకూ తనకూ పునస్పర్ధలు కలగటానికి కారకురాలైన వరలక్ష్మి ! తోబుట్టువుకంటే ఎక్కువ ఆదరించిన వరలక్ష్మి ! మళ్ళీ ఈ ఊరు ఇంత పెద్ద హోదాలు గల భర్తతో వచ్చిందా ? మళ్ళీ ఆ లక్ష్మి తన సంసారంలో

అశాంతికి కారకురాలా ? సుశీల కళ్ళు చెమ్మగిల్లాయి. అంతా దేవుని మహిమ!

రాధను చూసిన సుశీల కళ్ళు 'గతాన్ని గుర్తుచేసుకో!' అంటూ సుశీల మనస్సును ప్రేరేపించాయి.

* * *

"సుశీలా ! నీ కెన్నిసార్లు చెప్పాను, ఇల్లు ఖాళీ చేయమని చెప్పమంటే విన్నావా ? నన్నసలు ఈ ఊళ్ళో తలెత్తుకొని తిరగనిస్తావా ?" అంటూ గదమాయించాడు కుటుంబం బడి నుంచి వస్తూ.

"అదేంటండీ ? అలా అంటారు !"

"అసలు—దాంతో ఏంటి నీకు—స్నేహం ? ఎంత చెప్పినా వినకుండా నీ మాట నీదే అంటావు."

"అదికాదండి, లక్ష్మి సాక్షాత్తు లక్ష్మే ? చాల మంచిది. లోకులంతా అలా అనుకొంటున్నారంటే నాకు చాల ఆశ్చర్యంగా ఉంది !"

"ఉంటుంది ? ఉంటుంది ? ఉండదు మరి. రేపు నిన్ను గురించి కూడా అలా అనుకొంటే నేనిం ఏ విషమో తీసుకొని చావవలసొస్తుంది."

"అబ్బబ్బా — ఊరుకోండి బాబు. ఏంటా మాటలు సంధ్యవేళ."

"అదికాదు సుశీల-చూడు, రోజుకు ఎంతమంది వస్తుంటారో ! అసలు మనకైనా బాగుంటుందంటావా ? వాళ్ళంతా అలా రావటం. వంటరిగా ఉంటూ ఉద్యోగంచేస్తున్న అమ్మాయి ఇంటికి రోజుకు పదిమంది వస్తూపోతూ ఉంటే లోకు లూరుకొంటారా ? చెప్పు ? మంచిదని నీ వంటావు. కాని అందరూ అనగలరా ?"

"ఏమండీ, పదిమంది వస్తే తప్పా? తెలిసినవాళ్ళుంటే రారా ?"

"అదిగో అదే వద్దనేది. తప్పో వొప్పో, చూసేవాళ్ళకది బాగుండదు. అంతా నన్నంటున్నారు అలాంటమ్మాయికి ఇల్లెలా ఇచ్చావయ్యా అని."

ఏమోనండి, ఏం లోకులో! ఎవరన్నా బాగుంటే చూడలేరు. చదువుకొని ఉద్యోగం చేస్తూ సుఖంగా కాలం గడిపేవాళ్ళని చూసి కన్నుకుట్టి ఏవేవో లేవదీస్తారు. పెళ్ళి చేసుకొని సంసార భారాన్ని మోయలేక బాధ పడుతున్నవాళ్ళని చూసి సానుభూతి చూపిస్తారు. ఈ లోకులే ఇంత. స్థిమితం లేనివాళ్ళు. దారం తెగేదాకా లాగి తెగిపోయాక అంతా చుట్టుచేరి సానుభూతితో పిచ్చిపిచ్చి సలహాలనిస్తారు."

"అదంతా సరేకాని రేపు ఫస్టున మన ఇల్లు ఖాళీ చేయమని చెప్పు. ఇంకెక్కడైనా చూసుకొంటుంది. లేదంటావా, నేనే చెప్పేస్తాను"

సుశీలమనస్సు బాణాలతో పొడిచినట్లైంది కుటుంబరావు మాటలు విని. ఏమిటి! ఇదీ ఒకసంఘమేనా ? చదువుకొని ఉద్యోగం చేస్తూ ఆడది వంటరిగా

ఉండటం తప్పా? అయినా లక్ష్మి ఇప్పు డంత తప్పుపని ఏం చేస్తుం దని! ఒంటరిగా ఉంటున్న ఒక అమ్మాయికి ఇల్లు అద్దె కివ్వటం కూడా తప్పా? అయినా ఇప్పు డీ సంగతి లక్ష్మితో ఎలా చెప్పేది. ఇల్లు ఖాళీ చేయమంటే ఎందు కని అడగదూ? పాపం ఒంటరిగా ఎక్కడికి పోతుంది? ఈ పరిస్థితిలో ఆమెకు ఇల్లెవరైనా ఇస్తారా? హాస్టల్లో ఆహారం సరిపడక ఈ ఇల్లు చూసుకొని ఉంటోంది. లక్ష్మికి ఈ నింద తగిందా? ఛీ....ఛీ....పాపం.

ఇంత మంచిలక్ష్మికి ఈ నిందేమిటి? దయామయి, ఎవరన్నా కష్టాల్లో ఉంటే చూస్తూ ఊరుకునే స్వభావం కాదు ఆమెది. ఆమె మంచితనాన్నీ, పరోపకారాన్నీ, చూసి ప్రతి ఒక్కరూ ఆర్థిక సహాయంకోసం వస్తుంటారు. ఆఫీసు ప్యూన్ దగ్గరనుంచి కజిన్ బ్రదర్ దాక లక్ష్మిదగ్గర సహాయం పొందే వారేకదా! ఇంతటి ఉదాత్తమైన స్వభావం గల లక్ష్మికి ఈ లోకుల నింద లేమిటి? మంచి చేస్తే చెడు ఎదురా? తన ఇంటికొస్తున్న ప్రతిఒక్కరిగురించి చెప్పుతుంది లక్ష్మి. అందులో ఒకటీ తనకు అసమంజసంగా కనిపించలేదే! ఈ ఊ రొస్తున్న ప్రతిఒక్కరినీ వాళ్ళ నాన్న మా అమ్మాయిని చూసిరం డని పంపిస్తాడట. అదీకాక లక్ష్మికి వాళ్ళ ఊరివాళ్ళుగాని చుట్టాలుగాని ఎక్కడైనా కనిపిస్తే చాలు 'మీ యింటి కొస్తాం ఎక్కడుంటారు?' అని అడుగు తారట! మరి అలాంటప్పుడు వద్దు మా యింటికి రావద్దని ఎవ రనగలరు! ఊరు చూస్తానికొచ్చిన వాళ్ళు, ఇంటర్వ్యూకొచ్చినవాళ్లుప్రతిఒక్కరూ వస్తుంటారు లక్ష్మిదగ్గరకు. చాలామంది చుట్టా లుండటంకూడా తప్పా?

లక్ష్మితో ఏమని చెప్పాలి? ఎలా చెప్పాలి? చెప్పకపోతే వారే చెప్పే స్తారట! అసలే ఆవేశ మెక్కువ ఈ మనిషికి. ఒకటికి రెండన్నారంటే నవ నీతంలాంటి లక్ష్మి హృదయం ఎంత గాయపడుతుంది?'' ఈ విధంగా ఆలో చిస్తూ సుశీల రాత్రంతా జాగారం చేస్తూ గడిపింది.

అతి కష్టం మీద తెల్లవారింది. రాత్రంతా నిద్రలేని కారణాన కళ్లన్నీ ఎఱ్ఱగా వాచిపోయి ఉన్నాయి. విధిగా గృహకృత్యములు నెరవేర్చి భర్తకు అన్నంపెట్టి బడికి పంపింది. ఆ రోజు శుక్రవారం! సుశీలకు ఏదో తప్పు చేస్తున్నట్లనిపించింది. తలంటు పోసు కొని పూజచేసిన పూలూ పండ్లూ తీసు కొని లక్ష్మిదగ్గరకు వెళ్ళింది.

''లక్ష్మి ఇవిగో ఈ పూలూ పండ్లూ తీసుకో'' అంది లక్ష్మికి పూ లందిస్తూ,

''అదేం టక్కా! మీ రేమో లక్ష్మి అంటారు. ఇంకొకరు వరాలూ, ఒకరు వరలక్ష్మి, నాన్నగారు వజ్రం అంటారు.

ఏమిటి అక్కా- అలాగున్నారేం? వంట్లో బాగుండలేదా? '' అంది వర లక్ష్మి పూ లందుకొంటూ నవ్వి.

''చూడమ్మా నీ కోమాట చెప్తాను. ఏమీ అనుకోవు కదూ?''

''ఏం అనుకొంటా నక్కా? నీ మాట కంటే నాకు ఎక్కువేముంది చెప్పు? నీ మాట ఎప్పుడైనా కాదన్నానా?" అంది లక్ష్మి సుశీలను చూస్తూ.

* * *

అంత ఉత్సాహంగా ఉండే లక్ష్మితో లోకుల నింద లన్నీ చెప్పి ఆమె ఉద్యో గాన్ని మాన్పించి ఈ ఊరునుంచి పంపింది తనే! శుక్రవారంనాడు లక్ష్మిని వెళ్ళిపొమ్మంది. అలాగే ఆ లక్ష్మితోపాటే తనింట్లో లక్ష్మికూడా పోయింది. ఏ ఇంట్లోనింఛైతే లక్ష్మిని పొమ్మందో ఆ ఇల్లే తననుంచి వేర యింది. అప్పులకింద ఆ ఇల్లుకాస్తా పోయింది. భర్త తెచ్చే డబ్బులు చాలక తనూ ఉద్యోగంలో చేరవలసివచ్చింది. లక్ష్మి వెళ్ళినప్పటినుంచీ తన జీవిత మే మారిపోయింది. ఎన్నటికీ మరపురాని ఆ నాటితో తన సంసారం తీరే మారి పోయింది. కలలోకూడా అనుకోలేదు, ఇన్ని కష్టాలొస్తాయని, తను ఉద్యోగం చేయవలసొస్తుందని? ఆనాడు పని రాని సలహా లిచ్చినవాళ్ళు ఈ నాడేం చేస్తున్నారు? కష్టాల్లో ఉంటే ఆదుకోగలిగారా? ఒక్క వందరూపా యలు అప్పు పుట్టాయా ఎక్కడైనా ఒకనాడు లోకులచేత నిందలు మోసిన లక్ష్మి ఇప్పుడు భర్తతో అదీ పెద్ద హోదాలోగల భర్తతో వస్తే ఎంత గౌరవం! పాలగిన్నెతో లోని కొస్తూ,

''ఏమండీ .... మన లక్ష్మేనండీ .... వరలక్ష్మి. అదే వరాలు.... రాధ — మన పక్కింట్లోని రాధ'' అంది సుశీల పండుంపుల్లతో ముఖం కడుక్కొంటున్న భర్త నుద్దేశించి

"ఆ .... ఆ .... లక్ష్మే .... రాధే.... వరలక్ష్మే ...'' అంటూ నోరు తెర్చి అలాగే ఉండిపోయాడు; తను నిర్మించు కొన్న వూహాసౌధంలోంచి రాధను ఎత్తి నేలకేసి కొట్టాడు కుటుంబం. రాధనుగురించి ఎంత గొప్పగా ఊహించాడు. ఆ రాధే అప్పటి లక్ష్మా?

నల్లగా దట్టంగా వ్యాపించిన మేఘాలు వర్షించి నిర్మలంగా ఉన్న ఆకాశంలాగుంది సుశీల మనస్సు. రాధనుగురించి చిత్రించుకొన్న రూపాన్ని చెరిపివేయటానికి అవస్త పడుతున్నాడు కుటుంబం.



ఆఫీసులో కాగితాలు తిరగేస్తున్నాను. ప్యూన్ లెటర్స్ తీసుకొచ్చి టేబిల్ మీద పెట్టాడు. చాలా భాగం ఆఫీసు పనిమీద వొచ్చినవే. ఒక రెండు మాత్రం పర్సనలు వుత్తరాలు. అందులో వొకటి తమ్ముడు శేఖర్ రాసింది. వుత్తరమంతా చదివాను కానీ అందులో నన్నాకర్షించిన భాగం మళ్ళా చదివాను.

"సుశీలా, పాపా ఇద్దరూకులాసాగానే వున్నారు. బారసాల బాగానే జరిగింది. చిన్నత్తయ్యావాళ్ళు వొచ్చారు. నువ్వూ వొదినా కూడా వుంటే చాలా బాగుండే దని చాలాసార్లు అనుకున్నాం. పాపకి అమ్మ పేరు కలిసివచ్చేటట్టు 'లక్ష్మీ అపర్ణ' అని పేరు పెట్టాను. బాబ్జీ కులాసా అనుకుంటాను. తిరుగు జవాబు వ్రాయి."

ఇట్లు
*శేఖర్*

'అపర్ణ!' ఒకటి రెండు సార్లు ఉచ్ఛరించాను ఆ పేరు. వాడి వుద్దేశ్య మేమిటి ఆ పేరు పెట్టటంలో. దాదాపుగా నేను అపర్ణ విషయం మరిచిపోయా ననే చెప్పాలి. అలాంటిది వీ డిప్పుడు ఆ పేరు పాపకు పెట్టటంతో నాకు అపర్ణ విషయ మంతా గుర్తొచ్చింది.

* * *

నేను కొత్తగా బి.ఇ. ప్యాసైన రోజులు. వుద్యోగం కోసం చూస్తున్నాను. భోపాల్ "హెవీ యెలక్ట్రికల్స్"కి ఇంజనీర్లు కావా లని పడ్డది. వెంటనే అప్లయి చేశాను. ఇంటర్వ్యూకి రమ్మని వచ్చింది. అమ్మ అయితే ఇంటర్వ్యూకి వెళ్ళేందుకు కూడా ఒప్పుకోలేదు. "అంత దూరం వుద్యోగాలు మన కెందు" కంది. కానీ నా కయితే ఆ వుద్యోగం మీదే వుంది. ఆ ఫ్యాక్టరీవాళ్ళు కొంతమందిని ఇంగ్లాండు ట్రైనింగ్‌కి వాళ్ళ ఖర్చుమీదే పంపిస్తా రని కూడా విన్నాను. నాన్న కూడా నా వుద్దేశ్యాన్నే బలపరుస్తూ, అయినా ఆ వుద్యోగం వచ్చినప్పటి సంగతి కదా! ఇంటర్వ్యూకి వెళ్ళిరానీ" అన్నారు.

ఇంటర్వ్యూ బాగానే జరిగింది. వుద్యోగం కూడా వచ్చింది. సరే ఇక అమ్మ ఏ మనలేక మాతో రాజీకి వస్తూ నేను పెళ్ళి చేసుకుని భార్యను కూడా వెంట తీసుకు వెళ్తేనే కానీ ఒప్పుకో నన్నది. నాకు కూడా అభ్యంతరం ఏమీ లేదు భార్యను వెంటబెట్టుకుని ఝామ్మని తిరగా లనే వున్నది నాకూ. అందుకే అభ్యంతరం పెట్టకుండా ఒప్పుకున్నాను. అప్పుడు చూసిన పెళ్ళికూతుళ్ళలో ఈ అపర్ణ ఒకామె. అప్పటికే పెళ్ళికూతుళ్ళని కొంతమందిని చూచినా, కట్నాలు బాగానే ఇస్తా మన్నా, నాకూ, అమ్మకూ ఒక్కమ్మాయి కూడా నచ్చ లేదు. నాన్నకూ ఇంక విసుగుపుట్టింది.

ఒకరోజు పొద్దున్నే నాన్నా నేనూ పేపర్లు చూస్తూ ఏదో మాట్లాడుతున్నాము. ఇంతలో ఎవరో ఒకాయన లోపలకు





పెట్టారు. రామావధాన్లుగారి మాటల్లో అబద్ధంలేదు. మనిషి చాలా చక్కగా, ఆకర్షణీయంగా వుంది. రంగు మాత్రం చామన ఛాయ నేను సంతృప్తి పడ్డాననే చెప్పాలి.

రామావధాన్లుగారు నన్ను చూస్తూ "నువ్వేమైనా అడుగు బాబూ" అన్నారు.

నాకైతే ఏ మడగాలో తోచలేదు. కానీ ఏదో ఒకటి అడగాలని "మీ పేరు ఏమిటి ?" అన్నాను

"అపర్ణ"

ఆ కమ్మనికంఠం వింటూ, ఆ ఆకర్షణీయమైన మొహం చూస్తూ జీవితమంతా ఇలాగే గడిపితే _ గుండె ఝల్లుమంది.

"నువ్వేమైనా అడిగితే అడుగమ్మా" అన్నారు రామావధాన్లుగారు.

నాన్న 'ఆడపిల్ల అడిగేదేమిటి' అన్నట్లు ఆశ్చర్యంగా చూడటం నేను గమనించక పోలేదు. అయినా ఏ మడుగుతోందో అని నేనూ కుతూహలంగా చూస్తున్నాను.

"కట్నం అంటే మీ అభిప్రాయం ఏమిటీ ?'' అంది.

నాకు షాక్ తిన్నట్లు అయింది. మరొక క్షణంలో నేనే కాదు అందరూ అదే స్థితిలో వున్నారని గమనించాను. అవధాన్లుగారు నోరు తెరచి అది మూయ్యటం గూడా మర్చిపోయాడు. నాకైతే ఏం చెప్పాలో తోచలేదు. అసలు నేను కట్నం గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. హృదయాలిచ్చిపుచ్చుకోటం చిన్నవాళ్ళ పనసీ, కట్నాలూ అవీ పెద్దవాళ్ళ పనసీ నా అభిప్రాయం. ఇంతలో ఆ అమ్మాయే "కట్నాన్ని ఆడపిల్లలో లోపాల్ని భర్తీ

చేయటానికి ఇష్టా రంటే మీ కేమైనా అభ్యంతరమా ?" అంది.

ఇంతలో ఆ అమ్మాయితల్లి తేరుకుని "అపర్ణా'' అని కేకేసింది. ఇక నోరు ముయ్యి మన్న భావంతో. ఆ అమ్మాయి తలవంచుకుంది.

నా కయితే ఆ అమ్మాయి కట్నం విషయం ఎందు కెత్తిందో, దాని అర్థ మేమిటో నా కర్థంకాలేదు. తెలుసుకోవా లన్న కుతూహలంతో ''ఫర్వా లేదు, అడగనివ్వండి"అన్నాను. అమ్మా, నాన్నా నా వైపు ఆశ్చర్యంగా చూశారు. ఆ అమ్మాయి కళ్ళు ఇంకా పెద్దవి చేసి ఆశ్చ ర్యంగా నావైపు చూసింది. "నా కేమీ అభ్యంతరం లే"దన్నాను.

"అయితే నాలో లోపమేమిటో చెప్ప గలరా?" మనిషి చక్కగా వుంది. నా కే లోపము కనబడలేదు; పెద్ద చదువు చద వక పోవటం తప్ప. అమాటే అన్నాను.

"మీకు వంట వచ్చా" అంది ఆ అమ్మాయి.

నే నులిక్కిపడి "ఊహుఁ'' అన్నాను.

ఆ అమ్మాయి గంభీరంగా "మీకువంట రాదు, నాకు పెద్దచదువులు రావు. సరి పోయింది. నాలో ఇంక ఏలోపం లేదను కుంటాను. మరి మీకు కుట్లు, అల్లికలు వచ్చా ?''

నా కయితే అక్కడ్నించీ అ క్షణాన పారి పోతే బాగుండు ననిపించింది. ఆ అమ్మాయితల్లి కోప్పడినప్పుడు వూరు కొన్నా పోయేది అనుకొన్నాను. అవ మానంతో నోటితో చెప్పలేక తల అడ్డంగా తిప్పాను.

''అయితే మీరు నాకు కట్నం ఇవ్వ గలరా ?" అవమానంతో నా తల వంగి పోయింది ''బాగుందండీ" అంటూ నాన్న లేచి నుంచున్నారు. నాన్నను చూసి నేనూ, అమ్మా లేచాము. నా కంతా ఏమిటో గందరగోళంగా వుంది. తల ఎత్తలేక పోయాను. నాన్న అన్నారు ''ఇంక మా అభిప్రాయం ఏం చెప్పాల్సిందిలేదు. మాకు ఇష్టంలేదు."

కృష్ణమూర్తిగారు ప్రాధేయ పడే ధోరణిలో "ఏదో చిన్నపిల్ల తెలియక అలా అంది. నేను కోప్పడుతాను లెండి" అన్నాడు.

నాన్న విదిలించుకుంటూ "ఏమీ చెప్పక్కర్లేదండీ" అంటూ బయటికి వచ్చారు. అమ్మని ఆవిడ ఏమిటో ప్రతి మాలుతోంది. అపర్ణ నీళ్ళు నిండిన కళ్ళతో గబగబా ఇంట్లోకి వెళ్ళిపోయింది. నా కే...టోగా వుంది. నేనూ, అమ్మా బయటికి వచ్చాం ఇంటిదాకా ఎలా వచ్చామో నాకు తెలీదు. వెళ్ళిపోయి నా గదిలో పడ్డాను. ఆ అమ్మాయి అడిగిన "మీరు కట్నం ఇవ్వగలరా ?" అన్న ప్రశ్నే నా చెవుల్లో మ్రోగుతోంది. న్యాయంగా ఆలోచిస్తే ఆ అమ్మాయి అన్నదాన్లో తప్పేమీ కనిపించలేదు.



"ఇప్పుడు షూటింగులో కీచుకీచుమంటూ పారిపోయే ఎలుకను తరుముకొంటూ పచ్చినపిల్లి మ్యావ్‌మ్యావ్‌మని గట్టిగా అరుస్తుంది. కుక్క భౌభౌమంటూ మొరుగుతుంది. ఆ తర్వాత ఒకగాడిద ఓండ్రపెడుతుంది. ఆ తర్వాత ఇదంతా వింటున్న శాపంవల్ల కోతిగా మారిపోయిన కథానాయిక కిచకిచలాడుతూ కుప్పిగంతులు వేస్తుంటే కథానాయకుడు దాన్ని ఉచ్చువేసి పట్టుకుంటాడు... అవి ఎలాగ అరుస్తాయో, ఎలాగ రికార్డు అవుతాయో సందేహంగా ఉంది......"

"ఓష్! దాని కేముందండి! వాటిచేత ఎలాగో నోరు తెరిపిస్తేచాలు, మన ప్లేబ్యాక్ గాయకశిరోమణి శతకంఠంగా రున్నారుగా, వాటికూడా వారే చూసుకుంటార్లెండి!"

కత్తిమీద సాములాంటి బ్రతుకు కల్గిన ఒక తెలుగింటి ఆడపడచు అంత ధైర్యంగా వాదించగలదని సురెప్పవైనా అంటే కొయ్యకోయ్ అనేవాడిని. కానీ నా కళ్ళతో చూసి, చెవులతో విన్న దాన్ని అబద్ధమని ఎలా అనగలను. ఆ అమ్మాయి ఆ వాగ్ధాటికి — ఇప్పుడు ముచ్చటా వేస్తోంది, భయమూ వేస్తోంది. ఒకవేళ పెళ్ళి చేసుకున్నా ప్రతిదానికీ ఇలాగే వాదిస్తుంటే ఎలాగా అనుకున్నాను. అయినా అమ్మా నాన్నా ఒప్పుకోరు. నేను వాళ్ళని ఎదిరించలేను కానీ నా నిర్ణయం తప్పేమో అనిపించకపోలేదు. ఆడవాళ్ళు ముందుకు రారు, రారు అనటమే కానీ, వాళ్ళు ముందుకు వస్తే సహించగల మంచితనం మన ఆంధ్రుల్లో లేదేమో అనిపించింది

మర్నాడు పొద్దున కాఫీ తీస్తునేటప్పుడు నాన్న అన్నారు. "ఎందుకయినా మంచిది. మన కాపిల్లవద్దని

కార్డు రాసి పడేసెయి" అని. అప్పుడే లోపలికి వస్తున్న శేఖరం "ఏ పిల్ల,ఏమిటి సంగతి" అనడిగాడు. నాన్నని ఇంతలో ఎవరో పిలవటంతో ఆయన వాకిట్లోకి వెళ్ళారు.

అమ్మ అంతా చెప్పి "ఎలాంటి వింతలో చూడు. ఒక ఆడపిల్ల అలా విరగబడి అడగడ మేమిటి?" అంది.

శేఖరం నెమ్మదిగా "ఆ అమ్మాయి అన్నదానిలో తప్పేమీ లేదమ్మా. లేక పోతే ఇంకా ఈ రోజుల్లో కట్నా లేమి టమ్మా. అంత కట్టుబాట్లలో పెరిగిన ఒక ఆడపిల్ల అలా మాట్లాడిందంటే దాని వెనక ఎంత కథ ఉండిపుంటుందో ఏమైనా ఆలోచించావా అమ్మా. తన కోసం తండ్రి ఆ వున్న ఒక్క ఇల్లు అమ్మేస్తే మిగతా పిల్లల గతేమిటని తన అదృష్టాన్ని పరీక్షకి పెట్టి వుంటుంది అమ్మా. అయితే ఆ అమ్మాయి ఓడి పోయా ననుకుంటుందేమో. కాదమ్మా. ఆ అమ్మాయి ఓడిపోలేదు. అంతగా ఆ అమ్మాయిని చేసుకోవడం అన్నయ్య కిష్టం లేకపోతే నేను చేసుకుంటాను. బయల్దేరిన చైతన్యాన్ని మొగ్గలోనే తుంచకూడదమ్మా. పాపం! ఆ అమ్మా యిని ఎంత కోప్పడుతున్నారో ఇంట్లో" అన్నాడు.

నేను ఆశ్చర్యంగా విన్నాను. వాడి ముందు తలెత్తుకోలేకపోయాను. అమ్మ ఏదో అనబోయే లోపలే గబగబా నాన్న లోపలికొచ్చి ఖంగారుగా "ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందిట బావిలో పడి. మా ఫ్రెండు చెప్పాడు. అతను గుంటూ రులో ఆ పేటలోనే వుంటున్నాడు." అన్నారు.

నేను నిశ్చేష్టుడనై అలాగే నిల బడ్డాను.

శేఖరం కోపంతో మా అందరివైపు చూస్తూ "మీరే ఆ అమ్మాయిని చంపారు. ఛీ! ఛీ!" అని వెళ్ళి పోతుంటే నాన్న నిర్ఘాంతపోయారు.

తర్వాత నా పెళ్ళి శంకరితో అయి నే భోపాల్ రావడం జరిగిపోయింది.

శేఖరం పెళ్ళిమాత్రం అమ్మా నాన్నా వద్దంటున్నా తండ్రిలేని ఒక పేదమ్మా యైన రజనితో జరిగింది. ఇప్పుడు అమ్మా నాన్నా వాడితోనే ఉంటున్నారు. అప్పుడు ధైర్యంగా అపర్ణని చేసుకొని వుంటే అంత ఘోరం జరిగేది కాదు. కానీ...

* * *

"సార్" అన్న ప్యూన్ పిలుపుతో ఈ లోకంలో కొచ్చి గబగబా ఓ కార్డు తీసుకొని "చాలా మంచిపని చేశావ్" అని దానిమీద గీకేసి ప్యూన్‌కిచ్చి ముందు పోస్ట్‌లో వెయ్యమన్నాను. వాడు వెళ్లి పోతూ గబగబా బైటికి వెళ్ళాడు.






రాచకొండ
రంగనాధశర్మ

సాయంత్రం....

ఆరుగంటలు కొట్టింది గోడగడియారం.

చీకటి తన పనిగా మూలమూలలా అలుముకుంటోంది. గుడిసెల్లో గుడ్డిదీపాలు ... మేడల్లో మెర్క్యురీ దీపాలు....చీకటిని నెట్టివేయడానికి ప్రయత్నిస్తున్నాయ్....బజారు చేరడానికి కొంతమంది వెళ్తూ....దారిలో కనిపించిన మిత్రుల్తో కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి తమ దారిన తాము వెళ్ళిపోతున్నారు....

ఎంతో మంది....వచ్చేవాళ్ళు....వెళ్ళేవాళ్ళు.

శ్రీపతి యింకా యింటికి చేరలేదు. వీధి గుమ్మంలో పావుగంట సేపు నిల్చుని విసుగెత్తి లోపలి కెళ్ళబోయిన శ్రీపతి శ్రీమతి విశాల సుపరిచిత కంఠం విని ఆగి వెనుదిరిగింది. అనూరాధ రిక్షాలోంచి దిగుతోంది.

'రా, అనూరాధా; ఏమి టింత అకస్మాత్తుగా యిలా ఊడిపడ్డావ్ ?'

'మొదటి ప్రశ్న యిదా అడిగావ్ ? సరేలే: నేను యీ ఊళ్లో ఉద్యోగం వెలిగించబోతున్నా తెలుసా ? రిక్షావా డిచ్చిన చిల్లరను ప్లాస్టిక్ బాగ్ లో వఉ వేసుకుంటూ అంది అనూరాధ.

'అనూరాదా' ఆశ్చర్యపడింది విశాల.

'ఎందు కలా ఆశ్చర్య పడతావ్ ? మొదట్లో నేను ఉద్యోగం చెయ్యటాని కాయన ససేమిరా ఒప్పుకోలేదు.... కాని యిప్పుడు తప్పనిస రయింది.'

'ఏం ? ఆయన ఉద్యోగం మానే సారా ?'

'ఆయ నెందుకు మానేస్తారు ?'

'మరి ?'

'నాతో కాపురం చేయట మే మానేశారు' తేలికగా నవ్వింది అనూరాధ.

'అనూరాధా: అయితే ?....'

'వాళ్ళ బుద్ధి చూపించుకున్నా రంతే: తరతరాలుగా మనం బానిసల మనే వాళ్ళ ఊహా యింకా వారసత్వం కావాలని కోరుకునే మగవాళ్లు చేసే పన్లింతేలే' రుమాలుతో ముఖం అద్దుకుంది.

'అంటే ?'

'అంటే : అదే: అనుమానాలతో అభాండాలు వేస్తూ ఆడదాని జీవితం అంధకారం చెయ్యటానికి, గుండెల మీద చెయ్యి వేసుకుని....దూరం ఆలోచించి, అవగాహన చేసుకొనే సంస్కార వంతు లెవరో తప్పితే....కనుచూపు దాటని ఊహాశక్తి గలవాళ్ళెవరూ వెనుదియ్యరు .... అందుకే మొదట్నుంచీ నాకు పెళ్ళంటే ఒక మంచి ఉద్దేశ్యం అంటూ లేదు....పద, లోపల కెళ్ళి కూర్చుందాం' అనూరాధ దారి తీసింది.

యిద్దరూ హాల్లో టేబులు ముందున్న కుర్చీల్లో ఒకరి పక్కన ఒకరు కూర్చున్నారు.

అనూరాధే తిరిగి మొదలెట్టింది. 'కల్మషం తెలియని పసిపిల్లలు చేస్తారే, బొమ్మల పెళ్ళిళ్ళు....అవే నయం.... యే అభాండాలకూ గురి కాకుండా... ఎవరి స్వార్థాలకూ బలి కాకుండా నిశ్చింతగా ఉంటాయ్ ఆ దంపతుల జంటలు.'

'నాకేం అర్థం కావటం లేదు' తలాతోకాలేని అనూరాధ సంభాషణ ల్లోని అర్థం తెల్సుకోలేకపోయింది విశాల.

'ప్రాణంలేని ఆ బొమ్మల్లో లేని లక్షణాలన్నీ ప్రాణం ఉన్న మన యీ బొమ్మల్లో సలక్షణంగా ఉంటాయ్.'

నవ్వింది విశాల అనూరాధ మాటలకు.

'నవ్వులాట కాదు విశాలా! మానవుడు దేన్నో అందుకోవాలని ఆశించి, అవకాశం ఉన్నా ఆత్మస్థయిర్యం లేక, అందుబాటులో ఉన్నా పొందలేక మెదడుదాటని భావాలతో చివరికెంత హీనస్థితికి దిగజారిపోతాడో అనూహ్యం' ఆవేశంగా అన్న అనూరాధ మాటలు మరీ ఆశ్చర్యపర్చాయి విశాలను.

'ఔను విశాలా! జీవితాలతో చెలగాటం కొందరికి సరదా — తమ సరదాల వెనుక కూలిపోయే సంసారాల గురించి ఆలోచించలేరు. వాళ్ళు.... తమ స్వార్థం జయించకపోతే....తన స్వార్థానికి పరాజయం సిద్ధించటానికి కారణం వారే అయిఉండికూడా .... లోకంమీద విరుచుకుపడతారు? పక్వం చెందని పశుహృదయులు పగిలిపోయే గుండెల్ని చూసి పళ్ళికిలిస్తారు. హృదయదౌర్బల్యాన్ని పరదాలక్రింద దాచే ప్రయత్నం చేస్తారు — ఫలితాలు దుర్భరం — అది వాళ్ళకానందం .... గౌరవం అనుకుంటారు వాళ్ళు.'

'అసలేం జరిగింది అనూరాధా?'

ఎటూ ఓ నిర్ణయానికి రాలేక సతమతమౌతోంది విశాల.

'స్నేహాన్ని చులకనగా తీసుకుని ఆడది ఆటబొమ్మనే ఉద్దేశ్యంతో ప్రవర్తించటం కేవలం పశుత్వం కాక మరేమిటి? కల్సి చదువుకున్నాం - స్నేహంగా తిరిగాం - తర్వాత విడిపోయాం. మనోవాక్కాయ కర్మలా మా మనోనిగ్రహాన్ని పరీక్షించుకోవల్సిన విపరీత పరిస్థితుల్లో యేనాడూ చిక్కుకోలేదు. కల్సి ఉన్నంతకాలం- కాని, మా నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ కావటంతో తప్పనిసరిగా ఆఊరు వదలి వెళ్ళవల్సివచ్చింది. అతను ఎడ్రస్ అడిగాడు .... యిచ్చాను .... ఆర్నెల్ల తర్వాత అతనిదగ్గర్నుంచి నాకో ఉత్తరం వచ్చింది-అప్పుడుగాని నాకు హృదయాలకుకూడా పైన ఒక బంగారపు పొర అంటించుకుని స్నేహాన్నభిలషించే సహృదయులుంటారని అర్థంకాలేదు.'

'ఏమని వ్రాశాడు?' విశాలలో ఆతృత హెచ్చింది.

'ఏమని వ్రాస్తేనేం? స్నేహితుడిగా మరొక వ్యక్తికి వ్రాసే సంగతులు నాకొక్కటీ అందులో కన్పించలేదు. హృదయాల్ని పరస్పరం అర్పించుకున్న ప్రేయసీప్రియులు వ్రాసుకునే ఉత్తరంలా ఉంది. యెలాంటి పరిస్థి

తుల్లో అత నా ఉత్తరం వ్రాసినా నా కనవసరం....అసహ్యంకూడా.'

'అయితే నువ్వేమయినా జవాబిచ్చావా?' విశాల అనూరాధ ముఖంలోకి చూస్తూ అడిగింది.

'నేనేం జవాబు వ్రాయలేదు. కాని మరో ఉద్దేశ్యం కూడ కలిగినమాట వాస్తవం. అత నెంతవరకూ నన్ను కోరడంలో నిలబడగల్గుతాడో తెల్సుకోవా లని.'

'యేం చేశా వయితే నువ్వు?'

'తదనంతరం మేం కల్సుకున్నాం ఓ నాడు .... నన్ను చూసి కంగారు పడ్డాడు....ముఖతః మాట్లాడలేనివాళ్లు ఉత్తరాల్లో 'సోదె' వెళ్ళబోస్తారు. అది మానవనైజం .... అయినప్పటికీ అడిగాను - అతని హృదయాన్ని పరీక్షించాను. అతను ఓడిపోయాడు - నన్ను పెళ్ళిచేసుకోలేనన్నాడనే నాకు జ్ఞాపకం. మా యెడబాటు సహించలేని



వ్యక్తి ఏ దృక్పథంతో నాకు ఉత్తరం వ్రాసినట్టు? కేవలం ప్రకృతిచర్యల ప్రభావాలకు నన్నొక ప్రతిమగా నిల బెట్టాలనే ఉద్దేశ్యంతో అతను నా హృద యానికీ .... చివరకు నా స్నేహానికి దూర మయ్యాడు....కాని కాచిఉండి పోటు పొడిచే నాగని తెల్సుకోలేక పోయాను. మా భార్యాభర్తల అను రాగాల పంటమధ్య 'అగ్గిపు'ల్లయ్యాడు. ఫలితంగా ఆ కార్చిచ్చు ఎదురుదెబ్బ కొడితేగాని మనుష్యుల్లో మానవత్వ మనేది మేల్కోదు – యేది యేమయి నప్పటికీ దాని ఫలితం ఒక్కటే నా ఉద్యోగా న్వేషణ. నాతో ఆయన సంబంధం త్రెంచుకున్నారు. అనూ రాధ ముఖంలో విషాదం గూడు కట్టుకుంది.

విశాలకూడా బాధపడింది. యెలా సానుభూతిని సరఫరా చెయ్యాలా అని ఆలోచిస్తూంది

'ఏమి టా లో చి స్తు న్నా వ్ విశాలా?

'నీ గురించే

నవ్వింది అనూరాధ– ఆలోచించా ల్సిన అవసరం కొనితెచ్చుకోవటం యెందుకు? అవన్నీ పీడకలల్లా మర్చిపో గల్గిన్నాడు యే ఆలోచనలకూ తా వుండదు మాటల్లో నిర్లక్ష్యం ముఖంలో నిర్లిప్తతా అర్థంకాలేదు విశాలకు.



'సమ్మెట దెబ్బలకు సవాల్ చేసే హృదయాన్నిచ్చాడామెకు..లేకపోతే యిలాటి విద్యుద్ఘాతాని కెలా తట్టుకోగల్గిందామె.' విశాల మనస్సు గొణిగింది....హృదయం తేలికపడింది.

'వెళ్ళొస్తా విశాలా' అనూరాధ లేచింది.

'అదేమిటి, యెక్కడి కెళ్తావ్.... రాత్రి యిక్కడుండిపో' విశాల బలవంతంచేసింది.

'లేదు-ఈ వీధికొసని మా మేనత్తగారున్నారు - అక్కడకు వెళ్లిపోతాను. రేపు వస్తాలే.'

విశాల యింట్లోకెళ్ళి కుంకుమ తెచ్చి తను బొట్టు పెట్టుకుని అనూరాధకు బొట్టుపెట్టింది.

అనూరాధ అదోలా నవ్వింది.

'ఇది మన సాంప్రదాయం - మనం యెంతగా మారిపోయినా సాంప్రదాయాల్ని మాత్రం మార్చ సాహసించ కూడదు.'

'పందొమ్మిదివందల అరవై మూడో సంవత్సరపు సీతమ్మవారు' మనసులోనే అనుకుంది అనూరాధ.

ఇద్దరూ వీధి గుమ్మంలోకి వచ్చేసరికి విశాల భర్త శ్రీపతి యెదురయ్యాడు....

అనూరాధ....తలెత్తిచూసి గతుక్కుమంది.

శ్రీపతి అనూరాధను చూసి ఉలిక్కిపడ్డాడు.

'మా వారు' పరిచయం చేసింది విశాల.

'నమస్తే' అప్రయత్నంగా చేతులు జోడించింది అనూరాధ.

'అనూరాధ-నా స్నేహితురాలు.'

'నమస్తే' శ్రీపతి ముఖం మాడిపోయింది.

'వస్తా' అనూరాధ గబగబ వెళ్ళిపోయింది. విశాల అయోమయంగా చూసింది.

శ్రీపతి అనూరాధ వెళ్ళిన వైపే చూస్తూ ముఖంలో మార్తున్న రంగులు గుర్తిస్తుందేమో విశాలని గదిలోకి వెళ్ళిపోయాడు. శ్రీపతి హృదయం రకరకాల ఆలోచనలతో నిండిపోయింది.

విశాల ఇంట్లోకి వెళ్ళబోతూండగా హాల్లో టేబుల్ మీద ప్లాస్టిక్ బాగ్ కన్పించింది. 'మర్చిపోయింది అనూరాధ' అనుకుని తీసి జాగ్రత్త చేసింది. విశాల గదిలో అడుగు పెడుతూండగానే అడిగాడు శ్రీపతి 'అనూరాధేం యిలా వచ్చింది.'

'అనూరాధ మీకు తెలుసా?'

ఆశ్చర్యపోయింది విశాల.

శ్రీపతి జవాబివ్వలేదు.

'కలిసి చదువుకున్నారా?'

తృళ్ళిపడ్డాడు శ్రీపతి....

'అయితే మీకు బాగా తెలుసన్న మాట.'

'విశాలా, ఇంటికొచ్చినవాళ్ళంతా నాకు తెల్సినవారైనట్టు మాట్లాడుతావేం!' విసుక్కున్నాడు శ్రీపతి.

విశాల యింకేమీ మాట్లాడలేదు. ఫ్లాస్కులోంచి కాఫీ కప్పులో పోసి అందించింది.

మౌనంగా త్రాగేసి కప్పు అక్కడ పెట్టి లేచాడు.

'బయటి కెళ్తున్నారా ?'

'ఊఁ'

'రావటం ఆలస్యం అవుతుందా ?'

'చెప్ప లేను. నువ్వు భోజనం చేసెయ్. నాకోసం చూడకు' గబగబ వీధిలోకి నడిచాడు శ్రీపతి.

విశాలకు భర్త ప్రవర్తన యేమిటో అర్థం కాలేదు. రకరకాలుగా పరుగు లెత్తుతున్న ఆలోచన్లకు ఒక అంతంటూ కన్పించలేదు. అనూరాధ గుర్తు కొచ్చింది. 'పాపం' అనుకుంది. ఆఫీసు నించి యింటి కొచ్చి యిల్లు కదలని భర్త యీ రోజు యింత చీకటిపడ్డాక బయట కెందు కెళ్లారో ఊహించలేక పోయింది విశాల .... ఒంటరితనంలో ఆలోచనలు జంటలుజంటలుగా వస్తూనే ఉంటాయ్. అనూరాధ మర్చిపోయిన ప్లాస్టిక్ బాగ్ తెరిచింది. ఐదు పది రూపాయల నోట్లు....కొంత చిల్లర ఉన్నాయ్ ... మరో రెండు యేవో కాగితా లున్నాయ్. తెరిచింది. క్రింద సంతకం చూసి గతుక్కుమంది. వణుకుతున్న చేతుల్తో... పెదవుల్తో....గబగబ ఆద్యంతం చదివింది. మిన్నువిరిగి తల మీద పడినట్టయింది. యథాప్రకారం కాగితా లందులో పెట్టేసి నీరసంగా కుర్చీలో వాలిపోయింది విశాల.

ప్రపంచం అంతా తలక్రిందులైనట్లు భయపడింది—'మా భార్యాభర్తల అనురాగాలపంట మధ్య అగ్గిపుల్ల' .... అనూరాధ మాటలు విశాల చెవుల్ని బ్రద్దలు చేశాయ్ .... కెరటాల్లాంటి ఆలోచనలు తరిగే దెప్పుడో మరి!

ఆ రాత్రి చాలా పొద్దుపోయేక యింటికి వచ్చాడు శ్రీపతి - ముఖం అంతా పీక్కుపోయినట్లు ఉంది-కళ్ళు ఎర్రగా ఉన్నాయ్.

విశాల మామూలు ధోరణిలో అడిగింది 'భోజనానికి వస్తారా ?'

'ఆకలిగా లేదు - కాస్త మజ్జిగ పట్టుకురా.'

విశాల తెచ్చి యిచ్చింది. 'అలాగున్నా రేం ?'

మజ్జిగ త్రాగేసి గ్లాసు క్రింద పెడుతూ 'ఎలా ఉన్నాను ?'

'చాలా నీరసంగా ఉన్నారు—కొద్దిగా అన్నం తినండి - మంచివారు కదూ' లాలించబోయింది విశాల.

'చెప్తే నీకర్థం కాదూ, నన్నా ట్టే విసిగించక పెళ్ళిపడుకు.'

'యెందు కంత కోపం?'

తీవ్రంగా విశాల ముఖంలోకి చూసి తిరిగి తల తిప్పేసుకున్నాడు.

విశాల యేదో అడగబోయింది. కాని ధైర్యం చాలలేదు .... వెళ్ళి వాకిట్లో యీజీఛైర్లో కూర్చుంది.

శ్రీపతి కిటికీలోంచి ఆకాశంలోకి చూస్తున్నాడు. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయ్ .... అక్కడక్కడ చిన్నచిన్న మబ్బుతునకలు....చిన్నగా గాలివేస్తోంది. శ్రీపతిలో పెనుతుఫానేదో చెలరేగుతోంది. ఆలోచనల కో హద్దంటూ లేకుండగా గజిబిజిగా బుర్రలో పట్టీలుకొడ్తున్నాయ్. 'యింటికొచ్చినవాళ్ళంతా నాకు తెల్సినవారైనట్టు మాట్లాడతావేం?' తన మాటలు తన చెవులచుట్టూ చక్కర్లు కొడుతున్నాయ్-తను అబద్ధమాడేడు. అనూరాధను తన కెప్పట్నుంచో తెల్సు. కాని విశాలముందా విషయాన్నెలా ఒప్పుకోగలడు తను? వర్తమానాన్ని అదిమిపట్టి గతం పైకి ఉబికింది.

బి.ఎ. వరకూ అనూరాధా తను కలిసి చదువుకున్నారు - అదీ ఇంటర్‌లో తను ప్రవేశించేకే అనూరాధతో పరిచయమైంది. ఇద్దరూ ఒకింట్లోనే ఉండేవారు. అనూరాధకు తల్లిలేదు-తండ్రి ఎలక్ట్రికల్ డిపార్ట్‌మెంటులో అకౌంటెంటుగా ఉండేవాడు - అనూరాధకు మరో యిద్దరు తమ్ముళ్ళుండేవారు. పెద్దవాడు విశ్వం .... రణపెంకి .... రెండోవాడు నగేష్‌బాబు. అమాయకుడు....అనూరాధ తండ్రికి ఆ యిద్దరు కుర్రాళ్ళూ రెండు కళ్ళు .... అనూరాధ అతని హృదయమే - ఆయనకూడా చాలా సహృదయతగా మాట్లాడేవాడు .... ఆయ నెన్నో విషయాలమీద మాట్లాడే మాటలు నిజానికి బాగాఅందుబాటులో ఉండేవి. ఆయనకు సాముద్రికంగూడా తెల్సని నల్లురైదుగు రనగా తను విన్నాడు. చదరంగం బాగా ఆడుతాడని....దిట్టమైన చెయ్యనికూడా తను విన్నాడు....తనని యెంతో ఆప్యాయంగా పలకరించి నాటి విద్యావిధానాల్లో చేయవల్సిన మార్పులూ .... విద్యార్థుల కందరికీ ఉన్నతవిద్య నభ్యశించటానికి ప్రభుత్వం ఎలా ఏర్పాటు చేస్తే బాగుంటుందో .... అన్నీ వివరించేవారు - ఆత్మవిశ్వాసంతో చేసే యేకృషికైనా ఫలితం అనుకున్న దానికి పదింతలు పొందగల మన్నారు. ఆయన మాటలు యింకా యింకా వినాలని ఉండేది-తర్వాత సినిమాలు-నాటకాలు .... జానపదగేయాలు .... ఎన్నిటిగురించో మాట్లాడేవారు-అనూరాధకూడా తనతో యెంతో చనువుగా మాట్లాడేది. యిద్దరు వివిధ విషయాల్లో వాదించుకునేవారు -



"నీకు పుణ్య ముంటుంది. కుర్రవాడిముందు నా తల పగలగొట్టవద్దు. వాడు బుర్రలోపల చూశా డంటే మర్యాద దక్కదు."

యెప్పుడూ అనూరాధే గెలిచేది - అయినా హృదయాల్లో ఏ యీర్ష్యా సూయలు ప్రవేశించినట్టు తనకుజ్ఞాపకం లేదు....తనకు అనూరాధ కన్పించక పోతే యెంతో దిగులుగా ఉండేది. అనూరాధ స్వరూపాన్ని తప్పిస్తే దేంట్లోనూ దేన్నీ చూడలేకపోయాడు తను. ఫైనల్ ఇయర్‌లో ఉండగానే అనూరాధ తండ్రికి విజయవాడ ట్రాన్స్‌ఫర్ అయింది.

తర్వాత రెండు మాసాలవరకు అనూరాధ....విశ్వం...నగేష్‌బాబు....తనూ కల్సేఉన్నారు. పరీక్షలనంతరం అనూరాధ తన తమ్ముళ్ళతో విజయవాడ బయల్దేరింది. తను ఎడ్రస్ అడిగాడు. ఇచ్చింది అనూరాధ. తనలో యేదో తెలియని బాధ ఆవేశించింది. అనూరాధ వెళ్ళిపోయిన దగ్గర్నుంచీ మనస్సంతా అల్లకల్లోల మయినట్లయింది తనకు....ఎలాగైనా తను అనూరాధను పొందాలి....పొందలేక పోతే పరిణామా లెలా ఉంటాయో తనూహించలేదు .... కాని ఎలా ? సాహసించి చెప్పే ధైర్యం లేదు తనకు....కాలం తన మామూలుగా ఆర్నెల్లను గుటుక్కున మింగింది— తెగించి ఆనాడు అనూరాధకు ఉత్తరం వ్రాసాడు తను.

గాలికి కిటికీతలుపు కొట్టుకుంది— ఉలిక్కిపడి తిరిగి ఆలోచనల్లో మునిగి పోయాడు.

'ఏమిటి? ఏమిటి వ్రాశా నా ఉత్తరంలో?' తీవ్రంగా ఆలోచిస్తూ గొణుక్కున్నాడు, తన జ్ఞాపక శక్తిని నిందించుకుంటూ.. 'ఆ...గుర్తొచ్చింది. తను వ్రాసిన ఉత్తరంలోని ప్రతీ మాటా నాకు జ్ఞాపకం ఉంది....' 'ప్రియమైన అనూరాధా'

ఏమని వ్రాయమంటావ్? ఎలా వ్రాయమంటావ్? సౌందర్యాన్ని కళాతపస్వి ఆరాధిస్తాడు—ప్రేమికులు వెన్నెల రాత్రుల్ని కోరుకుంటారు. మయూరాలు మబ్బులకోసం మధనపడతాయ్....భక్తుడు సృష్టికర్త పద సన్నిధిలో రేణువు కావాలని ఆశిస్తాడు. తన భావనలకు రూపకల్పన చెయ్యాలని చిత్రకారుడు తపించిపోతాడు. పరిమళపుష్పాల్లోన్ని మకరందాన్ని తనివితీరా గ్రోలడానికి తుమ్మెదలు తహతహ లాడుతాయ్? ఏమిటీ అనుబంధం? ఏమిటా సంబంధం.... నేను నీ సమాధానాన్ని కోరుకుంటున్నాను. ఏమని చెప్పమంటావ్? నా కంతా అంధకారంగా కన్పిస్తోంది. నా హృదయం తెగిన గాలిపటంలా నిర్ణయంలేని పరిధుల్లో పల్టీలు కొడుతూంది. చివరికే చెట్టుకొమ్మకో తగులుకుని ధ్వంసం అయిపోతుందేమో? ఏమో: ఇంతకంటె ఏం వ్రాయాలి? ఎలా వ్రాయాలి? అర్థం చేసుకో: జవాబుకోసం అనుక్షణం ఎదురు చూస్తూంటాను.

- శ్రీపతి'

తర్వాత నెలల తరబడి తను అనూరాధ జవాబుకోసం ఎదురుచూశాడు. కాని తన ఆశ నిరాశే అయ్యింది. తన ఆలోచనలు పరిపరివిధాల పరుగులు తీసాయ్.

నిజం....తనొక పిరికివాడు.... మూర్ఖుడు....ముఖతః ఏనాడూ అనూరాధను యీ విషయం గురించి తను అడగలేకపోయాడు. అదృష్టం దూరమయ్యాక ఆవేదన పడటం ప్రకృతి సహజమేమో? ఛీ....తనకు ధైర్యంలేదు-జీవితం అంటే ఒక దృఢ నిశ్చయం లేదు... కాలం ఆగలేదు. చావు పుట్టుకలమీద అడుగు లేసుకొంటూ నడిచి వెళ్ళిపోతూనే ఉంది.

ఆ సంవత్సరం అనూరాధ 'కాన్వకేషన్'కు విశాఖపట్నం వచ్చింది. శ్రీపతి కూడా వెళ్ళాడు....ఎప్పటిలాగే అనూరాధ శ్రీపతిని నవ్వుతూ పలకరించింది.

'ఉత్తరం అంది ఉండదు బహుశః :' మనసులోనే అనుకున్నా తిన్నగా ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు శ్రీపతి.

యోగక్షేమాలడిగింది.—

'సాయంత్రం శాంతిభవన్ కు రండి: తీరుబడిగా మాట్లాడు కుందాం.' ఎప్పటి చనువుతో నే మాట్లాడి వెళ్ళిపోయింది అనూరాధ.

శ్రీపతి హృదయం తేలికపడింది.

సాయంత్రం కోసం ఎదురు చూసాడు .... కాలం స్తంభించిపోయి నట్టు బాధపడ్డాడు. కష్టసుఖాల్ని కొల తలు వేసుకుంటూ నిర్విరామంగా సాగి పోతూనేఉంది కాలం.

సాయంత్రం ఐదున్నరకల్లా శాంతి భవన్ చేరుకున్నాడు.

అనూరాధ శ్రీపతికోసమేయెదురు చూస్తూంది. వెళ్ళగానే ఆహ్వానించి కుర్చీ చూపించింది.

శ్రీపతి కూర్చున్నాడు.

కాఫీ యిచ్చింది.

మౌనంగా త్రాగేశాడు.

'యింకా పై చదువులు చదువు తారా ?' అనూరాధే మొదలుపెట్టింది.

'చెప్పలేను.'

'అదేం ?'

'చదవాలనే ఉంది. కాని నాన్న గారు వచ్చే సంవత్సరంలో రిటైరయి పోతారు. యీలోగా నేనేదో ఒక ఉద్యోగం సంపాదించాలని చూస్తు న్నాను.'

'మంచిదే.'

'మరి నువ్వు ?'

'అవకాశం, అదృష్టం ఉన్నంత మేరకు చదవటమే నేను చేయదల్చు కుంది.'

శ్రీపతి యేం మాట్లాడలేదు.

'మీ ఉద్దేశ్యం ఏమిటి ?'

ఏం చెప్పాలో అర్థంకాలేదు శ్రీపతికి.

'జవాబు చెప్పలేరా ?' అనూరాధ అడిగింది సూటిగా.

'మీ ఉద్దేశ్యం మంచిదే;' యేదో ఒక జవాబు తను చెప్పాలి. చెప్పాడు.

అనూరాధ నొసలు చిట్లించింది.

'అదృష్టం అందరికీ కలిసిరావాలిగా అనూరాధా.'

'ఏ మదృష్టం ?'

'పై చదువులు చదువుకో నే అదృష్టం.'

శ్రీపతి ముఖంలోకి చూసింది మౌనంగా.

'అలా గయ్యారేం ?'

జవాబు చెప్పలేదు అనూరాధ. తన డైరీలోంచి ఒక కాగితాన్ని తీసి అందించింది శ్రీపతికి.

శ్రీపతి వ్రాసిందే అది. శ్రీపతి హృదయంలో తిరిగి పెనుతుఫాను ప్రళయార్భాటాలతో రేగింది.

'యేమిటి దీనర్థం ? మీ ఉద్దేశ్యం ఏమిటి ?'

'యేం చెప్పమంటావ్ అనూ రాధా ?'

'అంత సమాధానం చెప్పలేనివా రుత్తరం ఎందుకు వ్రాశారు? ఏ భావంతో మీ రలా వ్రాశారు?' తీక్షణంగా ఉంది అనూరాధ కంఠం.

'అర్థం చేసుకోలేదా అనూరాధా! నిన్ను....'

'పెళ్ళి చేసుకుంటారు కదూ?'

'ఔ' నన్నట్లు తలూపాడు శ్రీపతి.

'నా గురించి ఏం తెల్సుకున్నారు మీరు?'

మాట్లాడలేదు శ్రీపతి.

'ఈనాటికీ నన్ను వివాహమాడాలనే ఉద్దేశ్యం ఉందా?'

'ఉంది.'

'కాని మీ రెప్పుడైనా మా నాన్న గారితో మాట్లాడేటప్పుడు....ఆయన నవ్వుతూ మాట్లాడే మాటల వెనుక అగాధమయిన విషాదం వుందని గ్రహించారా? పోనీ నాలో కూడా గూడుకట్టుకున్న దుఃఖాన్నంతా ఎప్పుడైనా తెల్సుకున్నారా?

'అనూరాధా!'

'నేను భర్తృవిహీనను.'

ప్రపంచం అంతా భగ్గున మండినట్లయింది. ఉలిక్కిపడ్డాడు....తల తిరిగి పోతూంది....

'నన్ను పెళ్ళి చేసుకోలేరుకదూ?' దీనంగా అడిగింది అనూరాధ.

'అసాధ్యం అనూరాధా.'

'హుఁ. అసాధ్యం కాదు మిష్టర్ శ్రీపతి-అవివేకం-అజ్ఞానం..అల్పత్వం!'

'అనూరాధా!'

'పరువుగా బ్రతికే స్త్రీజాతి మీద మీ కెందు కింత కక్ష? స్నేహాన్ని అలుసుగా తీసుకుని హద్దుల్లేకుండా ప్రవర్తించటంలో మీ వుద్దేశ్యం? యీ వుత్తరం మా నాన్నగారి చేతుల్లో పడితే నా గతేమయ్యేది-నిప్పు లేందే పొగ రాదని అపోహపడరూ? చదువూ, సంస్కారంవున్న మీరే యిలాంటి పన్లు చేస్తే....అవి లేనివాళ్ళు చేసారంటే అనగల్గేదేముంది?'

శ్రీపతి మౌనంగా ఉండిపోయాడు.

'ఏ పనయినా చేసేముందు కళ్ళు మూసుకుని ఒక్కక్షణం ఆలోచించ గల్గితే యీ పని మీరు చేసేవారు కాదు. ముఖతః మాట్లాడలేని పిరికివారు వుత్తరం వ్రాయటం దేనికి?'

'అనూరాధా!'

'అని పిల్చే అర్హతను కూడా పోగొట్టుకుందామనా? స్నేహాన్నింత చులకనగా తీసుకొని మీ అవివేకానికి బలిచేస్తా రనుకోలేదు. మీ ధైర్యం మీ భావాలూ కొలత కందుతా యనుకోలేదు. స్నేహాన్ని తృణంగా తీసుకుని ఆత్మీయతకు 'ప్రేమ' అని పిచ్చిపేరు పెట్టే మీలోని 'జడత్వాని'కి మా శీలం బలి చేసుకొనేంత మూర్ఖులం కాదు. వెళ్ళండి.'



"నీమాదిరిగా కసరత్ చేసి లావు కావా లని నాకూవుంది. కాని, గుడ్డలఖర్చు ఎక్కడినుంచి తేవా లని ఆలోచిస్తున్నా !"

అవమానభారంతో మెల్లగా అడుగులు వేసుకుంటూ బయటకొచ్చిన శ్రీపతికి గదిలో నాలుగైదు ఆడగొంతుల పకపకలు, శ్రీపతి హృదయాన్ని దహించినై. ఒక నిశ్చయాని కొచ్చినట్టు తల పంకించి చర....చర ముందుకు సాగిపోయాడు శ్రీపతి.

*　　　*　　　*

భావాతీత మయిన సంఘటనలవల్ల మానవుడు మూడు విధాలుగా మారిపోతాడు. యీ ప్రపంచంలోని నైతిక సుఖా లన్నిటికీ దూరమయి ఒక మహాదాశయంతో భగవత్సన్నిధి చేరా లని తపస్వి కావచ్చు.

పిచ్చివాడు కావచ్చు....

క్రూరత్వానికే తన హృదయాన్ని అంకితం చెయ్యొచ్చు....ప్రతీకారం... పశుత్వం తప్ప మానవత్వం తెలియని మూర్ఖుడుగా మారవచ్చు.

ఓనాడు వచ్చిన శుభలేఖను వెంటనే అగ్గిపుల్ల వెలిగించి తగులబెట్టాడు శ్రీపతి-'మీ జీవితాల పంటలో అగ్గిపుల్ల నౌతా నన్నాడు.' ఆ వాడే-హృదయం ఎగిరి గెంతేసింది-తనలోని వుబుకుతున్న అక్కసు నంతా వెళ్ళబోస్తూ అనూరాధ భర్తకు ఉత్తరం వ్రాసాడు కొన్నాళ్ళు పోయాక. ఫలితాలకోసం శ్రీపతి ఎదురుచూస్తున్నాడు....

గోడ గడియారం పదకొండు కొట్టింది - శ్రీపతి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు....

విశాల యీజీ చైర్లో నిద్ర పోతోంది.

దీప మార్పేసి మంచం మీద వాలాడు శ్రీపతి.

*        *        *

రాత్రంతా శ్రీపతికి సరిగ్గా నిద్దర పట్టలేదు. ఉదయం లేచేసరికి కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయ్. ముఖం పీక్కు పోయినట్టుంది. బద్ధకంగా పెరట్లోకి వెళ్ళి ముఖం కడుక్కున్నాడు. వచ్చి గదిలో కూర్చున్నాడు.

విశాల కాఫీ తెచ్చిచ్చింది. 'రాత్రి నిద్రపట్టలేదా ?' అంది.

'లేదు' కాఫీ సాసర్లో పోసుకుని తాగడాని కుపక్రమించాడు.

'పాపం....మా స్నేహితురాలు.'

సాసరు టేబుల్ మీద పెట్టి ఆత్ర తగా ఆమె ముఖంలోకి చూశాడు.

'ఏమయింది ?'

'ఎవరో ఏమో ? దాని కాపురంలో చిచ్చు పెట్టారట.'

'తన బాణం గురి తప్పలేదన్న మాట;' మనసులోనే అనుకున్నాడు- సంబర పడ్డాడు. పైకి మాత్రం.... 'ఆ సంగతి మధ్య మన కెందుకులే' అన్నాడు....

'ఎంతయినా స్నేహితురాలు కద.' 'కావచ్చనుకో. ఆఁ. సెలక్ట్లో మంచి సినిమా వచ్చింది తెలుసా.' ధోరణి మార్చే వుద్దేశ్యంలో అన్నాడు శ్రీపతి.

'అనూరాధ జీవితమే ఒక సినిమా అనిపించింది నాకు. విశాల మాటలకు విసుక్కున్నాడు శ్రీపతి.

'ఇంతకూ మీకు అనూరాధ యిదివరలో తెలీదు కదూ' సూటిగా ప్రశ్నించింది విశాల,

'తెలీదు' నిర్లక్ష్యంగా జవా బిచ్చాడు శ్రీపతి.

'పొరపడ్డానులెండి.'

'ఏమిటది ?'

'దాని కాపురంలో నిప్పు పుట్టించ డానికి ఉత్తరం వ్రాసినాయన పేరూ మీ పేరూ ఒకటేలెండి.'

'విశాలా!' నిర్విణ్ణుడై పోయాడు శ్రీపతి.

'అయినా లోకంలో ఆ పేరుగలవా ళ్ళెంతోమంది ఉంటారు. శ్రీపతి ముఖంలోకి చూస్తూనే అడిగింది విశాల.

శ్రీపతి తల తిరిగిపోతూంది.

'ఇదంతా పాఠం నేర్పినందుకు ప్రతీకారంటలెండి.'

'విశాలా!' బాధగా అరిచాడు.

'ఎందుకలా బాధపడతారు ? ఒక ఆడదాని బ్రతుకును నాశనం చెయ్యా టానికి భయపడనివాడు ఒక కాపు రాన్ని కూల్చివేయటానికి వెరువని

వారు .... వెనుదీయనివారు .... అవ
మానం పొంది ప్రతీకారం తీర్చుకునే
వారు....'

'విశాలా!' పిచ్చిగా అరిచాడు
శ్రీపతి.

'బాధపడతారుగాని .... ఎ వ రో
అనూరాధ కాపురంగురించి ... మధ్య
మీరు బాధపడటం దేనికి? దీని వెను
కేమైనా కథుందా?' భర్త ముఖ కవ
ళికలను పరీక్షిస్తూంది విశాల.

'లేదు—యేమీలేదు—వెళ్ళు ....నా
మన స్సేం బాగులేదు.... వెళ్ళు....'

'వెళతాను — మీ హృదయం ఒక
నాటికి చిత్రహింసకు గురి అవుతుందని
మీకూ తెల్సు.'

'విశాలా.'

'యీ వుత్తరం సంగ తేమిటి?'

'ఏమి టా వుత్తరం?'

'చదవండి' అందించిం దో వుత్త
రాన్ని.

'ప్రియమైన విశాలా.

ను వ్వెంత మోసపోయావ్?
శ్రీపతిని వివాహం చేసుకుంటున్నా
వని తెల్సిననాడే చాలా బాధపడ్డాను.
కాని ... శ్రీపతి కమల కేం సమా
ధానం చెప్తాడు యిప్పుడు వారిని నీ
వారినిగా చేసుకోవటానికి ఎప్పటికీ
ప్రయత్నిస్తూ ఉండు ....

నీ హితాభిలాషిణి. లత.'



''ఎంత చక్కటిరాత్రి! మనం భార్యా
భర్తలం కాకుండా ప్రేమికులమయి
ఉంటే ఎంత బాగుండేది!''

'అబద్ధం... అబద్ధం' పిచ్చిగా జుత్తు పీక్కుంటూ అన్నాడు. 'ఆ కమల ఎవరో నాకు తెలీదు... మోసం....దగా....'



శ్రీపతి చేతిలోంచి జారిపోయిన ఉత్తరాన్ని జాగ్రత్తచేస్తూ...



'అన్నీ తెలిశాకకూడా మీతో ఎలా ఉండమంటారు?'

'విశాలా!' మన సంసారంలో ఎవరో చిచ్చుపెడుతున్నారు .... నాకేం తెలియదు.... నన్ను నమ్ము.... యే క్రూరదైవమో మనల్ని పీడిస్తోంది. యీ పాపానికి వాళ్ళు మిడతల్లా మాడిపోతారు — సర్వనాశనం అయిపోతారు — నా సంసారాన్ని కూలద్రోయటాని కెవరో యీ ఉత్తరం వ్రాశారు. విశాలా .... నువ్వా ఆ ఉత్తరాన్ని నమ్ముతున్నా వన్నమాట.' వెర్రి ఆవేశంతో .... భయంతో .... పిచ్చిగా యిల్లంతా పచార్లు చేస్తున్నాడు శ్రీపతి.

'యెందుకలా ఆవేశపడతారు? కాపురాల్లో చిచ్చుపెట్టటం ఒక్కొక్కళ్ళ కదో ఆనందం-పండుగ.'

'విశాలా!'

'ఈ ఉత్తరం చూడండి!' శ్రీపతి అనూరాధకు వ్రాసిన ఉత్తరం అందించింది విశాల. ఉత్తరం చూసి నిర్ఘాంతపోయాడు శ్రీపతి. లోకమంతా ... ప్రకృతి సర్వం .... యేకమై తన మీదకు దాడిచేస్తున్నట్టు — ప్రచండ కాగడాలు తన హృదయాంతరాళాల్లో గడ్డకట్టిపోయిన కల్మషాన్ని కరిగించటానికి తన పైకి ఉరుకుతున్నట్టు- శ్రీపతి హృదయం భయంకర యుద్ధానికి గురియైన క్షోభతో గగ్గోలు చేస్తోంది.

'విశాలా .... నేను పాపిష్టివాణ్ణి దుర్మార్గుణ్ణి! నిష్కళంకమైన మా స్నేహాన్ని పాడుచేసుకుని నీచంగా ప్రవర్తించాను - నాకు శాంతిలేదు. విశ్రాంతిలేదు. నా పాపం నన్ను నిలువునా దహించివేస్తోంది. అనూరాధ నన్ను క్షమించగలిగిననాడు తప్ప నాకు జీవితమే లేదు-అనూ రాధా-అనూ... తక్కున ఆగిపోయాడు వస్తూన్న అనూరాధను చూసి.

'అనూ రాధా! నన్ను క్షమించగలవా?' శ్రీపతి దీనంగా అడిగాడు

'మీ హృదయంలో కలిగిన పరివర్తన చాలు శ్రీపతిగారూ-మిమ్మల్నెవరూ క్షమించనక్కర్లేదు. పశ్చాత్తాపం పాపాలను ప్రక్షాళనం చేస్తుంది. మీరిలా తయారవుతారని నే నెప్పుడూ అనుకోలేదు శ్రీపతిగారూ!'

'అనూరాధా!'

'ఒక్క మాట, మీ రనుకొన్నట్టు.... నేను చెప్పినట్టు .... నా భర్త అంత సంకుచిత హృదయులు కారు - మీ ఉత్తరాన్ని చూసి. 'ఎవరో రాక్షతనానికి వ్రాశారు—బాధపడకు అనూరాధా!' అన్నారు. కాని నా హృదయంలోంచి ఆ విషయం అంత త్వరగా కదల్లేదు—విషయం తేల్చుకుందామని నిశ్చయించుకుని బయలుదేర వచ్చాను నా ఆశ నెరవేరింది.'

'నీ ప్లాస్టిక్ కాగీ ... పోయావ్ విశాల అందించింది.



"ఒరేయ్—ఈ పెద్దాళ్ళు చేసేదంతా ఒఠి మోసంరా : పళ్ళకుపళ్ళూ వాళ్ళు తింటారు, మనకి సగంసగం ముక్కలు పెడ్తారు — ఇలాగే అన్నీ..."
"నిజఁవేఁరా — మొన్న మా నాన్న తన కేఁవో నిండుటిక్కట్టు కొనుక్కొని — నన్నేమో అరటిక్కట్టుమీద రైలెక్కించి తీసుకొచ్చాడు :..."

అనూరాధ తీసుకుంది.

'మర్చిపోవా లనే మర్చిపోయావ్ కదూ ?' విశాల అడిగింది.

సమాధానంగా ఒక నవ్వు నవ్వి ఊరుకుంది అనూరాధ.

'చూసుకో అమ్మా నీ డబ్బు.'

'ఫరవాలేదులే, అందులో ఉన్న వన్నీ కోయంబత్తూరు నోట్లు.'

ఆశ్చర్యపోయింది విశాల.

'అనుమానమైతే చూడు' తీసి చూపింది అనూరాధ. అందులో వున్న రెండో కాగితాన్ని తెరచి చూసి నిశ్చేష్ఠురాలై 'ఇదేమిటి' అంది.

విశాల గర్వంగా అనూరాధ ముఖం లోకి చూసింది.

అనూరాధ కంతా అర్థమైంది. లత పేరుతో విశాల తనకు తనే వుత్తరం వ్రాసుకున్న సంగతి శ్రీపతికి తెలియక పోవటమే మంచిదని మడిచి 'బాగ్'లో పెట్టేసింది. 'వస్తా'అనూరాధ కదిలింది.

శ్రీపతీ-శ్రీపతి శ్రీమతి విశాలా వీధిగుమ్మం వరకూ సాగనంపారు అనూరాధను. విశాల భర్త హృదయంలోకి సూటిగా చూసింది. శ్రీపతి హృదయం చివుక్కుమంది. సిగ్గుతో, అవమానంతో కుంచించుకుపోయాడు.

'ఏమండీ' భర్త హృదయంలో తల దాచుకుంది విశాల.

తేలికయిన మనస్సుతో గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు విశాలను.

విశాల బుగ్గలు ఎరుపెక్కాయ్. ఆ యిద్దర్నీ చూస్తూ చిరుగాలికి ఊయల్లూగుతున్న గులాబీ ఫక్కున నవ్వింది.

# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

### జరిగిన కథ

*[తరువాత ఎన్నో సంఘటనలు— అనంతయ్య మాధవిని పాణి కివ్వడానికి ఎన్నో ఆశలు చూపాడు; పాణి యిల్లరికం రావా లనే ఉద్దేశంతో. కట్నం తీసుకోవాలనే ఆశ జానికమ్మ కున్నా, పాణికిమాత్రం లేదు; ఇల్లరికం మినహాయిస్తే నిరభ్యంతర మని సమ్మతిని తెలియపర్చాడు.*

*అటు అనంతయ్య కుటుంబంలో కేశవరావుకూ, ఇటు పాణి కుటుంబంలో రఘూప మినహా అందరికీ అయిష్టమే అయినా, పాణి మాధవీల వివాహం సర్వ శోభాయామానంగా జరిపి మాధవిని అత్తవారింటికి కాపురానికి పంపారు.]*

— ఇక చదవండి.

ఉదయం ఆరుగంటలకు లేచి దొడ్లో ముఖం కడుక్కుంటున్న మాధవిని చూచి ఏదో విడ్డూరం చూచినట్లు నిలబడిపోయింది జానికమ్మ ఆశ్చర్యంగా.

"ఇప్పుడా కోడ లనేది లేవడం? అవ్వ!" అని నోరు నొక్కుకుంది.

తొలిరోజున కనసు తనతో మాటే ఆడక ఈసడించిన అత్తగారు యిక ముందుకూడ తనతో మాటాడ దని భావించిన మాధవికి ఈ పదునైన మాటలు హఠాత్తుగా అఘాతంలా తగిలాయి మౌనంగా విని ఊరుకుంది.

"త్వరగా కానిచ్చి ఆ బిందెలోకి, ఆ తొట్టెలోకి నీళ్ళు తోడు." అని ఆర్డరు జారీచేసి వెళ్ళిపోయింది జానికమ్మ

ఆమె తిరిగి వచ్చేసరికి పనిమనిషి నింపుతూంది బిందెలూ, గుండిగలూను!

"ప్రొద్దున్నే పాచిచేయడం మాని అపని ఎవరు చేయ మన్నారే నిన్ను? నేను తోడ మన్నానా నిన్ను నీళ్ళు?" అనడిగింది క్రోధాశ్చర్యాలతో

"ఎందుకమ్మా అంతకోపం? పాచిచెయ్యడమూ అయ్యింది. గిన్నెలు తోమడమూ అయ్యింది. రోజూ నీళ్ళుతోడితే నెలకు మరో రెండురూపాయ లెక్కు విత్తానన్నారు అయ్యగారు చల్లగా చెవిని వేంంది వార్తను పనిమనిషి వింటూన్న పద్మా జాని కమ్మాకూడఆశ్చర్యపోయారు పద్మఅంది: చూశావామ్మా



చూశావా ? పెళ్ళాం అలసిపోతుందని ! ఇన్నాళ్ళనుండీ ఆ పనులు మనం చేస్తూంటే చీమకుట్టినట్లయినా లేదు

"కానీయమ్మా కానియ్యి మనపా ళ్లెవరిక్కావాలి ? దీర్ఘాలు తీసింది తల్లి అయినా రెండు రూపాయలతో నీళ్లయితే తోడించగలడు కాని రెండు లక్షలతో అద్దాల మేడ కట్టించగలడా మరి ఆనంతయ్య కూతురికి ? అంటూ



భర్తకు కాఫీపోసుకు వెళ్తూన్న మాధవిని ఓరగంట చూచింది. ఆమె వినపడీ వినపడనటుగా వెళ్ళిపోయింది.

"ఒకటే తెచ్చావేం? నీ కేది కాఫీ?" అనడిగేడు చక్రపాణి.

"తీసుకున్నా, నింతకుముందే.'' చిరునవ్వుతో సమాధాన మిచ్చింది మాధవి.

''ఊఁహూఁ, ఏదీ, నా ముఖంచూచి చెప్పామాట? అంటూ కళ్ళలోకి చూచాడు మాధవి చూపులు త్రిప్పుకుంది.

"హోటల్సులోకూడ ముందు నా కిచ్చి నువ్వు తీసుకునేదానివి. ఇక్కడ ముందే తీసుకున్నానంటే నమ్మగల మూర్ఖుడి ననుకున్నావా? అబద్ధ మాడేందుకు కూడా ప్రావీణ్య ముండాలి బిందూ."

"వదినా" బయటినుంచి ఇందిర పిలుపు.

"ఆఁ, వస్తున్నా" ఖంగారుగా లేచింది మాధవి.

"నేనే వస్తున్నాను.'' తలుపు త్రోసి లోనికి ప్రవేశించింది ఇందిర, చేతిలో కాఫీకప్పుతో.

"ఇదిగో. నీకు మొగమాటం వద్దని నిన్ననే చెప్పానుగా?" అంటూ "ఇంత సిగ్గేమి ఉన్నయ్యా వదినకు?" అంది ఇందిర నవ్వుతూ.

చక్రపాణి జాలిగా చూచాడు మాధవివైపు.

"మరీ నిన్ను నువ్వే ప్రత్యేక పరిధులలో బిగించుకోకు వదినా. మరీ డాబు దర్పాలకు, ఖరీదైన షికార్లకు కాకపోయినా సాధారణంగా ఎందుకూ కటకట వుండదు ఇక్కడైనా. ఏదో ఒకమాదిరి జీవితం గడిపివేయవచ్చు. అదీకాక ఎవ రేమనుకుంటారో ననే భయాన్ని ముందుగా వదలిపెట్టేయాలి ఇలాటి యింట్లో ధైర్యంగా స్వతంత్రంగా ప్రవర్తించాలి. మన సుఖ సంతోషాలతో నిమిత్తంలేని వారిముందు మనకు సిగ్గూ, సంకోచమూ అనవసరం. ఈ ఇల్లు నీది. ఈ సంసారం నీది. ఏమంటావ్?"

కృతజ్ఞతతో చూచింది మాధవి ఆడపడచును. "నీది మరీ మెత [illegible] బిందూ" అన్నాడు పాణి ప్రేమగా.

ఇంతలో ''ఇందిరా" అని పెద్ద గావుకేక పెట్టింది పద్మ.

"ఏమన్నా పనుందేమో?" అంటూ మాధవి గబగబా వెళ్ళిపోయింది. ఇందిర కూడ పోబోతూంటే పాణి వెనక్కు పిలిచాడు. "చూడమ్మా, మన పను లవీ చేత కాకపోవచ్చు, నువ్వు కొంచెం తోడుగా వుంటూండు."

"నాకు తెల్సులే అన్నయ్యా. కొంచం లోటుపాట్లున్నా సర్దుకుపోవాలి. అమ్మలాగా నువ్వుమాత్రం ఎప్పుడూ తొందరపడి తూలనాడకు సుమా. ఇక వదినకు మనమే అంతా;" అంటూ వెళ్ళిపోయింది ఇందిర.

"మంచి హృదయం. చిన్న వయసైనా ఏ పెద్దవాళ్ళకూలేని బుద్ధీ ఆలోచనాను తృప్తిగా నిట్టూర్చాడు చక్రపాణి, ఇందిరగురించి ఆలోచిస్తూ.

"ఏమిటే నీక్కూడా ఆ గదిలో మంతనాలు?" గుర్రుమంది పద్మ.

"ఛ ఊరుకో, అన్నయ్యతో మంతనా లంటావ్? కాఫీ ఇచ్చేందుకు వెళ్ళాను

జానకమ్మ అందుకుంది. "ఉద్ధరించావు కాని పనంతా ఎవడు చేస్తాడు? బాగా వాళ్ళకూడా తిరిగి ఆ పాడుబుద్ధులన్నీ నేర్చుకో. ఇంకా మిగిలిన సంసారాన్ని నువ్వు రచ్చకెక్కిద్దువుగాని."

ఆ బాణా లన్నీ పరోక్షంగా తననే నని గ్రహించిన మాధవి మౌనంగా వెళ్ళి వంటపనికి ఉపక్రమించింది. ఇందిర వెళ్ళి మరోపని చేయబోయిన దల్లా తల్లి కేక విని ఆగిపోయింది.

"నువ్వు నా పూజకు పువ్వులు కోసి పట్రావే మొద్దూ."

పూలసజ్జ తీసుకు వెళ్ళి పోయింది ఇందిర.

కత్తిపీటపై కూర్చోబోతున్న మాధవి అమాంతం లోనికి ప్రవేశించిన మోతీని చూచి కొండంత సంతోషంతో "మోతీ!" అంటూ వెళ్ళి కౌగలించేసుకుంది. మోతీ తోకాడిస్తూ మాధవి చేతులను ప్రేమగా నాకుతూ మూగగా విలపించింది. మాధవి అశ్రువు లొలికించింది.

"మోతీ వచ్చిందా?" అంటూ చక్రపాణికూడా సంతోషంగా అటు వచ్చాడు.

జానకమ్మ చికాకుపడ్తూ లేచింది. "ఏమిటి వస్తే? ఏ అత్తగారో మరదలో వచ్చినంత సంబర పడుతున్నావ్?" అని కొడుకునూ కోడల్నీ ఈసడిస్తూ ఓ కట్టెపేడు తీసుకుని మోతీని అదిలించసాగింది. "ఛీఛీ నడు బయటకు. దిక్కుమాలిన కొంపై పోయింది. వంటగదిలో కూడా కుక్కలేనా? శ్రీనివాసా! మడి అంతా తగులడి పోయింది;" అని విచారించింది.

దానితో బెదరి బెదరి మోతీని వదలి దిగులుగా నిల్చుంది మాధవి. మాటలను మనుష్యులకంటె బాగా అర్థం చేసుకోగల మోతీ వెంటనే పోయి గుమ్మం వెలుపల పెరట్లో నిలబడింది.

"దాని కెంత విశ్వాసమో చూడమ్మా. ఎందు కలా విసుక్కుంటావ్?" అన్నాడు పాణి.

అవును దానికి విశ్వాసం కాదూ మరి? అదేమైనా పెట్టాలా పోయాలా మరి?'

నీ కంతే అర్థమైందిలే అంటూ వెళ్ళిపోయాడు చక్రపాణి మోతీ బయట మొక్కలదగ్గర ముడిచిపెట్టుకు కూర్చుంది

"ఏం పోయిందా అది?" అడిగింది జానకమ్మ.

పద్మ చెప్పింది. "లేదు, మొక్కలదగ్గ రుంది దొడ్లో."

జానకమ్మ తీక్ష్ణ దృక్కులు మాధవిమీదకు త్రిప్పింది. "ఏ పెట్టుపోతలూ లేక పోగా ఈ తద్దిన మొకటా నా నెత్తిమీదకు? దాన్ని వెళ్ళగొట్టి రా, వెళ్ళు. కుక్కల్నీ గుఱ్ఱాల్నీ పోషించడాని కిదేమీ జమీందారీ కొంపకాదు.'' అంటూ వంటగదంతా పసుపునీళ్ళు జల్లి శుద్ధి చేసుకోసాగింది. మాధవి బరువుగా మోతీ దగ్గరకు వెళ్ళింది. ''మోతీ! నన్ను చూడా లని వచ్చావు, బూశావుకదూ వెళ్ళిపోమ్మా. మా బంగారుతల్లివి కదూ?" అంటూ మోతీని చేత్తో నిమిరి చెప్పలేక చెప్పలేక చెప్పింది కన్నీటితో.

అర్థ మైనట్లు మోతీకూడ కన్నీరు కార్చింది. మరేమీ మంకుతనం చేయకుండా వెళ్ళిపోవడానికి దారితీసింది.

"అదేమిటి పంపొస్తున్నావా?" అనడిగాడు చక్రపాణి.

''అవును. ఎందు కిక్కడ?'' అంటూ "వెళ్ళమ్మా. బుద్ధిగా అన్నం తిను. అల్లరి చేయకు. ఎప్పుడైనా వస్తూంటావు కదూ?" అని కుక్కకు బుద్ధులు చెప్పసాగింది.

"చాల్లే. నా కంతా అర్థమైంది. అమ్మ ఏదో అనివుంటుంది. అవి దనశాని కేంలే. నేను లేనూ? ఉండనీ;" అని భార్యను వారిస్తూ, "ఉండు మోతీ, ఇక్కడే వుండు" అని మోతీని నిమురుతూన్నంతలో వసంతయ్య ఇంటినౌఖరు ఒకవ్యక్తి వచ్చాడు, "మోతీ ఇక్కడకు వచ్చిందా?'' అని.

మాధవికి చెప్పరాని సంతోష మైంది. ''వెంకన్నా. అంతా బాగున్నారా? ఏమిటి విశేషాలు?" అంటూ ఆత్రంగా ఆనందంగా అడిగింది.

"అంతా బాగానే ఉన్నారమ్మా. మోతీ యిక్కడకు గాని వస్తే లాక్కురమ్మన్నారు. మీరు వచ్చేసిన దగ్గర్నుంచీ మోతీ, పంచకళ్యాణీ తిండీ, నీరూ ముట్టకుండా ఏకా ఉపవాసాలు చేస్తున్నాయి."

"అయ్యయ్యో," అంటూ కంట తడిపెట్టింది మాధవి. "అయితే మోతీని ఉంచేయి వెంకన్నా, నేను బ్రతిమాలుకున్నా నని చెప్పు నాన్నగారితో, మోతీ నాకో స్నేహితురాలిలాగా అక్కచెల్లెలిలాగా వుండేది. నన్ను విడచి అది బ్రతుకదు. ఎలా




"వంట అయేదాక బిజీగా కనపడాలి, అంతే."

చిక్కిపోయిందో చూడు. పంచకళ్యాణిని కాస్త భద్రంగా చూడండి. ఎలాగైనా నా మీది దృష్టి మళ్ళించండి."

"అమ్మబాబోయ్, లాభంలేదు తల్లీ. మోతీని తీసుకెళ్ళకుండా వెళ్తే నా ప్రాణాలు తినేస్తారు. ఇక్కడేమైనా అధికంగా మాట్లాడినట్టు తెలిసినా అడ్డంగా నరుకుతానన్నారు. ఏమనుకోకు తల్లీ. కుక్క నిప్పించండి ఎల్లిపోతాను."

మాధవి మరి మాట్లాడలేదు. చక్రపాణికూడా ఏమీ అనలేకపోయాడు. మోతీ పరిస్థితి నర్థం జేసుకున్నట్లు ఒక్కసారి దీనంగా మాధవినీ చక్రపాణినీ చూచి, పాదాలు విశ్వాసంగా స్పృశించి వెంకన్నతో వెళ్ళిపోయింది.

"జాగ్రత్త వెంకన్నా. కాస్త షికారు త్రిప్పి ఆ బెంగ పోయేట్టు చూడు," అంది వెళ్ళిపోతూన్న వెంకన్నను.

"ఏమో తల్లీ ఎన్ని చేయాలో అన్నీ చేస్తున్నాం. అయినా అయ్యగారి కెందుకో ఇంతకోపం? ఓ ప్రక్కన మధువనమంతా ఎండపెట్టేస్తున్నారు; ఎవ్వరినీ సంరక్షణ చేయనివ్వడంలేదు. నిన్ను అంతగా ప్రేమించినబాబే ఇప్పు డసలు నీపేరు ఎత్తరు. మమ్మల్ని ఎత్తనివ్వరు."

విషాదంగా నవ్వింది మాధవి.

"ఇదేదో అరిష్ట సూచకమేనమ్మా. ఆవేళ నువ్వు వచ్చినరాత్రే పెళ్ళిపందిరంతా తగులడిపోయింది. ఇంకా అదృష్టముండి చూచుకుని అందరం తలోఆకు లాగి పారేసి ఆర్పేశాం. లేకుంటే మేడే ఎగిరిపోను. అయినా నువ్వా యిల్లు వదలిన దగ్గర్నుంచీ చెడుశకునాలే. మళ్ళీ శ్యాంబాబు యింట్లోకి జేరాడు.''

ఓ ప్రక్క భయపడుతున్నట్టు నటిస్తూనే విషయాన్ని చెవిన వేసిపోయాడు శ్రోతల మనస్సులను వికలం కావించుతూ.

"జశ్యాం మంచివాడుకాడు. వా డింట్లో ఎందుకు చేరినట్లో మళ్ళీ?" అంది మాధవి తనలో తాను అనుకున్నట్టు.

పాణి అన్నాడు. "అది నిజమే. ఆ పుల్ని తృణీకరించిన సమయంలో నాలుగు ముఖప్రీతి కబుర్లు చెప్పే శత్రువులే దగ్గ రౌతారు."

వికల మానసంతో తిరిగి వంటింట్లో అడుగు పెట్టబోయిన మాధవిని బిగ్గరిగా అదిలించింది జానకమ్మ. "పోయి స్నానం చేసిరా. కుక్కల్నీ పందుల్నీ ముట్టుకుని తిరిగి వంటింట్లో అడుగు పెట్టకు. దిక్కుమాలిన అనాచారం.''

ముఖం చిన్నబుచ్చుకుని అక్కడే వరండాలో నిల్చుంది మాధవి. "ఏమమ్మోయ్ నేను స్నానం చేయాలి'' అంది పద్మ. ఎవర్ని ఉద్దేశించి అన్నదో తెలియక తలెత్తి చూడలేదు మాధవి.

"విన్నేనమ్మోయ్. నాకు వేడినీళ్ళు తోడు" అప్పటికీ మాట్లాడలేదు మాధవి.

"ఎంత నిర్లక్ష్యం! ఎంత గర్వం! ఏం చూచుకుని ఆ మిడిసిపాటు? ఈ ఇంటికి కాపురానికైతే రావచ్చు కాని ఈ ఇంట్లో మనుష్యులు పనికిరారా మాట్లాడటానికి?

మాధవి తలెత్తి చూచింది. "నన్నేనా పద్మా నువ్వంటున్నది?''

"లేకపోతే ఆ చెట్టునూ ఈ గోడనూ అనుకున్నావా?"

"నన్నే అయితే వదినా అని అనవచ్చుకదా? లేకుంటే సమాన వయస్సులో ఉన్నవాళ్ళం పేర్లెట్టి పిల్చుకోవచ్చునే? అలా మాట్లాడుతా వేమిటి?"

"చూడవే అమ్మా" ఏడుపుగొంతుతో పసిపిల్లలా ఫిర్యాదు చేసింది పద్మ.

జానికమ్మకు ఇక ఆధారం లభించింది. "అయ్యో, అయ్యో. ఆడబిడ్డని ఏమైనా గౌరవ ముందా? నువ్వు నువ్వంటూ మర్యాదా ఉన్ననా లేకుండా మాట్లాడమా? వెళ్ళి దానికి నీళ్ళు తోడిరా ముందు.''

చురుగ్గా చూచింది మాధవి. "చూడు పద్మా, నోటి కొచ్చిన విధంగా మాట్లాడేయ

తమే పనిగా పెట్టుకుంటే నాకూ వచ్చును మాటలు. కాని అది నా స్వభావంకాదు. గౌరవించి గౌరవం పొందడం నేర్చుకోవాలి."

"ఔనక్కా. వదిన రాగానే నువ్వు పనులన్నీ మరచిపోయావా ? ఆవిడ మనకు పనిమనిషికాదు" అంటూ అందుకుంది ఇందిర పూలసజ్జ క్రింద పెడుతూ. తిరిగి రోషంగా ఏదో అనబోయిన పద్మ గతుక్కుమంది; నోటిలోమాట నోటిలోనే అణిగి పోయింది. అది కనిపెట్టిన మాధవి 'అందుకు కారణమేమిటా ?' అని వసారా వైపు దృష్టి మళ్ళించింది. చక్రపాణి సబ్బూ, టవల్ తీసుకుని నూతి దగ్గరకు స్నానానికి వెళ్తున్నాడు. అందువల్ల జరుగబోయిన రాద్ధాంత మంతా ఆగిపోయింది. ఆ పెంకెపిల్లకు అన్నపట్లనైనా ఆమాత్రం భయభక్తు లున్నందుకు లోలోన సంతోష మైంది మాధవికి.

జానకమ్మ నోరుకూడ మూతపడింది. ధుమధుమ లాడ్తూనే పూజ కుపక్రమించింది.

"ఊం, కేశవాయనమః— ఇంక మన అధికార మేముంది తల్లీ ఎన్ని పాటున్నాయో మనకు మాధవాయనమః— మా రాజు చచ్చి ఏలోకా నున్నారో, వుండేందుకు కొంపైనా మిగిల్చిపోయారు. వీళ్ళిక ఇందులోకూడా వుండనివ్వరేమో ? గోవిందాయనమః— ఇంతకూ ఎవర్నినేం లాభం ? మన బంగారం మంచిదైతే ? వెళ్ళి స్నానంచేసి రావూ పద్మా. అచ్యుతాయనమః— మనకు చేసిపెట్టేనా శ్ళవళ్ళున్నారు, చేయించుకునే వాళ్ళేకాని !......"

విచారించడం మర్చిపోయి ఆశ్చర్యపోవడం మొదలుపెట్టింది మాధవి. తాను స్వయంగా పూజ చేసుకోకపోయినా చేసేవాళ్ళని చాలామందిని చూచింది. ఆ సమయంలో మనసు నిలుపలేకపోయినా వీలైనంతవరకు దైవచింతనంపై లగ్నం చేయటానికే ప్రయత్నించుతారు, సాధారణంగా. కాని ఇదేం విపరీతం — ఈవిడ దూషణభూషణ లన్నిటినీ సమదృష్టితో మేళవించుతోంది. అ దసలు దేవతార్చనేనా? లేక తాను భక్తురాలనని నల్గురికీ తెలుపడానికి చేసే ప్రదర్శనా ?

చక్రపాణి స్నానం ముగించి వచ్చేసరికి మాధవి గదిలో బీర్వాలో బట్టలు తీసి సిద్ధంగా వుంచి గదిని శుభ్రం చేస్తోంది.

"నువ్వు స్నానం చేశావా మాధవీ ?" అనడిగాడు బట్టలు వేసుకుంటూ,

ఒక్కసారి తలెత్తిచూచి తిరిగి తన పనిలో నిమగ్నమైంది.

"నిన్నటి పెళ్ళికూతురివి. ఇవ్వాళ ఈ పను లన్నీ మీద వేయడం బాధగానే వుంది మాధవీ. కాని నిస్సహాయుడ్ని." దగ్గరగా వచ్చి మాధవితల నిమురుతూ నిట్టూర్చాడు చక్రపాణి.

తేలికగా నవ్వేసింది మాధవి. "మనింటిపనులు మనం చేసుకుంటూన్నాం. దాని కంత నొచ్చుకోవటం దేనికి?

"హుఁ." కేలవంగా, నిస్సహాయంగా నవ్వాడు చక్రపాణి. "యే జమీందారు బిడ్డనో నీ అంతస్తులోవాడినే చేసుకొంటే మహారాణిలా, యేడాదివరకు నూతన వధువు ముస్తాబుతోనే వుందువు. "హనీమూన్"కు ఎన్నో ప్రదేశాలు తిరుగుదువు నన్ను కట్టుకున్నందుకు యేముచ్చటా లేకపోగా..."

"అబ్బ బ్బ బ్బ" అంటూ భర్తమాటలను సగంలోనే త్రుంచివేసింది మాధవి "మళ్ళీ ఆవిధంగా మాట్లాడితే నామీద ఒట్టే. నేను కోరి వరించిన పెన్నిధి మీరు సౌందర్యంలోగానీ, మనో నైర్మల్యంలో గానీ మిమ్మల్ని జయించినవా రెవరూ యే లక్షాధికార్లలోనూ లేరన్నసంగతి నాకు తెల్సు. మనిషి విలువను రూపాయణాలలో లెక్కించడం తెలివితక్కువ."

"అదృష్టవంతుడిని మాధవీ."

"చిన్న సవరణ. అదృష్టవంతులం అనాలి." ఇద్దరూ నవ్వుకొంటూండగా—

"వదినా" అంటూ ఇందిర వచ్చింది. "స్నానం చెయ్యి వదినా, తొమ్మిది కావచ్చింది."

"చేస్తాన్లే" అంది పరధ్యానంగా మరోదిక్కుకు చూస్తూ.

"ఏమంటే నే చేస్తానులే. నీ బట్టలెక్కడున్నాయి చెప్పు. తీసిపెడతాను."

ఛెళ్ళున కొట్టినట్లుంది మాధవికి. అప్పుడు గుర్తుకు వచ్చింది చక్రపాణికి; మాధవి కట్టుబట్టలతో వచ్చినట్టు. "ప్రేమతో మాట్లాడబోయినా ఎదుటివారికి బాధకల్గిస్తూంటాం కదా ఒక్కొక్కప్పుడు" అన్పించింది.

"ఇక్కడ కొంచెం పని చెప్పాను నేను. వస్తుందిలేమ్మా" అంటూ చెల్లెల్ని పంపేశాడు చక్రపాణి. తలొంచుకుని కిటికీదగ్గఱ నిల్చున్న మాధవికిదగ్గరగా నడుస్తూ "ఏమనుకోకు మాధవీ. ఇంతవరకు ఆ సంగతే మరచిపోయాను. ఎటువంటి చీరలు తెమ్మంటావు?"

మాధవి తలెత్త లేదు.

"ఏదీ, యిటుచూడు. ఎడుస్తున్నావా? ఏమి టీపని? మరిందాక నన్ను ఆలా మాట్లాడొద్దన్నావే! నువ్వు చేస్తున్న పనేమిటి? మరోసారి నువ్విలా ప్రవర్తిస్తే నామీద ఒట్టే. నువ్వెంతో ధైర్యస్తురాలివని నే ననుకొంటుంటే?" చెక్కిళ్ళమీద జాలువారే కన్నీళ్ళు తుడిచాడు. "కాలేజీకి వారంరోజు లుంది లీవు. మరో వారం



"...నేను చేయలేని పనంటూ లేదు భాయ్!"
"అయితే యీపని చెయ్యి – నా బిల్లుకూడా నువ్వే చెల్లించు!"

రోజులు పొడిగించి, వచ్చేటప్పుడు నీకు బట్టలు తెస్తాను. రేపు మెయిల్‌లో బయ ద్దేరి ఓ పదిరోజులపాటు కాస్త ఎక్కడైనా తిరిగివద్దాం. ఏమంటావ్?"

మెల్లగా సమాధానం ఇచ్చింది మాధవి. "కాదంటున్నందు కేమీ అనుకోవద్దు. నా కేం కష్టంగా లే దిక్కడ. సర్దుకు పోగలను. అదీకాక డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టడం దేనికి? వుండనియ్యండి."

ఒక్కక్షణం మౌనంగా చూచి "సరే. నీ యిష్టం. నేను బజారుకు పోయి వస్తాను."

"చీరలైనా పెద్ద ఖరీదుల్లో యేమీ వద్దు. పదమూడు, పధ్నాలుగుల్లో ఏవో నాలుగు చాలు."

జోళ్ళు తొడుక్కుంటూ నవ్వాడు పాణి. "అప్పుడే యింటి పరిస్థితంతా నాకంటె ఎక్కువ ఆకళింపు చేసుకొన్నట్టున్నావే?" అంటూ.

* * * *

"కొద్దిలో చాలంటే యిన్ని తీసుకొచ్చా రేమిటి?" అంది చక్రపాణి తెచ్చిన పాకెట్ విప్పుతూ మాధవి.

మాట్లాడకుండా బట్టలు మార్చి మంచంమీద పడుకున్నాడు పాణి.

"అత్తగార్ని పిలవనా?" అంది మాధవి చటుక్కున తలెత్తి.

"పిలుద్దా మంటావా? అవును, అలాగే బాగుంటుందేమో! వుండు నేను పిలుస్తాను" అంటూ "పద్మా. మంచినీళ్ళు తెచ్చిపెట్టు." అని పెద్దచెల్లెల్ని కేకేశాడు.

ఇందిర మంచినీళ్ళు తెచ్చింది. గ్లాసు అందుకుంటూ "అమ్మా, పద్మా ఏం చేస్తున్నారు?" అన్నాడు.

"అమ్మ భోంచేసి పెరటివసారాలో పడుకుంది. అక్క యేదో చదువుకొంటోంది."

"ఓసారి యిద్దర్నీ యిలా పిలువు. నువ్వుకూడా రా," అన్నాడు గ్లాసు యిచ్చేస్తూ.

ఇందిర వెళ్ళిపోయింది.

"ఎందుకమ్మా? నేను రాలేను. అయినా, గ్రుడ్డికన్ను మూసినా, తెరచినా ఒకటే." తల్లిమాటలు స్పష్టంగా విన్పించాయి చక్రపాణికి. ఉస్సు రంటూ లేచాడు ప్రక్కమీదినుంచి.

"రానక్కర్లేదు. నేనే వస్తున్నాను," అని బిగ్గరగా అని "రా మాధవీ మనమే వెళ్దాం" అంటూ బయటకు నడిచాడు.

"చూడమ్మా, ఈబట్టలెలా వున్నాయి? బాగున్నాయా?" అంటూ తెచ్చిన బట్టలన్నీ తల్లిముందు పరచాడు

పడుకున్న జానికమ్మ లేవలేదు; వాటిని చేత్తో ముట్టుకోలేదు. దగ్గర కూర్చుని వుత్సాహంగా చూడసాగిన ఇందిరను గుడ్లురిమి చూచింది పద్మ. మాధవి కలుగజేసుకుంది. "రా పద్మా. అలా దూరంగా కూర్చున్నావేమిటి? నువ్వూ, ఇందిరా నచ్చినవి తీసుకోండి. మిగిలినవి నేను తీసుకుంటాను" అంది సాదరంగా.

"పెళ్ళి పెద్దరికం తెస్తుందికాబోలు" అన్నాడు చక్రపాణి హాస్యంగా. విన్పించుకోనట్లు నటిస్తూ "ఏం పద్మా నీకేం నచ్చలేదా?" అంది మాధవి తిరిగి.

చురుకుగా చూచింది పద్మ. "నచ్చకకాదు వాటిని ఎంచుకొనే తాహతు నాకెక్కడిది? ఉద్దకంగుడ్డలు మినహా అలాంటి సిల్కులు మే మెప్పుడూ కన్నెత్తి చూచికూడా ఎరగం.''

తల్లి అందుకొంది. "అవునమ్మా. అటువంటివి లక్షాధికార్ల బిడ్డలకుగాని, నాకూ నా బిడ్డలకూ ఏందుకు?''

మాధవి ముఖం ఒక్కసారిగా వాడిపోయి భూమిలోకి కృంగిపోయింది. ఇందిర

భయంగా అన్నగారి ముఖంలోకి చూడసాగింది. కోపమంతా బలవంతంగా అపు కుంటూ క్రొత్తబట్టలన్నీ ఉంగచుట్టి గదిలో మంచంమీదకు గిర వాటేశాడు. "రా మాధవీ. నాకు అన్నంపెట్టు" అంటూ తాను నూతికేసి నడిచాడు కాళ్లూ, చేతులూ కడుక్కోడానికి.

"ఎందుకమ్మా అడుగడుగునా సూటిపోటి మాటలు. సంసారం చల్లగా సాగిపోవడం నీ కిష్టం లేదా?" ఇందిర మెల్లిగా తల్లిని మందలించబోయింది.

"నోర్మూయ్యవే భడవా. పట్టుమని పదహారేళ్ళులేవు — నాకు చెప్పొచ్చావు. అవును పెద్దవాడు వింటే చిన్నవాళ్ళు వింటారు. ఇహ యింతే ఈ సంసారం గతి!"

భోజనానికి వెళ్తూన్న చక్రపాణి నిలబడి అన్నీ విన్నాడు. "పదహారేళ్ళదైనా, పసిపిల్లయినా యుక్తాయుక్తజ్ఞాన ముండాలమ్మా? యేళ్ళకు పెద్దకాదు, పెద్దరికం నిలుపుకో గలగాలి" ఎన్నడూ కటువుగా మాట్లాడని కొడుకు నిష్ఠురోక్తులకు నిర్ఘాంతపోయింది జానికమ్మ.

పీటమీద కూర్చుంటూ "నా ఒక్కడికే వడ్డించావేం? నువ్వో మరి?" అన్నాడు భార్యను.

"నేనూ, ఇందిరా తర్వాత తింటాం. ముందు కానీయేం చక్రీ" అంది మాధవి.

తిరిగి చక్రపాణి యేదో అనేలోగా వసారాలో కూర్చున్న జానికమ్మ కొంపలంటుకుపోయినట్టు "అయ్యో, అయ్యో, యిదెక్కడి విడ్డూరమే. ఆడబిడ్డలనే కాకుండా మొగుణ్నికూడ నువ్వు నువ్వు అంటూ మాట్లాడ్తావా? ఇదుగో కోడలుపిల్లా, నువ్వీ విషయంలో ఎలావున్నా సరే నా కక్కర్లేదు కానీ, నీ గీర్వాణంమాత్రం యిక్కడ ప్రదర్శించడానికి వీలులేదు. నువ్వు లక్షాధికారి బిడ్డవైతే కావచ్చు కానీ, ఈ పేదయింటి కోడలివే. మొగుడనేవాడు బిచ్చగాడైనాసరే మన్నించితీరవలసిందే."

"అమ్మా!" ఆకటిపదునుమీదున్న చక్రపాణి సహనం పూర్తిగా కోల్పోయాడు. 'ఎందుకీ దొంకతిరుగుళ్ళన్నీ? చెప్పరాదూ. ఎక్కడికైనా పొమ్మని అంటేపోతాం. ఎందుకిలా అడుగడుగునా వేధిస్తావు?"

"ఇదేమిట్రా నాయనా?" కళ్ళింతంతచేసి, బుగ్గలు నొక్కుకుంది.

"నిన్నటివరకు నామాట కెదురుచెప్పనివాడ వెలా మారిపోయావ్ ఇంతలో! పెద్దముండాదా న్నని ఇది తగదు — అది కూడదు — అనకూడదట్రా."

ఎత్తబోతూన్న ముద్ద వదిలేసి విసురుగా లేచి వెళ్ళిపోయాడు చక్రపాణి నుదురు కొట్టుకుంటూ.

"అన్నయ్యా, అన్నయ్యా" అంటూ కూడా వెంబడించింది ఇందిర.

"మాధవి మెల్లగా అత్తగారివద్దకు నడచివచ్చింది. "స్నేహితుల మవడంవల్ల ఆలా పిల్చుకొనే అలవా టైంది. ఇకనుంచి అలా మాట్లాడను. క్షమించం డత్తయ్యా."

కోడలి అణకువపూరిత మైన సమాధానానికి జానికమ్మ కళ్ళలో మెరసిన సంతృప్తి, సంతోషం తృటిలో మాయ మయ్యాయి, పద్మ విసిరిన విసురుతో.

"స్నేహితులు గనుకే బుట్టలో వేసుకోగలిగావు, ఋష్యశృంగుడు లాంటి మా అన్నయ్యను. పైగా చెప్పుకోవటంకూడాను సిగ్గులేక."

దానికి జానికమ్మ కోపం అధిక మైంది. "నిక్షేపంలా పన్నెండు, పధ్నాలుగు వేల కట్నం రావలసిన నా బాబుకు నువ్వెక్కడ దాపురించావే — బోడిబొమ్మలా వచ్చి నిల్చున్నావు కట్టుగుడ్డలతో ?"

ఇక అక్కడ నిలువలేక కన్నీళ్ళు బలవంతంగా ఆపుకొంటూ గదిలోకి వెళ్ళి పోయింది.

అన్నను బ్రతిమాల్తూన్న ఇందిర మాధవిని చూచి యింకా ఖంగారుపడింది: "అదేమి వొదినా, నువ్వుకూడా వచ్చేశావు ? నిన్నేకాదు; ఆవిడ నన్నూ అలాగే అంటుంది. లెఖ్ఖజేసుకోకూడదు. ఇలా కోపాలు సాగించితే ఎలా ?'' అంది వదిన భుజంమీద చెయ్యి వేసి.

"నాకు కోపంలేదు ఇందిరా. మీ అన్నయ్యకోసం వచ్చాను." ఎంత ఆపుకున్నా ఆగకుండా కన్నీళ్ళు బొటబొటా రాలాయి.

ఇందిర నిట్టూరుస్తూ అన్నను చూచింది. అతడు నిర్లిప్తంగా మాధవిని చూస్తున్నాడు కన్నార్పకుండా — ఆ చూపులో ఎన్నో మూగబాధలు, ఎన్నో క్షమార్పణలు !

కొద్దిసేపు చూచి, "పోనీ యిక్కడికే తెస్తాను" అంటూ వెళ్ళిపోయింది ఇందిర.

ఆకలి చచ్చిపోయినా, ఇందిర నొచ్చుకుంటుం దని యిద్దరూకూడా భోజనాని కూర్చున్నారు.

"నీచేత యిలా చేయించుకోవడం నాకు చాలా సిగ్గుగా వుంది ఇందిరా. ఇవన్నీ నేను చేయవలసిన పనులు" అంది మాధవి మెల్లగా.

నెయ్యి వడ్డిస్తూన్న ఇందిర ముఖ మెత్తింది. "చూస్తూనే వున్నావుగా వచ్చిన దగ్గర్నుంచీ. క్రొత్తపెళ్ళికూతురి చుట్టూ యిటువంటి వాతావరణం చూచి నాకే సిగ్గుగా వుంది వదినా."

భోజనాలయ్యాక కంచాలు తీసేసి, తాంబూలం పట్టుకువచ్చి వదిన కిచ్చి క్రొత్త బట్టలు బీర్వాలో సర్దుతూంది ఇందిర.




"చూడమ్మా. ఒక్కసారిలా వచ్చి కూర్చో" అని పిల్చాడు చక్రపాణి చెల్లెల్ని

ఇందిర వచ్చి అన్నగారి కాళ్ళదగ్గర కూర్చుంది మంచంమీదే. కొద్ది ఎడంగా మాధవి పడకకుర్చీలో మేను వాల్చింది.

"ఏమి టన్నయ్యా పిల్చావ్ ?" అంది ఇందిర మెల్లగా.

"అవునమ్మా. చిన్నపిల్లవైనా నిన్నొక్క సలహా అడుగుతున్నాను, చెప్తావా?" అన్నాడు కళ్ళు బలంగా మూసుకుని కణతలు వ్రేళ్ళతో రుద్దుకుంటూ.

ఇందిర-ఆశ్చర్యంగా చూడటం మినహా ఏమీ జవాబు చెప్పలేదు.

అంతటి అన్నయ్యకు తన సలహా కావాలా !

"బొత్తిగా ఒకరినొకరు ద్వేషించుకుంటూ యిలా ఒకింట్లోనే మ్రగ్గడంకంటే ఎవరిమానాన వారు బ్రతకడం మంచిదేమో ?" అన్నాడు సూటిగా చెల్లెలి ముఖం లోకి చూస్తూ.

"అన్నయ్యా !" నిర్ఘాంతపోయిన ఇందు అంతకంటె మాట్లాడలేక పోయింది.

"అవునమ్మా. ఎంత కోడలైనా యిటువంటి వాతావరణంలో హీనంగా వుండ మనడం సబబా ? ఇంట్లోవాళ్ళం ఎలాగైనా సర్దుకుపోగలం. క్రొత్తగా వచ్చిన పిల్ల- అటు చొరవగా వుండటానికీ వీలులేదు. ఇటు మొహమాటంతో కూర్చోటానికీ వీలులేదు. అది ఎంతకష్టమో ఆలోచించావా ?"

ఇందిర చాలాసేపు మాట్లాడకుండా కూర్చుని కడకు అంది. "ఛాందసుల మాటలను లెక్కచేసినంతకాలమే కష్టంకాని, పట్టించుకోకుండా త్రోసుకుతిరిగితే యేగొడవాలేదు. నే నంటున్నా నని ఏ మనుకో కన్నయ్యా, ఇంట్లోవాళ్ళే ఇంతింత మాత్రంగా వుంటే ఇక బయటిప్రపంచం నీ కెలావుంటుందో ఆలోచించు. వేరే వెళ్ళిపోతే, నా కేదో కాలేజీగొడవా కాలక్షేప ముంటుంది; వదిన సంగతి ? యింట్లోవాళ్ళో, ఇరుగూ పొరుగో ఎవరో ఒక రుండాలికదా కాస్త మాటకూ, సలహాకూ ఎందుకైనా? వదినది చాల సున్నితమైన మనస్సు చేరి కూర్చుని అమ్మలక్క లాడే సూటిపోటి మాటలు వదిన అసలు భరించలేదు."

వాలుకుర్చీలో కళ్ళుమూసుకు పడుకున్న మాధవి లేచి కూర్చుని ఆడపడచు మాటలు వినసాగింది. చక్రపాణి ఆలోచిస్తున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

తిరిగి ఇందిరే అంది, "పెద్దాదొట మూలాన కొంత అసహనంగా ప్రవర్తిస్తుంది. కాని మనుష్యులు ఎల్లకాలం అలాగే వుండిపోతారా ? ఎప్పటికైనా అమ్మమనస్సు మారుతుం దని నా నమ్మకం. అంతవరకు మనకు ఓర్పు అవసరం."

"ఏమో' నా కా ఆశ లేదు" అన్నాడు నిట్టూర్పుతూ.

"అయినా నీ కా ఆలోచ నెలా వచ్చిం దన్నయ్యా. నిజంగా నువ్వు మమ్మల్నొదిలి వెళ్ళగలవా ? మాకు తండ్రివైనా, అన్నవైనా నువ్వేకదా ;" డగ్గుత్తికతో మాట్లాడ లేకపోయింది.

పడుకున్న చక్రపాణి త్వరగా లేచికూర్చున్నాడు. "లేదు ఇందిరా లేదు. ఇంక ఎన్నడూ అటువంటి ఆలోచన రానివ్వను" చెల్లెలిచెక్కిళ్ళపై కన్నీరు తుడుస్తూ అక్కున చేర్చుతున్నాడు. మాధవి లేచి ఇందిరదగ్గరగా వచ్చి తల నిమురుతూ. "ఎందుకు ఇందిరా అలా బాధపడ్తావు ? అటువంటిపని నేను జరుగనిస్తానా ? బాధో, సుఖమో, కష్టమో, నిష్ఠురమో యిది మనిల్లు. ఇక్కడే మనం జీవించాలి" అంది.

## 43

సంధ్యవేళ చల్లగాలికి దొడ్లో తులసికోట దగ్గర కూర్చుంది మాధవి. పాణి ఇంట్లో లేడు. షికారుకెళ్ళాడు. ఇందిర పూలమొక్కలకు నీళ్ళు పోయడం పూర్తిచేసి చేతులు తుడుచుకుంటూ లోపలికి పోబోతున్నన్నదల్లా మాధవి పిలుపు విని ఆగి కూర్చో వదినా ఇప్పుడే వస్తాను'' అంది. నాలుగునిముషాలలో పూలసజ్జతో తిరిగి వచ్చింది. గోడవార నున్న కనకాంబరం చెట్లపూ లన్నీ కోసుకొచ్చి వదినముందు పోసి తానూ కూర్చుంటూ "పూలు కడదామా వదినా ?'' అంది.

మాల కడుతూ "దొడ్లో మనం మంచి మంచి మొక్కలేసి పెంచుదామా ఇందిరా? ఈ వున్న వాటి కొక తీరూ, తెన్నూ లేవు; మంచివీ లేవు." అంది మాధవి. ఇందిర ముఖం సంతోషంతో విప్పారింది. "తప్పకుండా అలాగే చేద్దాం వదినా. నా కీ సరదా ఏనాటినుంచో వుంది. కాని ఎవరూ తోడులేక వూరుకున్నాను."

"ఏం పద్మకు యింటరెస్ట్ లేదా?"

"ప్చ్. దానిసంగతడగొద్దు వదినా? అనకూడదు కానీ ఒకదేమిటో దానికి ఒక్క టీ మంచిగుణంలేదు. వాళ్ళతో స్నేహం చెయ్యొచ్చు. వీళ్ళతో చెయ్యకూడదూ అనే జ్ఞానంలేదు. వూరికే ఇళ్ళట్టుకు తిరగడం, అందరితో డబడబ వాడడం, చెత్తపుస్తకాలన్నీ చదవటం, అయినదానికీ, కానిదానికీ అందర్నీ విమర్శించటం — యేమో, నా కేం నచ్చదు."

కొంచం సేపు వూరుకొని "పోనీ నువ్వు చెప్పి చూడకూడదూ?"

నవ్వింది ఇందిర. "నాకంటె పెద్దదానికి నే నేం చెప్పను? అయినా చెప్తే విని అర్థం చేసుకోగలవాళ్ళకు యేమైనా చెప్పినా ప్రయోజన ముంటుంది."

"మరి మీ అమ్మగా రేమీ అనరా?" ఆశ్చర్యంగా అడిగింది మాధవి.

పేలవంగా నవ్వింది ఇందిర. "అమ్మ గుణాలే దానికీ వచ్చాయసలు. తన ప్రతి మాటకూ తాళంవేస్తూ తనలాగే ప్రవర్తిస్తుందని అదంటే అమ్మకు అభిమానం. నేను స్తబ్ధంగా వున్నదున్నట్టే మాట్లాడ్తా నని నేనంటే లోలోపల అసహ్యం అమ్మకు

"నిజం?" ఆశ్చర్యం తాండవించింది మాధవి నేత్రాలలో.

"నువ్వే చూస్తావుగా! ఇప్పుడు చూడు, హాల్లో అమ్మ ప్రక్కింటావిడతో కబుర్లు పెట్టుకూర్చుంది. పోనీ మాట్లాడితే తప్పులేదు. ఇక ఆ సంభాషణలో రాని విషయమంటూ వుండదు. గృహవిషయాలన్నీ కూడ దాపరికంలేక చెప్పేసి, తను విమర్శించి వాళ్ళచేతకూడ నానామాటలు అనిపిస్తుంది. త నిలా వుంటే అడిగేవాళ్ళు లేక దానిదారిన అది షికార్లు తిరిగివస్తుంది అక్కయ్య. ఎక్కడి కెళ్ళా పనికూడ అనదు."

కట్టిన పూలమాలను మూడుగా త్రుంచి ఇద్దరూ చెరొకటీ తల్లో పెట్టుకున్నారు మూడవది తులసికోటమీద వుంచింది మాధవి. "పద్మ వచ్చాక యిద్దా" మంటూ

ఇందిర యేమీ మాట్లాడలేదు. సపోటా చెట్టుమీద చెయ్యివేసి, పరధ్యానంగా ఎటో చూస్తూ నిల్చుంది. చెట్టుమీదున్న చిలుక 'కేర్' అని అరుస్తూ ఎగిరిపోయింది

"చీకటిపడ్తోంది. లోపలికి పోదామా?" అంది మాధవి.

"ఊఁ. పద."

"దీపాలవేళైనా దీపం వేసుకోవా లని తెలియదు" జానికమ్మ పొరుగామె పితూరీ, లోపలకు వెళ్తూన్న మాధవి చెవిన పడింది.

మాట్లాడకుండా యింట్లోవున్న లైట్ల స్విచ్ వేసి గదిలోకివెళ్ళి కూర్చుంది ఏమిటో మనస్సుకు ప్రశాంతత లేక వెలికి వసారాలో కొచ్చి స్తంభా న్నానుకునిల్చు తనొచ్చి వారంరోజు లైంది. అయినా పుట్టింటివారికి అతీగతీ అక్కరలేకపోయ యేదో అప్పుడు తాత్కాలికంగా కోప మొచ్చినా తర్వాత తర్వాత తన ఎడబాటు కలిగిన విచారంలో తనపై కలిగిన కోపాన్ని మరచి క్షమించగలరనీ, తిరిగి సంబ బాంధవ్యాలూ, రాకపోకలూ నెలకొనగలవనీ ఆశించింది. కానీ అమిత ఆశ్చర్య మనకు మన ఆప్తులైనవారి గురించి అన్నీ తెల్సునుకొంటాం కానీ, నిజానికి రులను గురించి తెల్సినంతగా ఆప్తులనుగూర్చి తెలియనే తెలియదు. ఎవరి మాంసాలు పంచుకు పుట్టామో, ఎవరి ఒడిలో - లాలన పాలనలలో పెరిగి అయ్యామో వారికి మన హృదయంలో ఒక విశిష్టస్థాన ముంటుంది; రాగద్వేషపూ మైన యితర ప్రపంచ మంతటికీ దూరంగా అనురాగపు టాలయంలోని ప్రేమదేవ తమ హృదయ ప్రపంచంలో నెలకొని పూజ లందుకొనే ఆ మాతాపితలలో యితర మానవులవలె అసూయా, ద్వేషాలు, క్రోధం పట్టుదలా వున్నాయని సా పాషాణానికే లేనిరూపం కల్పించి కోవెల గట్టి ఆరాధిస్తున్నా మనీ సంతానం గు విభ్రాంతి పోయే దుర్దినం రానడం చాలదురదృష్టమే, కానీ తప్పదు; ఆ క్షణం మానదు. నిర్మల కాసారంలో అలలు రేగి కల్లోలమౌతుందని ఎక్కడో ఎవరో రిన రాయి వచ్చి పడకమానదు. అది ఎవరితప్పు కాకపోయినా, కల్లోలమై కల మ స్వకతప్పదు.'

"ఏమి టాలోచిస్తున్నావ్ మాధవీ ?" చక్రపాణి కంఠం విని వెనుదిరిగిచూ

"ఏమి టలా నిల్చున్నావ్? ఎవ రొచ్చారో చూడు!" అన్నాడు తిరిగి. మౌ భర్త ననుసరించింది మాధవి.

చక్రపాణి గదిలో కేశవరావు కూర్చుని వున్నాడు.

"అన్నయ్యా !" అంటూ సంతోషాశ్చర్యాలతో దగ్గరకు జేరింది మాధవి రోజుల కొచ్చావా నన్ను చూడటానికి ?"

మౌనంగా తల నిమరడంతప్ప మాట్లాడలేకపోయాడు కేశవరావు. అన్నా ళ్ళిద్దరి నేత్రాలనుండీ గంగాప్రవంతులు వెలువడ్డాయి. ఒక్కక్షణం చూచి మౌ బయటకు వెళ్ళిపోయాడు చక్రపాణి.